

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎండ వల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

## కూపన్

సెప్టెంబర్ 'చతుర' నవల : గ్రహణం

సమీక్షకుని పేరు:..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

# భక్తిముత్తులో...

తలదించుకొని నడుస్తున్న ఆమె తన అదృష్టానికి ఆనందపడు తోంది.

ఇంకా కొన్నిక్షణాలలో తాను శ్రీకృష్ణపరమాత్మలో ఐక్యం అవుతానని మురిసిపోతోంది.

ముత్తైదువలు ఆమెను గదిలో వుంచి తలుపులేసి బయటకెళ్లారు.

గదిబయట జనాలలో భక్తి ఏరులై ప్రవహిస్తోంది.

"హరేరామ... హరేకృష్ణ" అంటూ భజన చేస్తున్నారు.

గదిలో ఆమె కళ్లు మూసుకుని కృష్ణుని నామస్మరణ చేస్తోంది.

భక్తిలో పడి పరిసరాలను గమనించలేకపోయిందామె.

ఆమె వచ్చిన ద్వారంకాక మరో ద్వారం తెరుచుకొని ఇద్దరు వ్యక్తులు ఆ గదిలోకి అడుగుపెట్టారు.

భయంతో అరవబోయిన ఆమె నోరు నొక్కేసి భుజంమీదకి ఎత్తుకు న్నారు.

ఈ 'రోబోట్ యుగం'లో కూడా కృష్ణపరమాత్మలో ఐక్యం కావాలను కుంటున్న ఆమె ఎవరు?

ఆ పరమాత్మలో ఐక్యం కావడం వెనకవున్న రహస్యం ఏమిటి?

ఈ నాటకానికి సూత్రధారులెవరు?

**పేజీపేజీకి ఉత్కంఠను పెంచుతూ పాఠకులకు ఓ సాహసయాత్ర చేస్తున్న అనుభూతిని కలిగించే యం. రమేష్ రచన 'దైవప్రతినిధులు' అక్టోబరు నెల 'చతుర'లో చదవండి.**

**చతుర** రెండున్నర రూపాయలే

k of the town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk o

# చతుర

"మా ఇంట్లో లైబ్రరీకోసం
నవలలు కొనాలంటేనే
భయమేస్తోందోయ్
వాటి ధరలు
చూస్తుంటే!"

"దానికొక్కటే
పరిష్కారం - చతుర!
నెల నెలా ఓ ఉత్తమ
నవలతో మీ లైబ్రరీని
అలంకరిస్తుంది
చతుర!!"



విపుల

ఈరోజు కాలేజి డిబేట్‌లో ఇతర ప్రాంతాల్లోని జీవన విధానంగురించి అంత బాగా ఎలా మాట్లాడగలిగావ్?

నేను 'విపుల' పాఠకురాలిని: ప్రతినెలా దాదాపు పదిహేను భాషల కథల్ని, ఆయా జీవన విధానాల్ని తేటతెలుగులో చదివే అవకాశాన్నిస్తుంది 'విపుల'






# సామెత

**మూడవ బహుమతి రు. 50/-**

**పొందిన మినీ కథ**

వెంకట్రావు మాస్టారు క్లాసునంతా ఒకసారి కలయజూసి 'సైలెన్స్' అంటూ పిల్లలను నద్దుమణగచేశారు.

"ఇప్పుడు నేను ఓ సామెత చెబుతా. సామెత అంటే ఏమిటో తెలుసా?" అంటూ ప్రశ్నించారు.

పిల్లలెవరూ మాట్లాడకపోయేసరికి మాస్టారే చెప్పుకుపోయారు.

"మనకు జీవితంలో ఎన్నో అనుభవాలు జరుగుతూవుంటై. వాటిని పొందికగా ఒక చిన్న వాక్యంలో ఇమిడ్చి అందరికీ అర్థమయ్యేరీతిలో చెప్పుకుపోతూ వుంటారు అనుభవజ్ఞులు. మన పూర్వులు అలాంటివి అనేక సామెతలు చెప్పారు. ఈనాటికీ మనం వాటిని వాడుతూనే వున్నాం... తెలిసిందా?"

"అయితే మంచిసామెతలు కొన్ని చెప్పండి మేష్టారూ?" అని అడిగిందో అమ్మాయి.

వెంకట్రావుగారు క్షణకాలం వూరుకుని, "నేను సామెత చెబుతాగానీ, దాంతోపాటే మీకో పరీక్ష కూడా పెడతా. నేను చెప్పిన తర్వాత ఆ సామెతలాంటిదే మీరు కూడా ఏద్రైనా చెప్పాలి... సరేనా?" అన్నారు.

"ఓ..." అంటూ ఒక్కసారిగా క్లాసంతా అరిచింది. "అరువు సొమ్ము బరువుచేటు" అనే సామెత విన్నారుగా. దీని అర్థం ఏమిటంటే దేనినీ మనం అప్పుగా తీసుకొని వాడుకోకూడదు. దానివల్ల మనకు బాధలేతప్ప సుఖం వుండదని అర్థం. ఆ... మరి ఇలాంటిదే ఇంకోటి చెప్పండి మీలో ఎవరైనా" కుర్రాళ్లు ఒక్కొక్కరేలేచి తలా నాలుగు సామెతలు చెప్పారు.

"ఊహూ! నేను చెప్పిన సామెత అర్థమైంది కదా! అలాంటిదే, దాదాపు అదే అర్థం వచ్చేది మరోటి చెప్పాలి" అన్నారు మాస్టారు.

క్లాసులో పిల్లలంతా సరైంది ఏదీ చెప్పలేక

పోయారు.

చివరికి ఆఖరి బెంచీలో కూర్చునే రాణి లేవడంతో క్లాసంతా ఒక్కసారిగా గొల్లుమంది.

"నన్ను చెప్పమంటారా సార్..." అడిగిందా అమ్మాయి కొన్త తడబడుతూ.

"నువ్వా? సరే... నేను చెప్పిన సామెత అర్థమైందా? ఊ... చెప్పు" అన్నారు మాస్టారు. అమ్మాయికి కొన్త నత్తి.

"అర్థమైంది సార్" అందా అమ్మాయి.

"నేను చెప్పిందేమిటి?"

"అరువు సొమ్ము బరువు చేటు, అన్నారు సార్"

"ఆ... బాగా గుర్తుంది. ఇప్పుడు చెప్పు!"

"అరువు సొమ్ము బరువు చేటుకదండీ, మరేనండీ అట్టాగే... అరువు పుస్తకం చదువు చేటండీ"

అని పూర్తిచేసి కూర్చుందా అమ్మాయి.

క్లాసంతా గొల్లుమంది - ఒక్క మాస్టారు తప్ప.

పాపం! వెంకట్రావు మాస్టారు క్లాసులు మొదలయినప్పట్నుంచీ ఆ అమ్మాయి పుస్తకం ముందేసుకునే పాఠం చెబుతున్నారు.

– నాదెళ్ల హరప్రసాద్

# అతిథిదేవోభవ

మూడవ బహుమతి రు. 50/- పొందిన మినీ కథ

"నమస్కారం సుబ్బారావుగారూ!"

"అరె! రామారావుగారా...? ఎన్నాళ్ళకెన్నాళ్లకి...?

రండిరండి... ఎండనపడి వచ్చినట్లున్నారు! సరేగానీ, భోంచేస్తారా? టిఫిన్‌చేస్తారా?"

"టిఫెన్ చేస్తాలెండి!"

"చపాతీలు తీసుకొంటారా? ఉప్మాతీసుకొంటారా?"

"చపాతీలే మంచిది"

"మైదాపిండివా? గోధుమపిండివా?"

"గోధుమపిండివే!"

"నేతితో చేసినవా? డాల్డాతోనా?"



"నేతితో అయితేనే బావుంటాయి గదండి"

"గవర్నమెంట్ నెయ్యా? పల్లెటూరినె య్యా?"

"ఏదయితేనేంలెండి!"

"సరే... ఆవునెయ్యా? గేదెనెయ్యా?"

"గేదెదే ఆరోగ్యం అంటారుగదండీ"

"దేశీ గేదెలదా? సంకరజాతి గేదెలదా?"

"మీ అనుమానాలు వింటూంటే తలపగిలి పోతోంది గానీ ఓ కప్పు కాఫీ చూడండి ముందు"

"దానికేంభాగ్యం...? మామూలుకాఫీయా? ఫిల్టర్‌కాఫీయా?"

"మామూలు కాఫీ చాలు!"

"కాఫీలోకి డబ్బాపాలు మంచివా? డైరీపా లు బెటరా?"

"ఏవయినా ఫరవాలేదు"

"చెక్కెర ఉండాలా? అక్కర్లేదా?"

"నాకేమయినా డయాబెటిస్ ఉందనుకొ న్నారా? చెక్కెర కాఫీయే కావాలి!"

ఒక్కచెంచా చక్కెరచాలా? రెండుచెంచాలు ఉండాలా?"

"ఒక్కచెంచా చాలులెండి"

"చిన్నచెంచాడా? పెద్దచెంచాడా?"

"పెద్దచెంచాడయితే సరిపోతుంది లెద్దు రూ"

"కాఫీ గ్లాసులో తాగుతారా? కప్పులో కా వాలా?"

"ఈరోజుల్లో గ్లాసుతో ఎవరు తాగుతున్నా రండీ"

"అయితే కప్పుతో సాసరు కూడా ఉండాలా?"

"అక్కర్లేదు. మీకు, మీ ఆతిథ్యానికి ఓ నమస్కారం."

ఈసారి మీ ఇంటికి వస్తే ముఖంమీద ఉయ్యండి!"

"కిళ్ళీవేసుకొనా? మామూలుగానా?"

"మహాప్రభూ! మీఇంటికి చెప్పాపెట్టకుండా వచ్చినందుకు చెప్పుతో కొట్టుకోవాలి!"

"ఏ చెప్పుతో...? ఎడమకాలి చెప్పుతోనా? కుడికాలి చెప్పుతోనా...?"

"బాబోయ్... నన్నొదిలేస్తేచాలు!! వెళ్ళిపోతా ను!!"

"ఆ గుమ్మంలోంచా... ఈ గుమ్మం లోంచా...?"

—కె. హరిబాబు

---

# శిక్ష

**మూడవ బహుమతి రు. 50/-**
**పొందిన మినీ కథ**

అప్పారావు హఠాత్తుగా గుండెపోటు వచ్చి మరణించాడు. విషయం తెలిసి యమభటు లు హుటాహుటిన భూలోకం వచ్చి అప్పారావు ను సగౌరవంగా యమలోకం తీసుకుపోయారు.

మర్నాడు యమధర్మరాజు నిండు సభలో కొలువుదీరి ఉండగా అప్పారావును ప్రవేశపె ట్టారు. అప్పారావు యముడిని చూసిభయపడ లేదు సరిగదా చిరునవ్వుతో నమస్కరించేడు చిరకాల మిత్రునిలా. చిత్రగుప్తుడు చిట్టా తిర గేసి అప్పారావు పాపపుణ్యాలనన్నింటినీ ఒక్కొ క్కటిగా ఏకరవుపెట్టాడు. చివర్న "ఖాతాలో పుణ్యం పిసరంత కూడా లేదు" అని తేల్చేశా డు.

అప్పారావు చేసిన పాపాలు అన్నింటినీ ఓపిగ్గా విన్నాడు యమధర్మరాజు. తర్వాత గొంతు సవరించుకొని యమభటులవైపు తిరిగి 'ఈ మానవుడిని సలసలకాగే నూనెలో వేయించండి... మదపుటేనుగులచేత తొక్కించండి... అంకుశాలతో పొడిపించండి'... అంటూ 'నరకలోకపు మార్కు' శిక్షలన్నీ వరు సగా జారీ చేసాడు.

యమధర్మరాజు జారీచేసిన విధంగానే భటులు ఆయా శిక్షలు అప్పారావుకు అమలు జరిపారు రోజుల తరబడీ, నెలల తరబడీ.

చిత్రం!! ఎన్ని శిక్షలు విధించినా అప్పా రావు చిద్విలాసంగా చిరునవ్వుతో భరించాడే తప్ప చీమకుట్టినట్టుకూడా బాధపడలేదు.

అతడి ప్రవర్తన చూసి యమభటులకు



పిచ్చెత్తింది. ఏంచెయ్యడానికీ పాలుపోక అప్పారావును తీసుకెళ్ళి యమధర్మరాజు ముందు హాజరుపరిచారు.

విషయం విన్న యమధర్మరాజు ఆశ్చర్యపడ్డాడు. "చూడు అప్పారావూ... ఇది నరకలోకం. భూలోకంలో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఇక్కడ శిక్షలు అనుభవిస్తున్న ప్రతివారూ ఈ నరకబాధలకు తాళలేక అన్ని పాపాలు ఎందుకు చేసామా అని పశ్చాత్తాపపడతారు. అలా పశ్చాత్తాపం పడటం వలన మళ్ళీ పరిపూర్ణ మానవులుగా రూపుదిద్దుకుంటారు. మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. అయితే నీ విషయంలో అలా జరగలేదు. పశ్చాత్తాపపడటం మాట అలావుంచి, కనీసం బాధను కూడా వ్యక్తం చెయ్యలేదు. ఎందుకు అలా జరుగుతోందో చెప్పు...."

యమధర్మరాజు మాటలు విని అప్పారావు ఇలా అన్నాడు

"యమధర్మరాజా... మా భూలోక విషయాలు మీకు సరిగా తెలీవు. నేను మరణించక ముందు ఓ తెలుగు సినిమా థియేటర్‌లో 'ఆపరేటర్'గా పనిచేస్తుండేవాడిని. సినిమా వేస్తున్నంత సేపూ తెరమీద బొమ్మ సరిగ్గా పడుతోందో, లేదో చూడటం ఆపరేటర్‌గా నా బాధ్యత. తెలుగుసినిమాను ఒక్కసారి చూడటమే ఓ పెద్దశిక్ష. అలాంటిది ఆ థియేటర్‌లో ఆ సినిమాఆడుతున్నన్నాళ్ళూరోజూ మూడు నాలుగు ఆటలు చూస్తుండేవాడిని. అలా ప్రతి తెలుగుసినిమానూ కొన్ని వందలసార్లు చూసి బండబారిపోయాను. అందుకే మీ భటులు నాకిపుడు విధిస్తున్న శిక్షలు కష్టం ఏ మాత్రం కలిగించడంలేదు ఇవి చాలా చిన్నవి" అన్నాడు అప్పారావు చిర్నవ్వుతో.

యమధర్మరాజు అవాక్కయ్యాడు. సభికులు మూర్ఛపోయేరు. యమభటులు గజగజలాడిపోయేరు.

★ ★ ★

ఇప్పుడు యమలోకంలో పాతకాలపు శిక్షలకు లొంగని పాపులకు తెలుగుసినిమా చూపించడం ఆఖరి శిక్షగా అమలుజరుగుతున్నది. ఆ సినిమాలను ఆపరేట్ చేస్తున్నది మన అప్పారావే!!!

— ప్రహరాజు రాధాకృష్ణ

# చతుర

సెప్టెంబర్ 1987
సంపుటి : 10
సంచిక : 8


## ఈ నెల ప్రత్యేక నవల

సాహిత్యం అర్థంలేని సెంటిమెంట్లతో, క్షణికావేశాన్ని రెచ్చగొట్టే క్రైం, థ్రిల్స్‌తో అనవసరపు సస్పెన్స్‌లతో పెడదారి పట్టింది. కలుషిత భావాలు స్లోపాయిజన్‌లా పాఠకుల్ని పాడుజేస్తున్నాయి... పాఠకుల ఆలోచనాధోరణి ఆరోగ్యవంతంగా వికసించి, జీవితంపట్ల వారికి సరైన అభిప్రాయాలు ఏర్పడేందుకు సాహిత్యం దోహదంచేసి తీరాలి...

అంటుంది పత్రికాఫీసులో బాధ్యతగల ఉద్యోగిని సింధు.

పాఠకులకు కావలసింది సాహిత్యప్రయోజనాలూ, అభ్యుదయభావాలూకాదు. జీవితసత్యాలు చెప్పి వారిలో లేనిపోని ఆలోచనలు, భయాలు రేకెత్తించటం నాపనికాదు. వాళ్ళ నిత్యజీవితంలో అందని అందాల్ని, సుఖాల్ని చూపి ఓదార్చటమే, ఆశలు కల్పించటమే నా సాహిత్య ప్రయోజనం అంటుందా ప్రసిద్ధ రచయిత్రి.

అమ్మాయీ... నీదింకా కుర్రతనం. నువ్వు సాహిత్యం గురించి చెప్పేదంతా నిజమే. నేనూ ఒప్పుకుంటాను గానీ... మన పత్రిక అమ్మకాలు... అంటూ నసిగే ఎడిటర్.

ఈ మూడు రకాల సమకాలీన సాహితీ భావాల వైరుధ్యాల ఫలితంగా సాహిత్యానికి పట్టిన...

గ్రహణం

స్వరూప, స్వభావాలను ఆలోచనాత్మకంగా మలచిన...

వక్కలంక పద్మావతి

నవల 'గ్రహణం' 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన విశిష్ట రచన.



పుట్టింది కృష్ణాజిల్లా గుడివాడలో. పెరిగిందీ, పెరుగుతున్నదీ విజయవాడలో. తన రచనల ద్వారా పాఠకులకు చిరపరిచితురాలైన వక్కలంక పద్మావతి 'జీవిత యదార్థ స్వరూపాన్ని కళ్ళముందుంచేదీ, సమాజ అభ్యుదయానికి ఉపయోగపడేదీ, హృదయాన్ని స్పందింపజేసేదీ మాత్రమే ఉత్తమ రచన' అని విశ్వసిస్తూ ఆ కోవకు చెందిన రచనలే చేస్తున్నారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

సాయంకాలం అయిదు గంటలైంది. టైమ్ చూసుకొని గబగబ తన టేబులేమీద గుట్టలుగా పడివున్న కథల్ని సర్దేసి, ముఖాన కళ్ళజోడు ఓసారి తీసి అద్దాలు తుడిచి మళ్ళా పెట్టుకుని, హాండ్‌బాగ్ తీసుకుని బైటికి నడిచింది సింధు.

సింధు చదువుకున్నది. సంస్కారవంతురాలు. ఓ పత్రికాఫీసులో సబ్‌ఎడిటర్‌గా ఉద్యోగం. సాహిత్యంపట్ల ప్రత్యేకమైన శ్రద్ధ, వున్నతమైన భావాలు వుండటంవల్ల ఆ ఉద్యోగం ఆమెకు ఇష్టమైన అంశం అయింది. ఆమె సెన్స్‌ఆఫ్ హ్యూమర్ ఎవరినైనా ఇట్టే ఆకర్షిస్తుంది. ఇష్టంలేని విషయాన్ని ఎంత తీవ్రంగా వ్యతిరేకిస్తుందో... ఎక్కడైనా అన్యాయం లాంటిది కనిపిస్తే అంత ఆవేశపడుతుంది. అదీ ఆమె స్వభావం.

మెయిన్‌గేటు దగ్గరికి వచ్చేసరికి... హరనాథ్ లోపలికి వస్తూ కన్పించాడు. అతనో ప్రఖ్యాత రచయిత.

మనిషి చాలా సీదాసాదాగా వుంటాడతను. తనమీద తనకే శ్రద్ధలేదనడానికి నిదర్శనంగా పెరిగిన గడ్డం, విశాలమైన కళ్ళు, నుదురు... లోకంలో బాధలన్నీ తన హృదయంలో నింపుకుని తపనపడే తత్వం అతనిది.

అలాంటి వారిని సంఘం అర్థంచేసుకోదు. పైగా దూషిస్తుంది. అది లోకసహజం.

కొంతమంది దృష్టిలో మాత్రమే అతను ప్రఖ్యాత రచయిత. మిగతా అంతా అతన్నో పిచ్చివాడి కింద, పాఠకుల టేస్ట్ అర్థంచేసుకోలేని వెర్రిబాగుల రచయితగా ట్రీట్ చేస్తుంటారు.

అయితే అవేమీ అతను వినడు. తన ధోరణే తనది. అతని మనసులో ఏముందో ఎవరికీ అర్థంకాదు. నలుగురితో సరదాగా మాట్లాడడు. ఎదుటివాడి మెప్పు పొందటంకోసం తన వ్యక్తిత్వాన్ని వొదులుకుని హిపోక్రసీతో బతకటం అతనికిష్టం ఉండదు.

మనస్ఫూర్తిగా తనకు నచ్చిన మనిషైతే మాట్లాడతాడు. నచ్చిన విషయమైతే ఆచరణలో పెడతాడు. అదీ అతని పద్ధతి. అతను ఓ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా చేస్తున్నాడు.

అలా అతను ఇష్టపడి మాట్లాడే వ్యక్తుల్లో సింధు ఒకతె.

స్మోక్ చేస్తూ పరధ్యాన్నంగా లోపలికి రాబోతున్న అతన్నిచూసి 'హలో' అంటూ విష్ చేసింది సింధు.

తలెత్తి ఎదురుగా నిలబడ్డ సింధుని చూసి నవ్వి 'హలో' అంటూ పలకరించాడు.

ముక్కుమీదికి జారిన కళ్ళజోడుని చూపుడు వేలితో వెనక్కి జరుపుకుంటూ- "ఏమిటీ ఆఫీసు క్లోజ్‌చేసే టైమ్‌కి వస్తున్నారు. ఎడిటర్‌గారు ఇప్పుడే వెళ్ళిపోయారే" అంది.

"వెళ్ళిపోయారా?! ఇప్పుడు టైమెంతయిందో!" చేతివాచీ కేసి చూసుకున్నాడు.

అలా నిదానంగా, పరధ్యానంగా వాచీవంక చూచుకుంటున్న అతన్ని చూడగానే పెదవుల మీద చిరునవ్వు కదలాడింది సింధుకి.

'మానవ జీవితాలను కూలంకషంగా అన్వేషించిన మనిషి, ఎంత సీదాసాదాగా వున్నాడో! నలుగురి మెప్పుకోసం, అమాయక పాఠకుల చీప్ టేస్ట్‌ని అడ్డంపెట్టుకుని డబ్బు చేసుకునే మనిషికాదు. ఈ రోజుల్లో ఇలాంటి మనిషి ఎక్కడ కన్పిస్తాడు?!' అనుకుంది సింధు.

ఆమె అనుకోడమే కాదు నిజం కూడా అంతే.

ఈ యాంత్రిక నాగరికతా వ్యామోహం మనిషిని కీలుబొమ్మలా చేస్తున్నట్టే సాహిత్యం కూడా కల్పనలతో అర్థంలేని సెంటిమెంట్లతో పిచ్చిపిచ్చి థ్రిల్లింగ్స్‌తో, జుగుప్స కలిగించే ప్రేమలతో నిండిపోయి రోజు రోజుకీ దానివిలువ దిగజారిపోతోంది.

అలా మారిన ఈ సాహిత్యాన్ని రచయితల్ని చూసి అతని మనసు ఆక్రోశిస్తుంటుంది. నిజానికి జీవితంలో మనిషి ఎదురుగా నిలబడి ప్రశ్నిస్తున్న సమస్యల్ని చూపించటంకోసం, ఎటుచూసినా నిరాశ, నిస్పృహలతో అనివార్యమైపోయిన జీవితాలకోసం అతను కలం పట్టాడు. అయితే అదో గొప్పగా ఏనాడూ ప్రచారం చేసుకోలేదు. సామాజిక స్పృహ అని పెద్దపెద్ద పదాలూ వాడలేదు.

'సమాజం పట్ల బాధ్యతతో సాహిత్య సేవ ఏదైనా వుంటే జీవితంలో ఓ భాగంగా చేసుకో,




రచనల్లో దాన్ని చూపించు చాలు' అంటాడత ను.

నవలలు చదివి, భవిష్యత్తు గురించి భూ తల స్వర్గాలు వూహించుకుని, నవలల్లోలా బతకలేక పోతున్నామే అని బాధపడే ఎదిగీ ఎదగని పాఠకుణ్ణి తలచుకుని, జాలిపడు తుంటాడు.

అలాంటి సాహిత్యానికీ, దానికి అలవాటు పడిపోయిన పాఠకులకు రోషం ఎలావస్తుందా అని ఆలోచిస్తాడు.

కూలిపోతున్న వ్యవస్థనుచూసి, నూతన విలువలకోసం పాకులాడే ఈయన ఆలోచన లకు జీవం ఎప్పుడొస్తుందో! అనుకుంటూ వుంటుంది సింధు.

"ఆఁ, సింధూ! అయితే నే వెళ్తాను. రేపు కలుస్తాన్లే ఆయన్ని" అన్నాడు వెనక్కి తిరుగు తూ.

"పదండి... అందాకా నేనూ వస్తాను. మాట్లా డుకుంటూ వెళ్ళొచ్చు. మీకు వేరేపనేమైనా వుందా!" అని అడిగింది.

"అహాఁ, ఏపనీ లేకే ఇటువచ్చాను. పద నడుద్దాం" అన్నాడు సిగరెట్ ముక్కని దూ రంగా విసురుతూ.

ఎత్తువల్లాలుగా వుండే విశాఖ రోడ్డుమీద నడుస్తూ, రంగురంగుల యూనిఫారాల్లో మోయలేని భారాన్ని మోస్తూ, జారిపోతున్న స్కూల్ బ్యాగ్‌లు భుజాలమీదికి సర్దుకుంటూ, ఆ అలసిపోయిన ముఖాలతో ఇంటికి చేరు కుంటున్న ఉత్సాహంతో సృష్టికే అందాన్నిచ్చే చిన్నారుల్ని చూస్తూ, నరదాగా వారిని పలకరి స్తూ నడుస్తోంది సింధు.

సింధుకి అది అలవాటైన చర్యగా అతనికి తెలిసినా... ఆమెని చూసి నవ్వాడు.

సింధుకూడా నవ్వింది.

ఆకాశంలో మబ్బులు వేగంగా పరుగులెత్తు తున్నాయి. చందమామ భూమిని చల్లబరచ టానికి సిద్ధమవుతున్నట్టున్నాడు. చల్లటిగాలు లు వీస్తున్నాయి.

గాలికి నుదుటి మీద పడుతున్న ముంగురు ల్ని సర్దుకుంటూ "మాస్టారూ" అని పిలి చింది.

"చెప్పు సింధూ" అన్నాడు.

"ఈవారం మీ కథ 'కానుక' చదివాను. అద్భుతంగా వుంది. థీమ్‌చాలా స్ట్రెయిట్‌గా వుంది. హృదయాన్ని పిండుతూ... మనిషిని మనిషి ఎదుటపెట్టి ఆలోచింపచేసే విశిష్ట మైన కథ. చాలారోజుల తర్వాత మౌనంగా మననం చేసుకునే కథ.... మీలోంచి వచ్చిన కథ"

నిశ్చలంగా స్వచ్ఛంగా ఉన్నాడతను.

ఈ వివాహవ్యవస్థలో మనసుకంటే ఆ మనిషి తెచ్చే డబ్బుకే ఎంత ప్రాధాన్యత వుందో, అది ఎలా వుంటుందో చెప్పేకథ అత ను రాసిన 'కానుక'.

**మళ్ళీ తానే అంది-**

"**కథలో ఐలక్షైన సినిమాటిక్‌లు ఏడుపులు అర్బాటాలు లేవు.** కానీ హృదయాన్ని స్పందింపజేసే ఆవేదన వుంది. ఇటీజ్ ఏ నాచురల్ ఫినామినా. అయినా నన్ను చాలా కదిలించింది" అంది సింధు వుద్వేగంగా.

ఆ కథలో...

విశ్వం, కరుణ ఆదర్శవంతులైన దంపతు లు. ఇద్దరూ చిన్న వుద్యోగస్తులే. పిల్లలులేరు. తమ పెళ్ళిరోజు కానుకగా భార్యకేమైనా ఇచ్చి ఆశ్చర్యపరచాలని తను కూడబెట్టిన సొమ్ముతో ఆమె మెడలోకి బంగారు పుస్తెలతాడు చేయి స్తాడు. అది తీసుకుని ఇంటికి వస్తుండగా, ఆక్సిడెంటయి అతను మరణిస్తాడు.

ఆ దుఃఖంలో వున్న ఆమెకు... తమ ఎదు రింటి వారమ్మాయికి ఇరువర్గాలవారి మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం పుస్తెలతా డు చేయించలేని కారణంగా, పీటలమీద పెళ్ళి ఆగిపోయే పరిస్థితి ఏర్పడుతుంది.

పెళ్ళికూతురి దీనవదనం, ఆమెను కన్నత ల్లిదండ్రుల దుఃఖం కరుణను చలింపచే స్తుంది. తన భర్త ప్రేమతో చేయించిన ఆ పుస్తెలతాడు తీసుకెళ్ళి వారికిచ్చి పెళ్ళి జరి పించటానికింది.

టూకీగా కథ అంతే!

కానీ పేదరికానికీ, కోరికలకు మధ్య ఘర్షణ అద్భుతంగా చిత్రించాడతను. నేటి జీవిత



వాస్తవ చిత్రణ అక్కడ ప్రధానంగా తీసుకున్నాను.

ఆ కథ గురించి తన అభిప్రాయాలు వెల్లడిస్తూ అంది సింధు!

"కట్నకానుకలిచ్చి పెళ్ళిచేయలేకపోవటం అనేది పేదరికంవల్ల కలిగిన సమస్యకదా! అది వ్యక్తిగతమైన ఔదార్యంవల్ల పరిష్కరింపబడుతుందంటారా?"

"పరిష్కరింపబడక పోవచ్చు. వాస్తవ చిత్రీకరణతోపాటు సామాజిక దృక్పథం అనేదికూడా కథకు ప్రధానం. ఒక జీవితం తాలూకు యదార్థ స్వరూపాన్ని చెప్పడంతోపాటు పాఠకునిలో ఓ విధమైన చైతన్యం కలిగించటం రచయిత బాధ్యత. అందుకే ఇక్కడ కొంతమంది మనసుల్లో అనివార్యంగావుండే ఔదార్యం చూపించటం జరిగింది" అన్నాడతను.

"అంటే... పేదరికంవల్ల ఏదో గొడవలూ అవీ వచ్చి పెళ్ళిళ్ళు ఆగిపోవటం అనేది జరగటం సహజమేకానీ, ఏ ఒక్కవ్యక్తి ఉదారత్వం వల్లనో మీరు రాసిన సంఘటనల్లాంటివి జరగటం చాలా తక్కువ సందర్భాల్లో జరిగే విషయం. మరి అది సామాజిక వాస్తవం అవుతుందంటారా?" అని అడిగింది.

"ఎందుకు కాదు. జీవితంతో దగ్గర సంబంధం వున్న వాస్తవం... మనిషిలో మార్పు కోసం ఆధారం కల్పించే వాస్తవం.... ఇవన్నీ సామాజిక వాస్తవాలే! సామాజిక శ్రేయస్సు కోరి రాసేవే! వ్యవస్థలో మార్పుకోసం ఎదురుచూస్తూ, చుట్టూ సమాజస్థితిగతులతో మనకేం సంబంధంలేదనుకుని ఒకగొప్ప సైంటిఫిక్ ఫాంటసీ ఏమైనా రాయమంటావా ఏమిటీ?" అన్నాడు నవ్వుతూ.

"మైగాడ్! అంత పనిమాత్రం చేయకండి. నా ఈ చిన్నబుర్ర తట్టుకోలేదు" అంది గట్టిగా నవ్వుతూ.

హరనాథ్ కూడా నవ్వేశాడు.

"ఆఁ... సింధూ! ఈరోడ్డులోనే కదూ మీ ఇల్లు.

మరి నేవుంటాను. అలా కాస్త లైబ్రరీకి వెళ్ళి నాలుగు పుస్తకాలు తిరగేయాలి" అన్నాడు.

"మా ఇంటికి వచ్చి, కాస్త కాఫీ తీసుకుని వెళ్దురు రండి" అంది సాదరంగా.

"మరోసారి వస్తాలే! ఈ వేల్టికి నన్నొదిలెయ్యి సింధూ!" అన్నాడు సిగరెట్టు వెలిగిస్తూ.

"ఒకే ... వెళ్ళిరండి" అంది నవ్వు ముఖంతో.

"ఆఁ..." అనేసి అతను వెళ్ళిపోతుంటే రెండు నిముషాలు అలాగే చూస్తూ, ఇంటివైపు అడుగులు వేసింది సింధు.

సింధువాళ్ళది చిన్న డాబా ఇల్లు. ముందు చాలా విశాలమైన స్థలం పూలమొక్కలతో అందంగా వుంటుంది. వరండా దాటి లోపలికి వెళ్తే హాలు, దాని వెనుక రెండు గదులు. ఒకటి వంటకి, రెండోది తన టేస్ట్‌కి అనుగుణంగా తీర్చిదిద్దుకుంది సింధు. అందులో పెద్ద పుస్తకాల షెల్ఫ్, దాన్నిండా తెలుగు, ఇంగ్లీషు నావెల్సు, లిటరేచర్... మరోవైపు సోఫా. ఎదురుగా రెండు ఛైర్స్... కిటికీలోంచి సూర్యోదయాన్ని చూడ్డంకోసం ఓ ఈజీఛైర్ అక్కడ వేసుకుంది.

ప్రతిరోజూ ఉదయం సూర్యోదయం చూస్తూ కూర్చోటం ఓ అద్భుతమైన ఆనందం ఆమెకి.

సింధు తండ్రి, తల్లి చిన్నతనంలోనే పోవటం వల్ల నాన్నమ్మ ఆమెను పెంచింది. ఆమె స్వంత ఆస్తి ఆ ఇల్లు. పక్కపోర్షన్‌కి వచ్చే అద్దెతో సింధు చదువు, ఇల్లు గడవటం అన్నీ తనే చూసుకునేది. కొంత క్యాష్ బ్యాంకులో వుంటే దాని మీద వచ్చే ఇంట్రస్టు తన చీరలకు, సరదాలకు వాడుకునేది సింధు.

ఆమె చదువు పూర్తికాగానే ఉద్యోగం రావటంవల్ల వారి జీవితం సాఫీగా గడిచిపోతోంది. కాకపోతే ఆమె నాన్నమ్మకి ఒక్కటే బెంగపట్టుకుంది ఇప్పుడు. అది సింధు పెళ్ళి విషయం.

నాకిప్పుడే పెళ్ళేమిటే అని సింధు, ఇప్పుడు కాకపోతే ఎప్పుడు చేసుకుంటావే సంవత్సరం, తేదీలతో సహా చెప్పమంటుంది వాళ్ళ నాన్నమ్మ. అలాచేస్తే ఎక్కడైనా వెతికి ఆయుష్షు తెచ్చుకుంటాననంటుంది... మనవరాలి పెళ్ళివరకు బతికి వుండటంకోసం.

నవ్వేసి వూరుకుంటుంది సింధు.

సింధూకి ప్రేమ, పెళ్ళి వీటి మీద విరక్తి

భావాలేమి లేవుగాని, ఒకరికొకరు పరిచయం లేకుండా పీటలమీద కొంగులు ముడేసే పెళ్ళిళ్ళంటే కాస్త కలవరపాటు. అలా కాకుండా కాస్తోకూస్తో పరిచయం వుండి, ఒకరంటే ఒకరు అర్థం చేసుకుని... అప్పుడు పెళ్ళికి దిగితే కొంత మనశ్శాంతి అనుకుంటుంది.

కానీ, ఆమె మనసుకి దగ్గరయిన మనిషెవ్వరూ ఇంతవరకూ కనిపించలేదు. అందుకే వాళ్ళ నాన్నమ్మ పెళ్ళి ప్రస్తావన తెచ్చినప్పుడల్లా ఏదో ఒక వంక చెప్పి తప్పించుకుంటూ వుంటుంది.

సింధు గేటు తీసుకుని లోపలికి వచ్చేసరికి.... ఉదయం నుంచి అవీ ఇవీ చదవటం, ఆఫీసు వర్క్ చూడ్డంతో తలమునకలైన మనసు వున్నట్టుండి ఆహ్లాదంగా అన్పించింది తనకు స్వాగతం పలుకుతున్న పూలమొక్కల్ని చూడగానే.

అన్నీ పూలమొక్కలే.. చేమంతులు, గులాబులు, మల్లెలు, మందారాలు, నైట్‌క్వీన్స్ ఇంకా ఎన్నోరకాల మొక్కలున్నాయి. గులాబీలంటే ఆమెకు ప్రాణం. తుంచి ఒక్కపూవు తలలో పెట్టుకోదు, తల్లిని అంటిపెట్టుకుని గర్వంగా నవ్వుతున్నట్టుండే పువ్వుల్ని చూసి మురిసిపోతుంది.

సరాసరి ఇంట్లోకి వెళ్ళకుండా మొక్కలవైపు నడిచి ఒక్కో మొక్కని అపురూపంగా తాకుతూ, వాటిని పలకరిస్తూ వస్తూంటే... కుదుళ్ళలో తడితడిగా వుండటం గమనించి అప్పుడనుమానం వచ్చిందామెకు తనుకాకుండా ఈ మొక్కలకు నీళ్ళు పట్టిందెవరా అని.

'నాన్నమ్మ పోయలేదు, మరెవరూ?' అనుకుంటూ లోపలికి అడుగువేయబోతుంటే పక్కనే టాప్ దగ్గర కూర్చుని బట్టలుతుకుతూ మురళి కన్పించాడు.

మళ్ళీ వెనక్కి వచ్చి రెండడుగులు అతనికేసి నడిచి "హలో మురళిగారూ! ఏమిటీవేళ చాకిరేవు పెట్టేశారు?" అంది కళ్ళజోడు తీసి బాగ్‌లో వడేస్తూ.

ఆమెను గమనించని మురళి వున్నట్టుండి ఆమె కంఠస్వరం విని తడబడ్డాడు. లుంగీ సరిచేసుకుంటూ ఏడవలేక నవ్వుతున్నట్లు నవ్వాడు.

అతని అవస్థ చూసి పకపకా నవ్వింది సింధు. "చూశారా, వీరమ్మ పనికి రాక వారం దాటింది. ఈ బట్టలన్నీ ఎవరు వుతుకుతారు. రేపు ఆఫీసుకి వెళ్ళాలంటే ఒక షర్టు లేదు, పాంటులేదు. ఇంకా చెప్పాలంటే..." అతని వాక్యం పూర్తికాకుండానే సింధు చేయి అడ్డుపెట్టి, "ఆఁ... మీరు చెప్పనవసరం లేదు కానీ వీరమ్మకేమైంది?" అంది.

"హయ్యో... ఇన్ని రోజుల్నించి పనికి వస్తోందికదా, ఆమె సంగతి మీకు తెలియలేదంటే ఆశ్చర్యమే! మనం అడక్కుండానే మనిషి మనిషికి చెప్తుంటుంది కదా తనకథ.

కథేమిటి నాముఖం కథలు. రోజుకో కథ. మనకి ఓపిక వుండాలే కానీ రోజుకి కాదు ... గంటకో కథ వినిపిస్తుంటుంది

ఖర్మ. నాకే దొరికింది. ఆఫీసుకి వెళ్ళేవరకు ఏదో ఒకటి చెప్తూనే వుంటుంది. తను చెప్పే కథ నేను ఆఫీసుకు వెళ్ళేలోపు పూర్తికాకపోతే వీధిలోకి కూడా వచ్చేస్తుంది. ఆపైన ఆఫీసుక్కూడా వస్తుందేమోనని నా భయం. ఎలా అయినా వదిలించుకోవాలి. ఈసారి వస్తే పనిలోకి రావద్దని చెప్పేస్తాను" అన్నాడు లుంగీ బండకేసి బాదుతూ.

సింధు నవ్వాపుకో లేకపోయింది.

"ఇంతకీ ఆమెకేమైందీ చెప్పనేలేదు" అంది.

"మామూలు కథేనండీ సింధుగారూ! మొగుడుతాగుబోతు. రోజూ తాగొచ్చి ఈమెను కొట్టడం, ఆ దెబ్బలకు లేవలేక నాలుగురోజులు రెస్టు. నాపని మాత్రం ఔట్. జీతం మాత్రం కట్‌చేయకూడదు. ఈసారి చెప్పేస్తాను ... ఇంక నువ్వు పనిలోకి రానవసరం లేదని" అన్నాడు.

"అయ్యో ... అదేమిటండీ పాపం. మొగుడలా చితక్కొడితే ఓపికెక్కణ్నుంచి వస్తుందండీ పనిచేయడానికి" అంది.

"ఆహాఁ, ఎంతకాలం ఇలా వాడితో తన్నులు తింటూ కూర్చుంటుంది. వాడిని వదిలి బ్రతకొచ్చును కదా! ఊహూఁ ... అలా కుదరదంటుంది. సత్తెప్రమాణంగా పెళ్లి చేసుకున్నాం. కలిసే బతకాల, కలిసే సావాల అంటూ

ఏవో అర్థమైన స్టోరీలు చెప్తుంది" అన్నాడు కోపంగా.

సింధు అతన్ని ఓసారి నింపాదిగాచూసి నెమ్మదిగా అతని దగ్గరికి నడిచి, "నన్ను హెల్ప్ చేయమంటారా?" అంటూ హేండ్ బాగ్ పక్కన పడేసి బకెట్ ముందుకు జరుపు కుంది. బట్టలు జాడించటానికి.

ఒక్కసారిగా కంగారుపడిపోయాడు మురళి.

"నో నో ... మీరు హెల్ప్‌చేయటమా! ఇంకా నయం తప్పుకోండి ... తప్పుకోండి" అన్నాడు.

"ఫర్లేదు. పాపం మీరొక్కరే ఏం కష్టపడతారు. నేను హెల్ప్‌చేస్తే తప్పేమిటి!" అంది చొరవగా అతని షర్ట్ ఒకటి చేతిలోకి తీసుకుని.

"నథింగ్ ... మీరు వెళ్లండి. పాపం, ఆఫీసు నుంచి ఇప్పుడే కదా వస్తున్నారు. రెస్టు తీసుకోండి. మీనాన్నమ్మ మీకోసం వెయిట్ చేస్తున్నారు తెల్సా!" అన్నాడు ఆమె చేతిలోంచి షర్టు తీసుకుంటూ.

ఇంతలో రానేవచ్చింది వీరమ్మ పరుగుపరుగున.

"హయ్యో, బట్టలన్నీ మీరే ఉతికేసుకుంటున్నారా! సెమించండయ్యగారూ!" అంటూ.

అప్పటివరకు ఆమె కనిపిస్తే చాలు, ఇంక నీ ముఖం చూపించవద్దు అని గట్టిగా చెప్పేస్తానన్న మురళి వీరమ్మని చూడగానే ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

అదిచూసి సింధు కళ్లు వెడల్పు చేసుకుని చూసిందతన్ని.

"వచ్చావా, రా వీరమ్మా! శెలవు పెడితే పెట్టావులే! వంట్లో బావుండకపోతే నువ్వు మాత్రం పనెలా చెయ్యగలవ్. ఇప్పుడు కులాసాయేనా! మీ ఆయన కొట్టిన దెబ్బలు తగ్గాయా! తగ్గకపోతే చెప్పు ... ఏమైనా టాబ్లెట్స్ కొనిస్తాను" అన్నాడు ఆమెను చూసిన ఆనందంలో.

"ఆఁ ... ఏంకులాసాయోలెండి. వారంనాడు బాగాతాగొచ్చి వళ్లంతా ఇరగ్గొట్టేసినాడు నామొగుడు. ఈయాల లేచాను మంచంమీంచి. మంచంమీంచి ఇలాలేచినట్టుసూస్తే సాలండి. మళ్లా తాగొచ్చేస్తాడు. నాపని మామూలే ..." అంది నిర్లిప్తంగా వీరమ్మ.

"నాకో అనుమానం వీరమ్మా!" అన్నాడు భృకుటిముడిచి-

"ఏంటి బాబూ"

"నువ్వసలు మీ ఆయనకి భయపడి మంచం దిగటం మానేశావేమో అని నా అనుమానం" అన్నాడు మురళి.

"నిజమేనండి ... లేస్తే తంతాడేమోనని అలా మంచం మీదే తొంగుంటున్నా" అంది బట్టలు జాడిస్తూ.

ఆ మాటకి మురళితోపాటు సింధు కూడా నవ్వేసింది.

"ఏమిటీ ... వీరమ్మని పనిలోకి రావద్దని చెప్పేస్తానన్నారుగా! మరిప్పుడేమిటి ఇంత ఆనందపడిపోతున్నారు. మీరు చెప్పలేకపోతే చెప్పండి. నేనే చూస్తాను ఆమె వ్యవహారం. మాటిమాటికి ఇలా శెలవు పుచ్చుకుంటే ఎలా కుదురుతుంది. ఏదో మీరు ఒంటరిగా వుంటున్నారు కదా, అడిగే వాళ్లులేరు. తన ఇష్టమొచ్చినట్టు చేయచ్చనుకుంటుంది కాబోలు. చెప్పేస్తానుండండి రేపట్నించి రావద్దని" అంటూ "వీరమ్మా" అని పిలిచింది.

"ఏంటమ్మా" అంది బట్టల్లోంచి ముఖం పైకెత్తకుండా.

మురళి బేజారెత్తిపోయాడు. గబుక్కున ఆమె చేయిపట్టుకుని, "అంతపనిమాత్రం చేయకండి. తను మానేసిందంటే నాపాట్లు ఎలా వర్ణించమంటారు! ఈ రోజుల్లో సర్వెంట్సు తర్వాతే ఏదైనా అని అనుకోకపోతే లైఫేలేదు. ఏమంటారు" అన్నాడు బతిమాలే ధోరణిలో.

అమాయకంగా ముఖంపెట్టి అడుగుతున్న మురళిని చూసి సింధు పకపకా నవ్వింది.

ఆ నవ్వే వింటుంటే పరిసరాలు చైతన్యవంతమైనట్టుగా అనిపించిందతనికి.

"మిమ్మల్ని తమాషా చేద్దామని... అంతే" అంటూ సింధు లోపలికి నడిచింది. గుమ్మంలో నిలబడి వెనక్కి తిరిగి చూసిందో సారి మురళి వంక.

అతను చిరునవ్వుతో తననే చూస్తూ నిలబడ్డం చూసి చప్పున లోపలికి పరుగెత్తింది.

★ ★ ★



మురళి సింధువాళ్ళ ఇంట్లో అద్దెకుంటున్న ఒంటరివాడు, బుద్ధిమంతుడు కూడాను. అతని వినయవిధేయతలు చూసే సింధు నాన్నమ్మ తమ పక్కపోర్షన్ ఖాళీలేకపోవటంవల్ల తమ స్టోర్‌రూమ్‌గా ఉపయోగించే గదిలో సామానంతా తీసివేయించి అతనికి అద్దెకిచ్చింది.

అతను పనిచేసేది బ్యాంక్‌లో, నెలకు వెయ్యి రూపాయల జీతం.

మనిషి బాగా తెల్లగా, సరిపడ్డ ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు, అందం అమాయకత్వం మూర్తీభవించిన ముఖం. చూడగానే ఆకర్షించే పెద్ద కళ్ళు... ఆడవాళ్ళతో ఫ్రీగా మాట్లాడటానికి బిడియపడే తత్వం.

అతన్ని చూసినప్పుడల్లా సింధుకి నవ్వొస్తుందందుకే. తనంతటతనుగా ఎప్పుడూ పలకరించడు. అందుకే ఆమె వెళ్ళి అతన్ని పలకరించి సమాధానాలు రాబట్టుకుంటుంది. అప్పుడప్పుడు సినిమాల గురించి, పుస్తకాల గురించి కాసేపు మాట్లాడుకోడం, నవ్వుకోడం జరిగినా ఆకారణంగా చనువుగా సింధుతో మెలగలేడతను. అదీ అతని స్వభావం.

సింధు లోపలికి వెళ్ళి నాన్నమ్మ కోసం చూసింది. ఆవిడ వెనక పెరట్లో తోటకూర కోస్తూ కనిపించింది.

"ఇక్కడున్నావా నాన్నమ్మా! ఆకలేస్తుంది ముందు ఏదైనా టిఫిన్ పెట్టు" అంది కాళ్ళు కడుక్కుంటూ.

ఆవిడ వచ్చి రెండు దోసెలు వేసి ప్లేటు సింధుకిచ్చి, టీ పెట్టింది.

సింధు ప్లేటు తీసుకుని- "నేను వచ్చాక చెట్లకి నీళ్ళు పెట్టేదాన్నిగా నాన్నమ్మా! నువ్వెందుకు అంత శ్రమపడతావు. ఈ వయసులో నువ్వెంత విశ్రాంతి తీసుకుంటే అంత మంచిది" అంది.

"నేను పోయలేదమ్మా. చెప్తున్నా వినకుండా రోజూ మురళి మొక్కలకి నీళ్ళు పోస్తున్నాడు ఏంతోచడం లేదంటూ! పాపం సింధు ఆఫీసు నుంచి వచ్చేసరికి చాలా అలసిపోయి వుంటుంది. మళ్ళా ఈపని ఒకటా! వర్షాలేదు. కాసిని నీళ్ళు ఎవరు పోస్తే ఏమైంది' అంటూ తనే శ్రద్ధ తీసుకుంటున్నాడు. పిల్లాడు మాత్రం భలేబుద్ధిమంతుడమ్మా! ఈరోజుల్లో ఇలాంటి పిల్లలు ఎక్కడా కనిపించరు" అందావిడ.

"వూఁ నువ్వెప్పుడు అతన్ని పొగడకుండా వున్నావు గనక. ఉత్త బుద్ధావతారం" అంటూ లేచి చేయికడుక్కుని ఆవిడందించిన టీ కప్పు పట్టుకుని తన గదిలోకి నడిచింది సింధు.

* * *

"నమస్కారం సింధుగారు!" అంటూ వచ్చి ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది ప్రవీణాదేవి. ఆమె ప్రసిద్ధ రచయిత్రి.

మొదట్లో తన కథలు అచ్చులో చూసుకోడానికి ఏం తిప్పలు పడిందో, ఆ కథలెంత వరకూ సరైనవో తెలీదు కానీ, తర్వాత ఆమె కొచ్చిన పేరువల్ల ఆమెలో అహంభావం, ఫోజు విపరీతంగా పెరిగిపోయాయి. అందుకే ఆమె గురించి పత్రికాఫీసుల్లో స్టాఫ్ జోక్స్ వేసుకుని నవ్వుకుంటూ వుంటారు.

ఆమె రాకను గమనించి ఫైల్లోంచి తలెత్తి- "హలో! మీరా" అంటూ పలకరించింది సింధు.

"అవును ... ఏమిటి బాబూ దీక్షగా చదువుతున్నారు?" అంటూ ప్రశ్నించింది.

"ఏముంది! మీకథలు చదవటం మా ఉద్యోగ ధర్మం కదా! అదే చేస్తున్నాను. ఏమిటి చెప్పండి. విశేషాలు?! మా ఆఫీసుమీద దయకలిగిందే!" అంది తమాషాగా.

ఆమె అలా అడగటం తన క్రెడిట్‌గా భావించి గర్వంగా నవ్వింది ప్రవీణాదేవి.

"తప్పనిసరై ఇలా వచ్చాను. నేనిలా రావటం నాకెంత టైమ్‌వేస్టో మీకు తెలీదు. తెలిస్తే నాకథ విషయంలో ఇలా నెగ్లెక్ట్ చెయ్యరు" అందామె. ఆమెకు తెలియకుండానే ఆమె స్వరంలో కాస్త తీవ్రత చోటు చేసుకొంది.

అది గమనించిన సింధు ఆమె కథేమిటో, కమామిషేమిటో అర్థంకాక ఆమెనే అడిగింది విషయం చెప్పమని.

"నేను మీ పత్రిక కోసం ఓ కథ పంపించాను. రెండు నెలలైపోయింది. ఇంతవరకూ

దాని జాడేమిటో తెలీదు. ఇలా ఎప్పుడూ జరగలేదు. మీకు తెలుసో లేదో నా కథలు, నేను పంపిన రెండో రోజునే నెక్స్ట్ ఇష్యూలో వేస్తున్నట్టుగా ఇంటిమేట్ చేస్తారు. మీ నుంచి అదీలేదు, కథా తిరిగి రాలేదు. అదేమిటో తేల్చుకుందామని నా టైమ్ ఇలా కిల్ చేసుకున్నాను'' అందామె చాలా హైరానా పడిపోతూ.

ఆవిడ హైరానా చూసి సింధు- ''మంచినీళ్ళు తాగుతారా'' అంది శాంతంగా.

''వద్దు ముందు కథేమైందో చూడండి'' అంది విసుగ్గా.

''చూస్తాను. అసలు మీనుండి కథ వచ్చినట్లే జ్ఞాపకం లేదు నాకైతే! నా దగ్గరికే వచ్చిందో, మరో టేబుల్ దగ్గరికి వెళ్ళిందో చూడాలి ఒక్క నిముషం'' అంటూ డెస్క్‌లో చూసింది. లేదు. కప్‌బోర్డు చూసి, వెతికి ఓ కథ బైటికి తీసింది సింధు.

కుర్చీలో కూర్చుని కవర్‌లోంచి కథ బైటికి తీసి చూసింది సింధు. 'రిజెక్టెడ్' అని వుంది.



"వెరి సారీ ప్రవీణాదేవిగారూ! తిప్పి పంపటంలో లేటయ్యింది. అయినా రిజెక్ట్ చేసిన కథలు వెంటనే పంపించటం జరుగుతుంది. ఏదో పొరపాటున లోపల పడిపోయింది. వన్స్ ఎగైన్ అయాంసారీ" అంది.

అంతే! ప్రవీణాదేవి కళ్ళెర్ర చేసి చూసింది సింధు వంక.

కవరు ఆమె చేతికిస్తూ ఆమె ముఖంలోకి చూసిన సింధు ఖంగుతిన్నట్టు అయింది. ఆమె ముఖంలో మారుతున్న రంగులు తనని భస్మం చేస్తాయేమోనని భయం వేసింది.

"ప్రవీణాదేవిగారూ! ఏమిటలా.... " అంటూ.

ఏదో అడగబోయిన సింధుని కొరకొరా చూసిందామె.

"కథ రిజెక్ట్ చేయడానికి కారణం?" అంది సూటిగా చూస్తూ.

తేలిగ్గా ఊపిరిపీల్చుకుంది సింధు.

"కథ ఏమంత బావుండలేదు. మంచి కథొకటి రాసి పంపించండి ఈసారి" అంది మామూలుగా నవ్వుతూ.

ఆ సమయంలో ఆవిడ ముఖంలో ఎక్కడలేని ఆశ్చర్యం చోటుచేసుకుంది. ఆమె కళ్లల్లో చెప్పలేని కోపం...

"ఏమిటీ నాకథ నచ్చలేదా! అంతకంటె మీకు కథలు సెలెక్ట్ చేయటం తెలీదనో, కథలెలా వుండాలో, ఎలావుంటే పాఠకులు ఇష్టపడతారో తెలీదనో చెప్పండి ... సంతోషిస్తాను" అందామె.

ఈసారి ఆశ్చర్యపోవటం సింధువంతయింది. ఉన్నట్టుండి ఆమె అలా ఎందుకు ఇరిటేటవుతుందో అర్థంకాలేదు.

"అసలు కథ ఎందుకు నచ్చలేదు మీకు?" అంది కోపంతో. నా కథ నీకు నచ్చకపోవటం అనేది నీ అల్పత్వానికి, తెలివితక్కువకి నిదర్శనమే పిచ్చిదానా అన్నట్టు చూస్తూ అడిగింది సింధుని.

"ఆఫీస్‌లో డిస్కస్‌చేయటానికి ఎలా వీలవుతుంది?" అంది అసహనంగా.

అదేం పట్టించుకునే స్థితిలో లేదామె. తన కథ రిజెక్ట్ చేయబడటం భరించలేని అవమానంగా భావిస్తూ, కోపంతో రగిలిపోతోంది ఆమె హృదయం.

ఈ కుర్రదాని సంగతి తాడోపేడో తేల్చేసుకుంటే తప్ప మనస్సు శాంతించేలా లేదావిడకు.

అందుకే మళ్ళీ అడిగింది- "కథలో ఏం నచ్చలేదని?"

పెదిమలు బిగించి, తల అడ్డంగా వూపింది సింధు, "కథేమీ బావుండలేదు. ఎప్పుడూ ఫార్ములా కథలేనా! పాఠకులకు కావలసింది మెలో డ్రామాలు సస్పెన్స్ థ్రిల్లర్స్ కదు ... వైవిధ్యం. వైవిధ్యం వున్న కథలు. మీ కథలో మీరు సృష్టించిన మూడు పాత్రల్లో రెండుపాత్రలు కృతకంగా ప్రవేశపెట్టినట్లుంది కానీ కథలో అంతర్భాగమై కన్పించటంలేదు.

మామూలుగా మాకంటే మీరు... అంటే రచయితలు ఎక్కువ చైతన్యంవున్న మనుములుగదా! మనిషిలో రాగద్వేషాలను, జీవితాల్లోని అగాథాలను వెలికితీసి కథలుగా మలచండి" అంది కాస్త ఆవేశంగా.

ఆ మాటలు తేలిగ్గా కొట్టిపారేసింది ప్రవీణాదేవి.

"ఎందుకవన్నీ ... ఎవరికోసం? జీవితాల్లోంచి అగాథాలు బైటికి తీయడానికి మాకు వేరే పనేంలేదా! ఎవరెవరి జీవితాల్లో ఏమేం జరుగుతుందో, ఏమిటో తెలుసుకుని ఊరడించటం రాజకీయనాయకులు చేయాల్సిన పని. పత్రికలు చదివేది మధ్యతరగతివాళ్ళు. కాసేపు కాలక్షేపంకోసం వాళ్ళు పత్రికలు తిరగేస్తే... అందులోనూ వూకదంపుడేనా! ఇంక పత్రికాధిపతులు, వారి కుటుంబసభ్యులవరకూ మాత్రమే ప్రింటు చేసుకోవలసి వస్తుంది" అంది వ్యంగ్యంగా.

"పాఠకుల్ని చాలా తక్కువగా అంచనావేశారు మీరు. పెద్ద పెద్దచదువులు చదివినవారు కూడా తమగురించి తమకే శ్రద్ధలేకుండా పుస్తకాల పురుగులైనవారిని నేనెరుగుదును" అంది సింధు.

"పుస్తకాల్ని పురుగులుగా చూసే మేధావుల్ని నేనూ ఎరుగుదును" అంది దెబ్బతీశాను




## లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




**లైఫ్‌బాయ్**

**మురికిలోని క్రిములను వదలగొడుతుంది**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

అన్నట్లు చూస్తూ.

"అలాంటి అభివృద్ధి నిరోధకుల గురించి, చైతన్యరహితుల గురించి ప్రత్యేకంగా చెప్పుకునేదేమిటి?" అంది విసుగ్గా సింధు.

"ఎందుకులేదు. పత్రికలు చదివే పాఠకులు సామాన్యులు అని చెప్పటంకోసం అంటున్నాను. ఈ పాఠకులకు కావల్సింది సాహిత్య ప్రయోజనాలు, అభ్యుదయ భావాలు కాదు. లేనిపోని ఆలోచనలు రేకెత్తించి జీవితమంటే మరింత భయాన్ని, సందేహాన్ని కలిగించటమే అవుతుంది. అందుకే మేమలాంటివాటి జోలికిపోము" అందావిడ.

ఆమెకేం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు సింధుకి.

"అంటే, పాఠకుల ఆలోచనాధోరణి మారటానికిగానీ, వారు చైతన్యవంతులు కావటానికిగానీ, జీవితాన్ని గురించి ఖచ్చితమైన అభిప్రాయాలు చేసుకోడానికిగానీ, సాహిత్యం వల్ల వీలుకాదంటారు.

పాఠకుల మానసికస్థితి ఎంత అల్పంగా వుంటే, వారి ఆలోచనలు ఎంత అడ్డదిడ్డంగా వుంటే మీకంత డిమాండ్ అన్నమాట" అంది సింధు పళ్లబిగువున.

"అవును ... మాకు, పత్రికలకుకూడా డిమాండ్. అయినా ఆ విషయం నేను ప్రత్యేకంగా చెప్పాలా? మీరు పనిచేసేది పత్రికాఫీసులోనే కదా, మీకు తెలియనిదేముంది!" అంది గర్వంగా.

ఆ మాటలకి మండిపడింది సింధు.

"మా పత్రిక మీరనుకునే చీప్ టేస్టుని ఎంకరేజ్ చేయదు. కాబట్టి ఇంకెప్పుడూ అలాంటి కథలు పంపకండి. కథ రాయడం అనేది ఓ వ్రతంగా భావించాలి. పాఠకుల టేస్టుని అడ్డంపెట్టుకుని గంటకో కథ, నెలకో నవల రాసి పాఠకుల ముఖాన విసిరితే అవి చదివి, ఆలోచించే శక్తిలేక, అవగాహన చేసుకునే తెలివిలేక తప్పటడుగులువేసి జీవితంలో ఎదురుదెబ్బలు తింటూ కుమిలి పోయే వాళ్ళు ఎంతమంది? చేతికొచ్చింది రాయకండి. సామాజిక అవగాహన వుండాలి. విమర్శనా జ్ఞానం కావాలి. స్పందించే హృదయంతోపాటు కాస్తోకూస్తో జీవితానుభవాలు వుండాలి. అప్పుడే పాఠకుడి మనసునీ, మెదడునీ కదిలిస్తాయి. అదే కథలయొక్క అసలు ప్రయోజనం" అంది కాస్త తీవ్రంగా.

ప్రవీణాదేవి దిగ్గున లేచింది.

"నిన్నసలు సబ్ ఎడిటర్‌గా వేసిందెవరు? మిగతా అంతా కూడా నీలాంటివాళ్ళే అయితే త్వరలోనే మీ పత్రిక మూతపడుతుందని మీ ఎడిటర్‌తో చెప్తాను" అంటూ విసవిసా నడుచుకుంటూ బైటికి వెళ్ళిపోయిందామె.

సింధు అలాగే చూస్తూ వుండిపోయింది. ఎదురుగా టేబిల్‌దగ్గర కూర్చున్న రాంప్రసాద్ నవ్వుతూ అడిగాడు-

"ఎందుకు సింధూ ... ఆమెతో గొడవ. కథ వేసేసి ఓ నమస్కారం పెట్టేయక పోయారా! రేపు ఏదైనా సీరియల్ కావాలంటే బెట్టు చేస్తుందేమో?" అన్నాడు.

సింధు నుదురు చిట్లించి సీరియస్‌గా చూసింది అతన్ని. అతనలా మాట్లాడ్డం ఆమెకు నచ్చలేదు.

"ఆమె కథలు, సీరియల్స్ పడకపోతే నడవలేని స్థాయికి మన పత్రిక దిగజారిందా?! భ్రమలు, కాల్పనిక జగత్తు, వూహలు, సెక్స్... ఛ. అంతా ట్రాష్. రచన చేయడం ఓ బాధ్యతగా తీసుకోవడంపోయి, ఉబుసుపోకకు రాయడం, ఆ చెత్తంతా మనమీద రుద్దడం ... ఎంతకాలం సహిస్తారు పాఠకులు. చూద్దాం ... ఏం చేస్తాందో" అంది. ఆమె గొంతులో ఆవేశం, మాటల్లో పదును తొంగి చూశాయి.

ముఖం నిండా స్వేద బిందువులు అలుముకున్నాయి. మనసులో భారం దిగిపోయేలా ఓ నిట్టూర్పు విడిచి కర్చీఫ్‌తో ముఖం అద్దుకుని కళ్ళజోడు పెట్టుకుంది.

మరో అరగంటకి కానీ ఆమె ఆ టెన్షన్ నుంచి బయటపడలేకపోయింది. 'నా కథ ఎందుకు వెయ్యరు? నా కథ మీకెందుకు నచ్చలేదు' అని ఆమె దబాయించటమే సింధుకి తలచుకుంటే ఎక్కడలేని ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది.

లంచ్ అవర్‌లో తన ఫ్రెండ్ మాలతికి ఈ విషయం చెప్పింది.





మాలతి నవ్వి ఆపైన అంది- "ఎందుకు నువ్వు రిజెక్టు చేయటం! సహజంగా పేరున్న వాళ్ళ కథలు, నవలలు తిప్పిపంపడం జరగదు. పాఠకుల అభిరుచో, ఆవిడ అదృష్టమో, పత్రికల ప్రోత్సాహమో ఏదో ఒకటి ఆమెను బిజీ రచయిత్రిగా నిలబెట్టాయి. ఇప్పుడు ఆమెతో నువ్వు గొడవపెట్టుకున్నా లాభం వుండదేమో అనుకుంటున్నాను. ఆ కథ వేయించేవరకు ఆవిడ నిద్రపోదు" అంది మాలతి.

"పోనీయ్. అయినా పాఠకులు మనమనుకునే ధోరణిలో ఏంలేరు. వీళ్ళు ఏది రాస్తే అది నమ్మే స్థితినుంచి ఇప్పుడిప్పుడే బయటపడుతున్నారు. ఈ ట్రాష్‌ని త్వరలోనే మంటపెట్టి కొత్తదనాన్ని చైతన్యాన్ని కోరుకుంటారు. చూస్తుండు ... అలా జరగదంటావా? సరే ... సాహిత్యం ఓ అరాచకంగా తయారవుతుంది. అంతే" అంది సింధు నిబ్బరంగా.



మాలతి ఏం మాట్లాడలేకపోయింది. మౌనంగా చూస్తూ కూర్చుంది.

మాలతి అన్నట్టుగానే నెక్స్ట్ ఇష్యూలోనే ప్రవీణాదేవి కథ అచ్చయింది. ఊహించని పరిణామం ఏమీ కాకపోయినా రిజెక్ట్‌చేయబడ్డ కథ అచ్చవటం చూసి, ఆశ్చర్యాన్ని అణచుకో లేకపోతోంది సింధు.

"మాలతీ! ఇలా ఎలా జరిగిందంటావు? నేవెళ్ళి ఎడిటర్‌ని అడగనా? నేను రిజెక్ట్‌చేసిన కథను స్వీకరించినందుకు కాదు నా బాధ ... ఆమె దగ్గర నన్నెంత షేమ్ చేసినట్టు! ఎడి టర్స్ మనకిచ్చే విలువ ఇదేనన్నమాట" అంది ఉక్రోషంగా.

మాలతి నవ్వి ఆమెను పూరడించింది.

"ఆవేశపడకు సింధూ ... ఇలాంటివి మామూలే! అంత సీరియస్‌గా తీసుకోవలసిన పనిలేదు. ఆమె కథ అచ్చుకావడం వెనుక మనల్ని షేమ్‌చేయాలనే వుద్దేశం ఎందు కుంటుంది? ఏదో ఎదిగీఎదగని పాఠకులు ఫలానా రచయిత్రి కథ అద్భుతం.. మహా ద్భుతం అంటూ చేతికొచ్చినట్టు వుత్తరాలు రాస్తే అదంతా తమ క్రెడిట్‌గా భావిస్తూ అజ్ఞా నంగా ప్రవర్తిస్తారు. రచయితలైనంత మాత్రాన వారికి విశిష్టమైన వ్యక్తిత్వం వుంటుందనుకో వడం పొరపాటు. వీళ్ళనలు మామూలు మనిషి స్థాయికిక్కూడా తక్కువే. అందరూ అనికాదు కొంతమందిని నేను చూశాను" అంటూ ప్రపంచంలోని వైవిధ్యం, వైరుధ్యం ఎలాంటివో చెప్పింది కాసేపు సింధూకి.

చాలా తీవ్రమైన ఆలోచనలో మునిగిపోయి నట్లుగా కొద్దిసేపలాగే కూర్చుండి పోయింది సింధు. ఎందుకో ఆమె మనసు కలతపడినట్ల యింది.

ఆమె మనసులో ఎన్నో సందేహాలు. సమా ధానాలు దొరకని సందేహాలు... అస్పష్టమైన ఆలోచనలు. ఏమాత్రం కళాతృష్ణలేని మనుషు లు ఏదో సాధించాలనీ, ఎవరినో అధిగమించా లనీ చేసే ప్రయత్నాలు చూస్తుంటే... నిస్పృహగా వుందామెకి.

మాలతి ఆమెవంక చూసింది. దీక్షగా ఎటో చూస్తున్న సింధు, ఏదో దీర్ఘాలోచనలో మునిగిన ట్లు గ్రహించి ఆమె భుజం మీద చేయివేసి అంది మాలతి- "నువ్వాలోచించేది ఏమిటో, నువ్వు దేనికి పరితపిస్తున్నావో నాకు తెలును. నీసందేహాలు చాలా చిన్నవి. బతుకుపుస్తకంలో నీకన్నీ అర్థమవుతాయి. ఇంతసెన్సిటివ్‌గా ఆలోచిస్తే ఎలా, ఇంక ఆవిషయం వదిలె య్యి" అంది మాలతి.

కాని ... సింధు మనసు జరిగిపోయిన విషయాన్ని మరిచిపోలేకపోతోంది. ఆ కథని, కథనాన్ని తలచుకున్నకొద్దీ హృదయం రగిలి పోతుంది. ఇంక అక్కడ ఒక్క నిముషం కూడా ఆగకుండా తన సీట్‌దగ్గరికి వెళ్ళి, నోటింగ్ పాడ్ తీసుకుని, స్ప్రింగ్‌డోర్‌ని ఒక్కతోపుతోసి ఎడిటర్ రూమ్‌లోకి వెళ్ళింది.

ఎడిటర్ జయరామ్ చాలా సీరియస్‌గా జర్నలిజమ్ బుక్స్ తిరగేస్తూకన్పించాడు. ఆయనకి దగ్గరదగ్గర, ఏభైయేళ్ళుంటాయి. మనిషి పచ్చని పసిమిరంగు. ఎదుటిమనిషి తత్వాన్ని ఇట్టే చదివేయగల మేధస్సు, నేర్పు తోపాటు ప్రపంచాన్ని చదవగలిగిన అనుభవం కూడా ఆయనలో వున్నాయి. చురుకైన కళ్ళతో పాటు, హుందాతనం ఉట్టిపడుతూవుంటుంది.

చేతిలోని పాడ్, వీక్లీ విసురుగా టేబుల్‌మీద పడేసింది.

ఆ శబ్దానికి చివ్వున తలెత్తి చూశాడాయన. ఎదురుగా నిలబడ్డ సింధుని, టేబుల్‌మీద పడేసిన పాడ్‌నీ, వీక్లీని మార్చిమార్చి చూశాడు.

ఆ సమయంలో ఆమె కళ్ళల్లో కోపాన్ని ముఖంలో ఉద్వేగాన్ని చూసిన జయరామ్ పెదవులమీదకు చిరునవ్వు తెచ్చుకుని- "ఏమిటిలా దండెత్తావు సింధూ" అని అడిగా డు.

ఆయనకు సింధు మనస్తత్వం బాగా తెలు సు. మంచి సినిమాగానీ, మంచి మనిషినిగాని, మంచికథగానీ చూసినప్పుడు ఆమెమనసు ఎంతగా స్పందిస్తుందో, తనకు నచ్చనిదీ, తన వ్యక్తిత్వానికి దెబ్బతగిలేదీ ఏదైనా జరిగితే అంతగా ఆవేశపడిపోతుంది.

జంకూగొంకూ వుండవు. ఏ విషయానికీ భయపడదు. ప్రవర్తనలో ప్రత్యేకత ఏదో వుంటుంది!




ఆమె ముఖంలో కదలాడే భావాలకి కారణాలు ఊహిస్తూ- "ముందుకూర్చో సింధూ!" అన్నాడాయన నోటింగ్‌పాడ్ చేతిలోకి తీసుకుంటూ.

ఆమె కూర్చోలేదు. టేబుల్‌మీద వీక్లీ చేతిలోకి తీసుకుని, ప్రవీణాదేవి కథ పడ్డపేజీతీసి, పుస్తకం ఆయన ముందుకు జరిపి, "ఏమిటిది?" అంది.

ఆయన కళ్ళజోడు ఒకసారి సవరించుకుని, కథపేరు, రచయిత్రిపేరు చదివి,"కథ... ప్రవీణాదేవి రాసినకథ. ఏమైంది?" అన్నాడు.

"ప్రవీణాదేవి రాసిందని నాకుతెలుసుసార్! నేను ఈ కథని ఓ వారం క్రితం రిజెక్ట్ చేశాను. ఆమె మన ఆఫీసుకి వస్తే భద్రంగా ఆమె చేతికిచ్చి, ఆ కథ నా 'కెందుకు నచ్చలేదో, అందులో లోపించిందేమిటో, ఉండవలసిన లక్షణాలేమిటో స్పష్టంగా చెప్పాను. ఆరోజే ఆమె ఈ కథ 'ఎందుకు పడదో చూస్తానంటూ' సవాల్‌చేసి వెళ్ళింది. ఆమె చెప్పినట్లే జరిగింది. ఎలా జరిగింది?" అంది చాలా పదునుగా.

ఆయన నిశ్చలంగా నవ్వాడు. ఆయనస్వభావమే అంత. మిన్ను విరిగి మీదపడినా చలించడు. ఉద్వేగంలేదు. చాలా కూల్‌గా క్షణాలమీద అంచనాలు వేసి ఆచరణలోపెట్టగల సమర్థుడు. అందుకే ఆయన ఎడిటర్‌గా ఇరవైఏళ్లుగా ఆ స్థానాన్ని ఏలుతూ, పత్రికను నంబర్‌వన్ స్థాయికి తీసుకురాగలిగాడు.

సింధుక్కూడా ఆయన తత్వం బాగా తెలుసు. ఒక సారి ఆయన సెలెక్ట్‌చేసే కథగానీ, నవలగానీ చూసి ఆయన టేస్ట్‌కి సంబరపడిపోతుంది. మరోసారి పరమ చెత్తగా వున్నకథ కూడా ప్రచురించి, ఏదో ఒకకారణంతో దాన్ని ఆయన సమర్థించటం చూస్తే చిర్రెత్తుతుంది.

అలాంటి సందర్భాల్లో తీరుబడిగా కూర్చుని ఆయనతో పోట్లాడుతుంది. ఆర్గ్యూ చేస్తుంది. అంత చనువు వుంది ఆయన దగ్గర. అందుకే ఆయనంటే ఒక పక్క అభిమానంతోపాటు, కించిత్తు కోపం, బాధ లేకపోలేదు.

క్షణం గడిచేకొద్దీ ఆవేశంతో ఆమె గుండె వేగం పెరుగుతోంది.

"నేను రిజెక్ట్ చేసిన కథని మీరు వేశారంటే... మాకు మీరిచ్చే వాల్యూఏమిటి? అందుక్కూడా నేను బాధపడటంలేదు. ఏముందా కథలో. రెండువందలపేజీల నవల రాయటం కంటే మంచి కథ ఒకటిరాయటం కష్టమనే విషయం మీకు తెలియందికాదు" అంది.

"నిజమే సింధూ! అన్నీ నువ్వనుకునే లక్షణాలతో కథలుండాలంటే ఎలా సాధ్యం చెప్పు. అలాంటి కథలు వచ్చినప్పుడే వేయండీ అంటే లక్షలతో స్టార్ట్‌చేసిన సంస్థని నడిసముద్రంలో ముంచివేయటమే అవుతుంది. ఆ హక్కు మనకెక్కడిది! మారుతున్న కాలాన్నిబట్టి మనిషి ఎలా మారాడో కథలు, నవలలు కూడా జడపదార్థాల్లా చీకటిలో నడుస్తూ, పాఠకుల్ని కూడా చీకటిదారిలోనే నడిపిస్తున్నాయి. మార్పుకోసం నువ్వూ నేను అరిస్తే నోరెండి దప్పికొస్తుంది. ఫలితం శూన్యం. అంతే!" అన్నాడాయన.

"నో..." అని గట్టిగా అరిచింది సింధు.

"మీరు... మీరు కూడా ఇలాఅంటే ఇక పత్రిక ఏ స్థాయికి దిగజారిపోతుందో, ఈ సాహిత్యం ఏదారిపడుతుందో తలుచుకుంటే గుండె రగిలిపోతోంది. మీలానే ప్రతి ఎడిటరూ ఇలా అనుకోబట్టే పత్రికలు భద్రంగా దాచుకునే సంపదలా కాక, పొట్లాలు కట్టుకోడానికి ఉపయోగించే చిత్తుకాగితాలకు ఉపయోగపడుతున్నాయి. ఆ నోటింగ్‌పాడ్‌లో నోట్‌చేశాను చూడండి... ఆ కథ ఎంత చప్పగా, అనందర్భంగా వుందో! ఒకసారి రిజెక్ట్ చేయబడిన కథ, అదే పత్రికలో వచ్చిందంటే... ఫైనలైజ్ చేసిన మీదే తప్పు" అంది ఉక్రోషంగా.

ఆయన ఒక్కక్షణం ఉలికిపాటుగా కదిలాడు.

"కథ చూశారా ఎంత లెంగ్తీగా వుందో! అనవసరపు పాత్రలన్నీ ప్రవేశపెట్టేసింది. బ్రివిటీ లేకపోతే ఎలా? చాలా పెద్ద విషయాన్ని కూడా చిన్న కథలో పవర్‌ఫుల్‌గా వ్యక్తంచేయవచ్చునే, మరి ఇదేమిటి? కథంత ఉపయోగమైనది మరొకటి లేదుకదా! అలాంటి కథల విషయంలో మీరిలా నెగ్లెక్ట్‌గా వుంటే ఎట్లా?" అంది రొప్పుతూ.

ఆయన సర్దుకుని, "అదికాదు సింధూ! ఆ

కథ రిజెక్ట్ చేయబడినట్టు నాకసలు తెలియందే! ఆమె డైరెక్ట్‌గా నా చేతికిచ్చింది. ఓవర్‌లుకింగ్‌లో ప్రెస్‌కి వెళ్ళిపోయింటుంది. ప్రతి పాయింట్‌కి సాహిత్య ప్రయోజనం వుండాలంటే... సాధ్యమయ్యేపనికాదు. పాఠకుల్లో మంచి క్రేజ్‌వున్న రచయిత్రి ఆమె. పాఠకులకు కావలసింది మన భావాలూ, అభిప్రాయాలూ కాదు... కథను పాత్రలతో ట్విస్ట్‌చేయిస్తూ, ఏదోవిధంగా సెన్సేషన్ సృష్టించడం. పాఠకుల టేస్ట్‌మేరకు ఆమె రాస్తుంది. అది ఆమె తప్పని ఎలా అనగలం?'' అన్నాడాయన.

ఆయన మాటలు వింటున్నకొద్దీ సింధు రక్తం మరిగిపోతున్నట్టనిపించింది.

'పాఠకుల టేస్ట్... టేస్ట్' అంటూ తమ అజ్ఞానానికి, మూర్ఖత్వానికి వాళ్ళని బలిపెడుతూ, అటు పత్రికలు, ఇటు రాసేవాళ్ళూ డబ్బుచేసుకుంటూ సాహిత్యాన్ని అధోగతిపాలు చేస్తున్నందుకు ఆమె హృదయం ఆక్రోశిస్తోంది. ఏ సంస్కర్త, ఏ సాహితీపరుడు వీళ్ళను మార్చగలడు!!?

"పాఠకుల టేస్టులో మార్పువల్లే ఇలాంటి సాహిత్యం పుడుతుందీ అంటే... దశాబ్దాలు గడుస్తున్నా శరత్ సాహిత్యాన్ని, టాగూరు కథల్ని, గురజాడ, చలం, చిలకమర్తి, అడవి బాపిరాజు... వీళ్ళంతా రాసిన పుస్తకాలను కోరి అన్నిసార్లు ప్రింట్లు ఎందుకు... ఎందుకు వేయించుకుంటున్నారు!

వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద, చింతా దీక్షితులు వ్యవహారిక భాషలో రాసిన అద్భుతమైన కథల్ని ఇప్పటికీ ఎందుకంత పడిపడీ చదువుతున్నారు?

పాలగుమ్మి, రాచకొండ, చాసో, మధురాంతకం రాజారాం, బలివాడ కథల్ని ప్రిజర్వ్ చేయమని పాఠకులు ఎందుకు కోరుతున్నారు?

వినోదంకోసమే అయినా పంచతంత్రంలో మనిషిలోని బుద్ధినంతటినీ విశ్లేషించి చూపాడే చిన్నయ్యసూరి! ఇప్పటికీ కొత్తగానే అన్పించి చదువుతూనే వున్నాం... ఎందుకు?

దిగజారింది పాఠకుల టేస్టుకాదు... రాసేవాళ్ల అజ్ఞానం అనండి. సంకుచితమైన ఆలోచనలతో, కమర్షియల్ మైండ్‌తో సాహిత్యానికి వికృతరూపం దిద్దుతున్నారు.

ఒక బాధ్యతాయుతమైన సీట్‌లో కూర్చుని అక్షరమాలతో సాహిత్యకళనే చైతన్యవంతం చేయాల్సిన మీరు... ఈరకమైన కథల్ని సమర్థించటం. ఐకాంట్ టాలరేట్... ఐకాంట్ టాలరేట్' అంటూ కుర్చీలో కూలబడింది.

"సింధూ! నువ్వేనేది..."

"ఐ డోంట్ వాంట్‌టు లిజన్ ఎనీథింగ్ సర్..." అంటూ చేతులు అడ్డుపెట్టింది మాట్లాడవద్దంటూ.

ఆయన మౌనంగా వున్నాడు. సింధుని చూస్తుంటే ఆయనకి ఓపక్క ఆనందంగానూ, మరోవైపు ఇన్ని కాంట్రడిక్షన్స్ మధ్య ఈరకమైన భావాలతో, ఉద్దేశాలతో ఈమె మనుగడ ఎలా సాగిస్తుందా అని కలవరంగానూ అనిపించింది.

సాహిత్యంపట్ల ఆమె శ్రద్ధకీ, భక్తికీ, విలువకీ ఆయన హృదయం ఉప్పొంగిపోతుంటుంది అప్పుడప్పుడు. మనసులో అభిమానంవున్నా... మాటల్లో కోపం, అధికారం ప్రదర్శిస్తూనే వుంటాడాయన.

ఆమెకూడా అంతే! ఒక మంచి జర్నలిస్టుగా ఆయన్ని ఎంత అభిమానిస్తుందో, వ్యక్తిగా చిరాకు పడుతుంటుంది.

ఆ అయిదు నిమిషాల మౌనంతో... ఆమె ఆవేశం కాస్త తగ్గింది. కుర్చీలోంచి లేచి నిలబడి పాడ్ చేతిలోకి తీసుకుని, మౌనంగా బైటికి వెళ్ళిపోయింది.




లంచ్ అవర్‌లో టిఫిన్‌బాక్సులు తీసుకుని డైనింగ్‌హాల్లో కూర్చున్నారు సింధు, మాలతి.

మాలతి చేయి కడుక్కురాలేదు. బాక్స మూత తీయనూలేదు. మౌనంగా కూర్చుంది.

ఉదయం ఆఫీసుకి వచ్చిన దగ్గర్నుండి సింధు ఆమెను గమనిస్తూనేవుంది. ఏదో ఆలోచిస్తూ, ఏమైనా అడిగితే పరధ్యాన్నంగా సమాధానమిస్తూ ఫైల్లోంచి తల బైటపెట్టలేదు మాలతి.

సింధు ఆఫీసులో అందరినీ నవ్వుతూ పలకరిస్తుంది. ఆ చిరునవ్వే, మర్యాద వుట్టిపడే ఆ పలకరింపే ఆమె అంటే అందరికీ ఓ ప్రత్యేకమైన అభిమానం ఏర్పరచింది. సింధు అందరినీ పలకరించినా ఆమెకు మాలతితోనే అటాచ్‌మెంట్ ఎక్కువ. పైగా పక్కపక్క టేబుల్సు. కథలు, కాకరకాయలగురించే కాకుండా జనరల్ టాపిక్స్ గురించి కూడా సరదాగా మాట్లాడుకుంటూ, జోక్స్ వేసుకుంటూ వుంటారిద్దరూ.

అలాంటిది ఉదయం నుంచి ఆమె మౌనం భరించలేకపోతోంది సింధు. కారణం ఊహించలేకపోతోంది. అందుకే మాలతిని



నవ్వించడానికి ప్రయత్నించింది రెండుమూడుసార్లు. అయినా మాలతిలో మార్పు లేదు.

తనని నవ్వించాలనీ, మామూలు మనిషిని చేయాలనీ ఆమె పడే తాపత్రయం చూస్తుంటే మాలతి మనసు ఆమెపట్ల ఆత్మీయతతో నిండిపోయింది.

మాలతికి తల్లి, తమ్ముడు రాజు తప్ప మరెవరూ లేరు. తండ్రి మూడేళ్ల క్రితం ఓ యాక్సిడెంట్‌లో ప్రాణాలు కోల్పోయాడు. ఆయన ఆర్.టి.సి.లో ఉద్యోగం చేసేవాడు. ఆయన గ్రాట్యుటీ, ఎల్.ఐ.సి. పాలసీవల్ల వచ్చిన మొత్తం యాభైవేలు బ్యాంకులోవేసి, దానిమీద వచ్చే వడ్డీతోనూ, మాలతికి వచ్చే జీతంతోనూ కుటుంబ జీవనం సాఫీగా గడుపుతున్నారు వాళ్ళు.

మాలతికి తమ్ముడంటే ప్రాణం. చురుకైన పెద్ద కళ్ళు, కాస్త ఎండవేడి తగిలితే చాలు కందిపోయే తెల్లని తెలుపు, సన్నని మీసాలు, లేతగా, అందంగా వుంటాడు. అందమైన రూపంతోబాటు ఈకాలం పిల్లలకు భిన్నమైన తరహా అతనిది. ఇంట్లో పరిస్థితులెలా వుండనీ, తనకు మాత్రం మంచి డ్రెస్ లేకపోతే కాలేజీకి వెళ్లను, అన్నం తినను అని అలిగికూర్చునే ఈతరం అబ్బాయి కాదు తన తమ్ముడు అని మురిసిపోతుందామె.

ఏది పెడితే అది తిని, వున్నంతలో శుభ్రంగా తయారై వెళ్ళేవాడు కాలేజీకి. అతను బికామ్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయినపుడు రెండు జతల బట్టలు, ఖరీదైన వాచీ ఒకటి కొని అతనికి కానుకగా ఇచ్చింది.

తల్లి తర్వాత తల్లిలా తనని ఆదరించే అక్కని చూస్తే దైవం అంటే ఆమే అనే భావం నిండిపోతుందతని మనసులో.

"అక్కా! ఇంతకాలం నా చదువు గురించి పెళ్ళిచేసుకోకుండా కాలం గడిపేశావు. ఇప్పుడు పూర్తయిపోయింది కాబట్టి నువ్వు పెళ్ళి చేసుకోవాలి. నీకు పెళ్ళయి, బావగారు వస్తే మరింత అండ, ఆదరణ వుంటుంది కదా!" అన్నాడు.

మాలతి నవ్వి అప్పటికి అలాగే అంది. కానీ ఆమెకు పెళ్ళిమీద ఆసక్తి లేదు. వేలకువేలు కట్నమిచ్చి పెళ్ళిచేయగల స్థోమత తమకు లేదు. బ్యాంకులో వున్న డబ్బు కాస్తా కట్నంగా ఇచ్చి తల్లిని, తమ్ముడిని బికారులుగా చూడలేననుకుంటుందామె.

పోనీ వాళ్ళని కూడా తమతోపాటే ఉండనివ్వగల సంస్కారవంతుడైన మనిషెవరైనా దొరుకుతాడా అంటే... ఆ ఆశఆమెకు లేదు. అందుకే ఆమెకు పెళ్ళిపట్ల ఓ విధమైన నిర్లిప్తత ఏర్పడిపోయింది.

ఏమిటి తన జీవితం? ఇలా సంపాదిస్తూ తల్లినీ, తమ్ముడినీ పోషిస్తూ గడపడమేనా! వారి మంచిచెడ్డలు చూడ్డంకోసమే దేవుడు తనని సృష్టించాడా అని దేవుణ్ణి కానీ, మీకోసమే నేను నా ఆనందాలనన్నిటినీ త్యాగం చేస్తున్నానని తల్లినికానీ ఏనాడూ దూషించలేదు. మనసు పొరల్లో కూడా ఆ భావం తొంగిచూడలేదు.

తన గురించి తల్లిపడే తాపత్రయం, ఆవేదన; తమ్ముడు చూపించే ప్రేమ, ఆప్యాయత ఇదే ఆమెను పెళ్ళిలేకపోతేనేం, హాయిగా బతకలేనా అనిపించేలా చేశాయి.

మాలతి తల్లిమాత్రం తన కూతురికి మంచి సంబంధం చూడమని అయిన వాళ్ళందరికీ చెబుతూనే వుంటుంది. ఉన్న డబ్బుతో కూతుర్ని పెళ్ళిచేసి పంపిస్తే తప్ప ఆవిడకి మనశ్శాంతి లేదనిపిస్తుంది.

రాజు చదువెలానూ పూర్తయింది కాబట్టి ఏ క్లర్క్ పోస్టో దొరక్కపోదనీ, అతనికిచ్చే మూడు నాలుగు వందల్లో ఏకలో గంజో తాగి బతకవచ్చని ఆమె వుద్దేశం.

తల్లి తన పెళ్ళికి పడే ఆరాటం చూస్తుంటే నవ్వు, బాధ రెండూ కలుగుతుంటాయి మాలతికి.

రాజు చదువు పూర్తయి సంవత్సరం గడిచిపోయినా–

అతనికి ఉద్యోగమూ లేదు. మాలతికి సంబంధమూ కుదరలేదు.

ప్రతినెలా రాజు అప్లికేషన్స్‌కీ, ఇంటర్వ్యూలకీ, అతని చదువుకి కూడా కొంత ఖర్చు అవుతుంది. అయినా అతనికేదైనా మంచి ఉద్యోగం వస్తే తమ కష్టాలు గట్టెక్కుతాయని




వాళ్ళ ఆశ.

ప్రతిదీ అందినట్టే అనిపించి చేజారిపోవటం ప్రతిభకు సరైన విలువలేని దేశంలో పుట్టిన మనిషికి మామూలే! డబ్బో, పరపతో లేక ఆ రెండూ వున్న మనిషి ప్రాపకమో వుంటే తప్ప ఈ వ్యవస్థలో నిలదొక్కుకోడం కష్టమనే విషయం అతని లేతవయసుకి అనుభవం అయింది.

రోజురోజుకీ అతనిలో ఓ విధమైన బాధ, నిరాశ పెరగటం గమనిస్తూనే వుంది మాలతి. వీలైనప్పుడల్లా అతనిలో ఉత్సాహం, ధైర్యం కలిగించటం ఓ పనిగా పెట్టుకుంది. నిరాశలో పడ్డ మనిషి ఎలాంటి డిప్రెషన్‌కి లోనౌతాడో నని ఆమె భయం.

వాడు భోంచేయకుండా పడుకోడం, సదా స్తబ్దంగా కూర్చోటం చూస్తే ఆమెకు బాధకలిగేది. అందుకే మాలతి అతనితో అంది ఓరోజు-

"రాజూ! నిండా ఇరవై ఏళ్ళు కూడా లేవు. ఎందుకంత నిరాశ నీకు. ముందు బోలెడంత జీవితం వుంది. నేను బతికేదే మీకోసం. నువ్విలా డల్‌గా కూర్చుంటే నేను నవ్వుతూ తిరగ్గలనా! చూడు ... సి.ఎ.కి అప్లై చేయి ... ఎంత ఖర్చయినా ఫర్వాలేదు. అసలు అప్పుడే నువ్వు ఉద్యోగం కోసం ప్రయత్నించడం నాకిష్టంలేదు. నిన్ను చదివించటం నా బాధ్యత, ఆనందం. అంతే!" అంది.

అతను ససేమిరా ఒప్పుకోలేదు.

"ఇప్పటికి చదివిందే చాలా దండగనిపిస్తుంటే... ఇంకా చదవమంటున్నావా! ఏ కారు షెడ్‌లోనో పడేస్తే ఈపాటికి ఓనర్నై వుండేవాడిని. ఆర్థికమైన నిలకడ లేకపోతే మనిషిలో ఉత్సాహం ఎలా వస్తుంది చెప్పక్కా?" అన్నాడు నిర్వేదంగా.

"నీకేమంత వయసు మించిపోయిందని అంత తాపత్రయం. తినటానికి సరిపడినంత వుంది, సమస్యల్లేకుండా బతగ్గలగటమే జీవితం రాజూ! నీకు నేనున్నాను. నువ్వు హాయిగా చదువుకో ... ప్లీజ్" అంది బతిమాలుతూ మాలతి.

"ఇంతకాలం నీమీద ఆధారపడేకదా గడిపాను. నా కాళ్ళమీద నేను నిలబడగలిగే వయసొచ్చినా... ఏమి చేయలేకపోతున్నానే అని గిల్టీగా వుంది. ఒక్కోసారి ఎక్కడికైనా పారిపోవాలనిపిస్తుంది. నా కోసం ఇంత శ్రమపడ్డ మీ ఇద్దరినీ పోషించాలనీ, ఉద్ధరించాలని అనుకోడం తాపత్రయపడ్డం ఎలా అవుతుంది ... అది నాబాధ్యత, ధర్మం కాదూ!" అన్నాడు.

అంత బాధలోనూ ఆమెకు నవ్వొచ్చింది అతని మాటలకి.

'నీమొహం' అని అతని నెత్తిమీద మొట్టి- "బరువు బాధ్యతలు మోసే రోజులు ముందున్నాయి. ఇప్పుడు వాటి గురించి నువ్వేం దిగులుపడకు. సముద్రంలో ఆటుపోట్లు, జీవితంలో ఒడుదుడుకులు సహజం. సమస్యల్ని సామరస్యపూర్వకంగా పరిష్కరించుకోవాలి గానీ, నిరాశగా ఓ మూల కూర్చుంటే అది సోమరితనం అవుతుంది. కాబట్టి నువ్వు సియ్యేకి వెళ్ళబోతున్నావు" అంది నవ్వుతూ.

అతనేం మాట్లాడలేదు. ఆమె మాటలు, ప్రోత్సాహం అతనిలో ఎలాంటి చలనం కలిగించాయోకానీ మౌనంగా వుండిపోయాడు.

ఇవన్నీ సింధుకి కూడా తెలుసు. అప్పుడప్పుడు తమ్ముడి గురించి సింధుతో చర్చిస్తూనే వుంటుంది మాలతి. పైగా సింధు మాలతి ఇంటికి ఎప్పుడైనా వెళ్తే రాజుని చూసి చాలా ముచ్చటపడుతుంటుంది.

అతన్ని కదిలిస్తే చాలు చదువువల్ల వచ్చిన విజ్ఞానం, వయసుకి మించిన మేధస్సు బైటపడతాయి. సింధుకి అతన్ని చూస్తే చాలా ఆశ్చర్యం, సంతోషం. అతని మేధస్సు ప్రతిభావంతంగా రూపుదిద్దుకోడానికి ఈ పవిత్ర భారతదేశం ఎలానూ చేయూతనివ్వదు కాబట్టి, గొప్పలక్ష్యం వైపు అతను పయనించడానికి ఏ మహానుభావుడైనా దారి చూపగలిగితే బావుండును అనుకునేది.

ఇప్పుడూ అతని ఉద్యోగం గురించే ఆమె బాధంతా అని ఊహించి అంది మాలతితో, "రాజు ఉద్యోగం గురించేకదా నీ బాధంతానూ!" అని.

మాలతి చెప్పింది.

"చిన్నవో, పెద్దవో ప్రతిమనిషికీ సమస్య

లుంటాయి. ఈ సమస్యలకి పరిష్కారాలు వెతుక్కునే సందర్భంలోనే మనిషి తప్పటడుగు వేస్తాడేమో కదూ!'' అంది.

"ఏమిటి మాలతీ! దేనిగురించి నీ బాధ. నేను పంచుకోవచ్చునుకదా!'' అంది ఆమె చేయిపట్టుకుని ఆత్మీయంగా.

"రాజు విషయమే. వాడి ధోరణి చాలా మారింది సింధూ!'' అంది దిగులుగా.

సింధు కళ్ళు వెడల్పుచేసి అడిగింది. "ధోరణి మారటం అంటే... ఏ విధంగా'' అని.

"నాలుగు నెల్లక్రితం రాజు ఓ ఇంటర్వ్యూకి వెళ్ళాడు. చాలా బాగా ఆన్సర్ చేశానన్నాడు. ఆ ఉద్యోగం తనకు తప్పకుండా వస్తుందని సంబరపడిపోయాడు. ఏది అనుకుంటామో అది జరక్కపోవటమే జీవితంకదా! అదే జరిగింది.

వేకెన్సీ వున్న పధ్నాలుగు పోస్టులకి, ఒక్కోదానికి ముప్పయివేలు చొప్పున లంచంట. అంతకు రెండింతలు కూడా ఇచ్చి ఉద్యోగాలు కొనుక్కోగలిగే అరాచకం ఆచారంగా మారిన వ్యవస్థ మనది. అప్పటినుండి వాడి ధోరణి పూర్తిగా మారిపోయింది. దేనికీ అప్లైచేయడు. ఎక్కడెక్కడో తిరిగి, ఎప్పుడో ఇంటికి రావటం మొదలుపెట్టాడు. నేను, అమ్మా ఎంతగానో బతిమాలాము చదువుకొమ్మని. వాడు వినలేదు. నువ్వలా ఉంటే నేను చచ్చిపోతానని బెదిరించాను. వాడి మనసు కాస్త చలించిందా మాటతో!

కాస్త ఇంటిపట్టున వుంటూ, ఇంత తిండి తిని, తోచకపోతే అద్దెకు తెచ్చుకున్న పుస్తకాలతో కాలక్షేపం చేస్తున్నాడు

సింధూ... శరీరానికి వ్యాయామం, మెదడుకి ఆలోచన చాలా అవసరం. లేకపోతే సోమరితనంతోపాటు మెదడు కూడా మొద్దుబారిపోతుంది. లేదా బండి గాడి తప్పటానికి మార్గాలైనా యోచిస్తుంటుంది. అందుకే వాడికి మంచి ఉద్యోగం వచ్చే వరకూ ఏదైనా ప్రైవేట్ కంపెనీలో తన చదువుకి తగింది కాకపోయినా, ఏదో ఒకటి చేయమని సలహా ఇచ్చాను. కాస్త కాలక్షేపంగానూ, మనిషి చురుగ్గానూ ఉంటాడని.

వాడు సరేననగానే, 'ప్రీతి అడ్వర్‌టైజింగ్ ఏజన్సీ'తెలునుకదా నీకు. ఆ కంపెనీ డైరెక్టర్ కాళిదాసుగార్ని మీటయి రాజు విషయం చెప్పాను. ప్రీతి ఆయన పెద్దకూతురి పేరు. ఆమె నా క్లోజ్‌ఫ్రెండ్. ఆమె పెళ్ళయి అత్తగారింటికి వెళ్ళినా నేను రాసిన ఉత్తరం చూసి తండ్రికి రికమెండ్ చేసింది.

రాజుని అకౌంటెంట్‌గా వెంటనే అపాయింట్ చేశారాయన. నా ఆనందానికి అంతులేదు. ముందు వాడి ముఖంలో ఆ దైన్యం చూడాలంటే భయంవేస్తోంది నాకు. కళ్ళ ముందు కన్పించే సమస్యలతో వాడి చిన్న మనసు ఛిద్రం కాకుండా వుంటుందని అక్కడ జాయినైపొమ్మన్నాను.

మొదటినెల ఇచ్చిన ఆరువందల జీతాన్ని రెండో నెలకి ఎనిమిదొందలు చేస్తూ! 'నీబుర్ర పెద్ద కంప్యూటర్ రాజూ! నీకు గవర్నమెంట్ జాబ్ నేను చూస్తాను'అన్నారట ఆయన- వాడి తెలివితేటలకి అబ్బురపడి.

పగలంతా ఆఫీసు, ఇంటికి రాగానే ఏదో ఒక పుస్తకం పట్టుకుని అర్థరాత్రివరకూ చదవటం అలవాటైపోయింది వాడికి.

ఇప్పుడదికాదు సమస్య. కాళిదాసుగారి చిన్నకూతురు మమతని వీడు ప్రేమించాడట. పెళ్ళికూడా చేసుకోవాలని నిర్ణయించుకున్నామంటూ ఓ బాంబు పేల్చాడు నాదగ్గర. అదీ సమస్య'' అంది మాలతి భారంగా నిట్టూర్చి.

ఆమె ముఖంలో చాలా ఆందోళన కన్పించింది సింధుకి. ఆమె కూడా ఒక్కక్షణం ఆశ్చర్యంలో మునిగిందికానీ అదీ ఒక్కక్షణమే! ఆపైన తేలిగ్గా నవ్వేస్తూ, మాలతి భుజంమీద చేయివేసి, "కొంతమంది హృదయాలు త్వరగా పరివర్తన చెందుతాయి. రాజు కూడా ఆకోవకి చెందినవాడే అనుకోరాదూ'' అంది.

మాలతి నవ్వలేదు. అశాంతితో బాధపడుతోంది.

"ఎంతసేపూ తనూ, తన చదువేమో తప్ప తన చుట్టూ ఏం జరుగుతోందో కూడా పట్టించుకోనివాడు ఈరోజు ప్రేమలోపడ్డాను, పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను అని వాడంటుంటే చాలా కొత్తగా, వింతగా ఉంది సింధూ!



# తల్పగిరి కాలనీలో

**6 మాసములలో సొంత గృహమును పొందుగోరువారు రూ॥ 30,000/-లు ముందుగా చెల్లించిన మిగిలిన పైకము మీకు అనువైన రీతిలో వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.**

కేవలం నెలకు రు. 500/-లు మాత్రమే వాయిదాల పద్ధతిలో చెల్లించి, సొంత గృహమును పొందుటకు నెల్లూరు పట్టణములో చక్కని అవకాశం.

నెల్లూరు - మద్రాసు G.N.T. రోడ్డు కుడిప్రక్కన, ఆటోనగర్‌వద్ద స్వామి అయ్యప్ప దేవాలయము సమీపంలో, టౌన్‌కు ఆనుకొని "లే అవుట్" చేయడమైనది.

1. $33^1/_3$ అంకణములు /267 చ. గల ప్లాటులో $5^1/_2$ అంకణములు /400 చ.అ. సింగిల్ బెడ్ రూం గృహము కేవలం రు. 55,000/-మాత్రమే.
2. వాయిదాల పద్ధతిలో గృహము పొందగోరువారు ముందుగా 15,000/- చెల్లించి మిగిలిన పైకము నెలకు రు. 500/-ల చొ॥న 120 నెలలు చెల్లించవలెను.
3. డ్రైనేజ్, రోడ్లు, కరెంటు వసతులు కల్పించబడును. ప్రతి ఇంటికి ఒక బావి త్రవ్వి నీటి వసతి ఏర్పాటు చేయబడును.
4. కేవలం ప్లాటు మాత్రమే కొనుగోలుచేయుటకు కూడా అవకాశం కలదు.
5. మొదటి గ్రూపులోచేరిన 50 మందికి 18 మాసములలో గృహ నిర్మాణము పూర్తిచేయబడును.
6. ప్లాటు కొనుగోలు చేయువారికి మొదటి వాయిదా రు. 5,000/- చెల్లించిన, మిగిలిన పైకం వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.
7. ప్లాటు కొనుగోలు చేయువారు రు. 500/- లేదా గృహనిర్మాణ స్కీములో చేరువారు రు. 1000/- టోకను అడ్వాన్సు చెల్లించి వచ్చిన ప్లాటును వెంటనే రిజర్వు చేసుకొనవచ్చును.
8. ప్రతి ఆదివారము ఉదయం 8 గం. నుండి 12.30 గంటల వరకు స్థల సందర్శనము కొరకు మా ఆఫీసునుండి ఉచిత వాహన సౌకర్యం ఏర్పాటుచేయబడును.

వివరములకు :

**ఫోన్ : 6729**

**J.L.నారాయణ & కంపెనీ**

14/291, ఊర్వశి కాంప్లెక్స్ - కాపువీధి - నెల్లూరు

OM ADS. NLR.

అసలు కాళిదాసుగారమ్మాయి కాకుండా వుంటే నేనింత బాధపడను. అయిన వాళ్ళలో లేని ఆప్యాయత స్నేహితుల్లో దొరుకుతుందంటారుకదా! కాళిదాసుగారంతటి పెద్ద మనిషి అడగ్గానే వాడికి ఉద్యోగం ఇచ్చి, ఎంత ఆదరం చూపించారు. ఆయనకు మనం చూపించే కృతజ్ఞత ఇదేనా? ప్రీతికి నా ముఖమెలా చూపించాలి. 'కంచే చేనుమేస్తే' సామెతగా వుందనుకుంటారు. నాకేం చేయాలో, ఎలా చెప్పాలో అర్థంకావటంలేదు. అసలిప్పుడేం తొందరొచ్చిందనీ ప్రేమించడానికి'' అంది విసుగ్గా.

సింధు నవ్వింది. ''నువ్వు చెప్పేది మరీ బావుంది. ప్రేమించేముందు ఇవన్నీ ఆలోచిస్తారా ఏమిటి? అసలు ఆలోచించేవాళ్ళు ప్రేమించరు'' అంది.

''నీకు నాసమస్య తేలిగ్గా కన్పిస్తుందిగానీ, ప్రేమలోపడే ముందు కాస్త తప్పొప్పుల గురించి ఆలోచించాలి. తండ్రికంటే ఎక్కువగా ఆదరించి చేయూతనిచ్చిన మనిషిని ఆయన మీద గౌరవంతో, ఆమె ప్రేమను తిరస్కరించాలి. తిరస్కరించలేకపోవడమనేది బలహీనతేగానీ, గొప్పప్రేమకు నిదర్శనమేమీ కాదు. ఈ ప్రేమలమీద నాకు నమ్మకంలేదు. ప్రేమకాదు కేవలం ఆకర్షణ. అంతే! మరో అందమైన అమ్మాయి కన్పించినా ఆ ప్రేమ బైటపడుతుంది... అందుకే తిరస్కరించమంటున్నాను. డబ్బుకోసం మా అమ్మాయిని ట్రాప్ చేస్తున్నాడని ఆయన అనుకుంటే అది విని నేనెలా భరించాలి సింధూ! 'అక్కా... నీ ఋణం ఎలా తీర్చుకోను' అని కన్నీళ్ళు పెట్టిన తమ్ముడు ఆయన ముందు తలెత్తుకోకుండా ఓ చేదు అనుభవం రుచిచూపించాడు'' అంది భారంగా.

సింధు మనసు అర్థం అయింది. ''మలతీ... నీ సంఘర్షణ, మానసిక వ్యథ నాకర్థం కానివి కాదు. నువ్వనుకున్నట్లు కాళిదాసుగారు కూడా అనుకోవడం నిజమేనేమో, కానీ నువ్వేం చేయగలవిప్పుడు. ప్రేమికులంతా తమవంటి ప్రేమికులు ప్రపంచంలో మరెక్కడా వుండరు అన్నంత డీప్ థింకింగ్‌లో వుంటారు. ఇప్పుడు నువ్విevanనీ వివరించి చెప్పినా వాళ్ల బుర్రకెక్కదు'' అంది సింధు.

''అదీ అయిపోయింది. పెద్దవాళ్ళతో వియ్యమూవద్దు, కయ్యమూవద్దు మనకి అని అమ్మా, నేను ఇద్దరం చెప్పాం. కానీ చేసుకుంటే ఆ అమ్మాయినే చేసుకుంటాను. లేకపోతే ఆమెను చంపి నేను ఛస్తాను అంటూ ఖచ్చితంగా చెప్పాడు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది''

చేసుకుంటే ఆ అమ్మాయినే చేసుకుంటాను. లేకపోతే జీవితాంతం ఇలా ఒంటరిగా కాలం గడిపేస్తాను అని అంటారుకదా సహజంగా ప్రేమికులు. వీడు అలాక్కాదు. ఆమెను చంపి నేను ఛస్తాను అంటున్నాడు. చాలా అడ్వాన్సయిపోయారు ప్రేమికులుకదూ

నా ప్రాణాలన్నీ వాడిమీదే పెట్టుకుని బతుకుతున్నందుకు వాడిలా చేయటంతో నాకు జీవితమంటేనే విరక్తి కలుగుతోంది సింధూ! ఈ పరిస్థితిలో నన్నేం చేయమంటావు చెప్పు'' అంది దీనంగా.

''రెండు చేతులు కలిస్తేనే శబ్దమనేది వస్తుంది. రాజుని తప్పు పట్టడంలో అర్థంలేదు. అయినా రాజుకేం తక్కువ. అందముంది. అంతకుమించి గొప్ప తెలివితేటలున్నాయి. కాస్త విశాలమైన మనసు చేసుకుని కాళిదాసుగారు ఆలోచించ గలిగితే రాజుని మించిన వాడిని అల్లుడిగా తెచ్చుకోలేరేమోననిపిస్తోంది నాకైతే! ఇంక ఆర్థిక స్థోమతంటావా! ఆ స్థాయికి చేరుకోగల సమర్థవంతుడు రాజు.

నువ్వదేపనిగా ఏవేవో వూహించుకుని బాధ పడకు. ఇంకొంతకాలం చూడు. ఈ రోజుల్లో పెళ్ళివరకూ వెళ్ళే ప్రేమలు చాలాతక్కువ. అన్నీ కాలక్షేపం ప్రేమలు. చూద్దాం... వీళ్ళ ప్రేమ ఎలాంటిదో!'' అంది సింధు.

''అక్కకి మంచి సంబంధంచూడు. అక్క పెళ్ళయ్యాకే నేను చేసుకుంటాను అన్నాడట అమ్మతో. అలాఅని ఆలోచిస్తే ఫర్వాలేదు. కొంతకాలం ఆగుతారనే నమ్మకంఉంది. లేకపోతే హఠాత్తుగా ఏ గుళ్ళోనో ముడేసి ఆశీర్వదించమంటూ వచ్చారంటే... ఇదంతా గూడుపుఠాణి అని కాళిదాసుగారు...'' ఆపైన ఆమెను మాట్లాడనివ్వకుండా సింధు ఆమె నోరు

మూసేసింది.

"నువ్వింక ఈ పురాణీ, బరాణీల గురించి ఆలోచించకు. ఇంతకాలం చదువుతప్ప మరో ప్రపంచం తెలీని కుర్రాడు కదా! ఇప్పుడు ఓ సంవత్సరకాలం ఇంట్లోవుండి అద్దెకు తెచ్చుకున్న నవల్సు చదవటం వల్ల, జీవితమంటే ఏమిటో తెలుసుకుంటున్నాడేమోలే, ఆమాత్రం థ్రిల్ కోరుకోవడంలో ఆశ్చర్యంలేదు. పద... చాలా ఆకలిగావుంది" అంటూ ఆమె నోటి దగ్గర్నుంచి చేయితీసి, తన బాక్స్‌లోంచి కట్‌లెట్‌తీసి ఆమె నోట్లో కుక్కింది సింధు.




ఆకాశం నిర్మలంగా, నక్షత్రాల వెలుగులో అందంగావుంది. మేఘాలు సముద్రంమీద నురుగులా వున్నాయి. మొక్కలు పగలంతా ఎండకు అలసిపోయి, వెన్నెల చల్లదనానికి సొమ్మసిల్లినట్టు మగతగా నిద్రపోతున్నాయి. మొక్కలమీంచి వచ్చేగాలి, వళ్ళంతా చక్కిలిగిలి పెడుతున్నట్టుంది.

మురళి డాబామీదికివచ్చి ఓ మూలగా నిల్చుని దూరంగా ఎక్కడో చూస్తున్నాడు.

అతని మనసునిండా భయం, కాళ్ళల్లో వణుకు ప్రారంభమయ్యాయి. అక్కడ ఒక్క నిమిషం కూడా వుండబుద్ధికావటంలేదు. వేగంగా నడిచి కిందికి వెళ్ళిపోతేనే, అనుకున్నాడు.

సింధు వచ్చేవరకూ ఇక్కడేవుంటే ఆమెను చూడగానే తనగుండె ఆగిపోతుందేమో! అనవసరంగా ఇరుక్కుపోయాడు తను. ఇప్పుడే మిటి మార్గం భగవంతుడా నువ్వే రక్షించాలి. వేగంగా అటుఇటు పచార్లుచేస్తూ దేవుణ్ణి తలచుకున్నాడు మురళి.

అయినా తనేంచేశాడు. తనవల్ల జరిగిన అపరాధం ఏమిటై వుంటుంది.

సాయంకాలం ఆఫీసునుంచి వస్తూనే తన గదిలోకివచ్చి "ఓ గంటపోయాక పైకి డాబామీదికి రండి. మీతో మాట్లాడాలి" అని సీరియస్‌గా వెళ్ళిపోయింది.

ఆ క్షణంనుంచి టెన్షన్‌తో తన కాళ్ళు ఒకటే వణికిపోతున్నాయి. 'ఇంకెంతసేపో ఈ యాతన' అని మనసులో రకరకాల ఆలోచనలతో సతమతమవుతూన్న మురళి సింధు రాకను చూసి అలాగే నిలబడిపోయాడు.

సింధు వేగంగా వస్తూనే- "ఓ సారీ... చాలా లేట్ చేశాననుకుంటా" అంది.

"ఇట్సాల్‌రైట్" అన్నాడు నెమ్మదిగా.

"నాన్నమ్మకి ఒంట్లో బావుండలేదు కదా! వంటభారం నామీదే పడింది. మీకు తెలుసోలేదో ఐహేట్ కుకింగ్. ఇంకా చెప్పాలంటే వంటంటే ఎంత కోపమో భాష చాలదు చెప్పటానికి. కూరల్లో సరిపడ ఆ వుప్పుకారం ఎలా వేస్తారో పెద్ద ఆశ్చర్యం నాకు.

ఈ మగాళ్ళు చక్కగా ట్రిమ్‌గా తయారై ఆఫీసుకి వెళ్ళటం గొప్పకాదు. ఏదో కష్టపడిపోతున్నట్టు ఫోజు. కానీ నిజంగా ఆడవాళ్ళు ఏ కోచింగ్సు లేకుండా వంట ఇంతబాగా చేస్తున్నారంటే అందుకు ఇవ్వచ్చు ఎన్ని అవార్డులైనా అనిపిస్తుంటుంది నాకు. మీరేమంటారు?" అంది నవ్వుతూ.

ఇబ్బందిగా నవ్వాడు మురళి. ఆమె అలా స్పీడుగా చురుగ్గా మాట్లాడేస్తుంటే అతనికి నోటినుంచి మాట రావటంలేదు.

"అరే... నిల్చునే వున్నారు. రండిఇలా కూర్చుందాం" అంటూ కింద చతికిలబడింది.

ఆమెకు కాస్త దూరంగా అతను కూర్చున్నాడు.

రెండు నిమిషాల మౌనం ఇద్దరిమధ్య మంచులా కమ్మింది.

సింధు ఆ మౌనాన్ని తొలగిస్తూ అంది-

"నేను మిమ్మల్ని రమ్మంటే... ఏమని వూహించారు?" అంది.

"అది అర్థంకాకే రెండు గంటల నుంచీ తలబద్దలు కొట్టుకుంటున్నాను. బి.పి. డౌనయి పోయి చూడండి నా చేతులు, కాళ్లు ఎలా చల్లబడిపోయాయో" అంటూ చేతులు రెండూ ముందుకు చాచాడు మురళి.

అప్రయత్నంగా అతని రెండు చేతులు పట్టుకుంది సింధు.

ఆమె చొరవకి ముందు అవాక్కయిపోయి చూశాడామెని. అతని శరీరంలో, గుండెల్లో వింతధ్వని.

అతని చూపులు ఆమె మీదికి ప్రసరించాయి. చీకట్లో అద్భుతమైన కాంతితో మెరుస్తున్న ఆమె కళ్లు నిశ్చలంగా చూస్తున్నాయి.

"సింధూ" అని పిల్చాడు కలవరంగా మురళి.

అతని చేతులు వదిలి, "మురళీ! నా చిన్నప్పటినుండీ అనుకునేదాన్ని జీవితమంతా ఒంటరిగా బతకాలని... అంటే పెళ్లి, పిల్లలు ఈ బంధాల్లో పడకూడదని. అందుక్కారణం పెళ్లంటే ఏవగింపు కాదు... ఎందుకో అయిష్టత. స్పష్టం చేయలేని భావాలు అంతే!

కానీ మా నాన్నమ్మతో నేను రోజూ పడే ఘర్షణతో ఆమె నరిపెట్టుకోలేక పోతోంది. అది నా మీద ఆమెకున్నప్రేమ, వాత్సల్యం అర్థం చేసుకోగలను. రాను రాను నావల్ల తన ఆరోగ్యం పాడుచేసుకుని, నాకున్న ఒక్కగానొక్క అండ, ఆదరణ దూరమై పోతుందని భయం వేస్తుంది.

నాన్నమ్మ లేకపోతే నా ఒంటరిజీవితం తలచుకుంటేనే భయం కమ్ముకుంటోంది.

నిశ్చలంగా వున్న వాతావరణంలో తుఫాను ఎంత అలజడి పుట్టిస్తుందో ... పెళ్లయితే ఆడపిల్ల జీవితమూ ప్రశాంతత కోల్పోతుందనుకునేదాన్ని. కానీ ఇప్పుడు నిశ్చలంగా, నిశ్శబ్దంగా వుండే జీవితం అక్కర లేదనిపిస్తుంది. కదలిక, లయవున్న జీవితం కోరుకుంటున్నాను.

మీరు మాఇంట్లోకి వచ్చిన ఈ మూడేళ్ల నుంచీ మిమ్మల్ని చూస్తున్నాను... మాట్లాడుతున్నాను. అదీ కేవలం ఓ స్నేహితునిగా భావిస్తూ!

మీరంటే ప్రత్యేకమైన అభిమానంతో చూసే నాన్నమ్మ మొదటిసారిగా మీ గురించి నా మనసులో ఓ విత్తనం వడేసింది. వీలున్నప్పుడల్లా 'పెళ్లి చేసుకుంటానను. మురళితో నేను మాట్లాడతాను' అంటూండేది. ఆమె నోరు గట్టిగా మూసేసేదాన్ని మాట్లాడవద్దు అంటూ!

కానీ, ఊహించని విధంగా నా మనసులో, ఆలోచనల్లో ఏదో మార్పు ... వద్దనుకుంటూనే మిమ్మల్ని మీ ప్రవర్తనని గమనించటం మొదలుపెట్టాను.

బైటికొస్తే ఒకరికోసం ఒకరిలా కన్పిస్తూ, ఇంట్లో ప్రతిక్షణం అవమానాలు, పరాభవాలతో గడిపే భార్యాభర్తల్లా కాకుండా ... నిజమైన అనురాగంతో బతికే మనుషులుగా వుండాలి. ఆ భావానికి అర్థాన్ని రూపాన్నీ ఇచ్చే మనిషి ఎవరు ఎవరని నామనసు ఆక్రోశించేది.

పరిచయం లేని ఏవ్యక్తినో చేసుకుని నా అదృష్టాన్ని పరీక్షించుకునే శక్తి ఓపిక నాకు లేదు. అందుకే... అందుకే నేను మిమ్మల్ని భర్తగా స్వీకరించాలను కుంటున్నాను" అంది. చివరి మాటలు అంటున్నప్పుడు ఆమె గొంతులో అదో రకమైన ధ్వని, ఉద్వేగం.

ఇంక అతని సంగతి చెప్పనే అవసరంలేదు.

ఆమె చెప్పే ఒక్కో మాటకి అతని మనసులో ఆనందం, ఆశ్చర్యం ఒక్కసారిగా ఉప్పొంగాయి.

వాటితో పాటు మరేదో చెప్పలేని భావం కదలాడింది. సాలోచనగా, చురుగ్గా తల పంకించాడతను.

నన్నటి గాలి తెమ్మెరకి, ప్రశాంతంగా కళ్లు మూసుకున్నాడతను.

అతని నిశ్శబ్దాన్ని భరించలేనట్టుగా అంది సింధు.

"ఏమిటీ... అలా మౌనిలా కూర్చున్నారు. మాట్లాడండి" అని.

"సింధూ... నాకేం మాట్లాడాలని లేదు. మీరు మాట్లాడుతుంటే అలాగే వినాలనిపిస్తోంది. మీ హృదయంలో చోటిచ్చి, నన్ను మీ

జీవిత భాగస్వామిని చేసుకుంటాను అన్నందుకు కాదు. ఒక ఆడపిల్ల నన్ను కోరుకుని ఇంత ప్రేమగా, ఆప్యాయంగా మాట్లాడుతున్నందుకు.

ఎవరూ లేని అనాథగా పెరిగిన నేను, ఎంతో కష్టపడిచదువుకుని ఉద్యోగం సంపాదించుకోగలిగాను. నా అనేవాళ్ళు లేక, ప్రేమనీ, అభిమానాన్ని పంచే మనిషిలేక, నా హృదయానికి దగ్గరగా ఓ గుండె ... ఈ జన్మకి ఇవేవీ నెరవేరని కోరికలుగా ఎన్ని రాత్రులు చీకట్లో నా కళ్ళు 'వర్షించాయో!

దేవుడికి నా విన్నపం వినిపించింది. నా గుండె చప్పుళ్ళు ... ఆ శబ్దాలకి అర్థాలు కల్పించాడు'' తన హృదయంలో మెదిలే భావాలు ఒక్కసారిగా చెప్పాలనీ అతని ఆతృత. గుండెల్లో వెల్లువై పొంగిన ప్రేమని, బాధని, బరువుని ఒక్కడే భరించలేకపోతున్నాడు.



ఆ సమయంలో ఆమె గుండెల్లో తనకింత స్థానాన్ని ఇచ్చిన ఆమెకంటే ఆత్మీయురాలు, నేస్తం ఈ ప్రపంచంలో మరెవ్వరూ లేరని పించింది. అంతకు ముందున్న దూరం పూర్తిగా తొలగిపోయి, ఆమె పూర్తిగా తన స్వంతమైనట్లుగా వుంది.

అతన్ని చూట్టంతో సింధు ముఖం కళకళ లాడింది. పెదవులు అందంగా నవ్వాయి. చల్లటిగాలికి కొబ్బరి చెట్ల ఆకులు మెల్లగా కదులుతున్నాయి.

"సింధూ! ఐ లవ్ యూ, మోర్‌దేన్ ఎవ్వర్" అన్నాడు ఆమె చేతిని సున్నితంగా నొక్కి.

"సింధూ! మీరు కోరుకుంటే నాకంటే అన్ని విధాలా అధికుడైన వ్యక్తి మీకు దొరకవచ్చు. మరోసారి బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి" అన్నాడు.

"ఆలోచించవలసిన దానికంటే ఎక్కువ ఆలోచించబట్టే ఇంత ఆలస్యమైంది. లేకపోతే ఈపాటికి 'కొత్త కాపురం-తీసుకోవలసిన జాగ్రత్తలు' గురించి అనుభవంతో ఓ పుస్తకం రాస్తూ వుండేదాన్ని" అంది నవ్వుతూ.

అతనూ నవ్వేశాడు.

"రేపు మా నాన్నమ్మతో మాట్లాడదాం రండి. అప్పుడైనా ఆమె జ్వరం తగ్గిపోతుందేమో" అంది నవ్వి.

అతను సింధువైపు చూసి, "సింధూ! నాదో చిన్న అనుమానం ..." అన్నాడు నసుగుతూ.

"ఏమిటి?" అంది భృకుటి ముడిచి.

"వంట అంటే భయమని, అయిష్టమని అన్నావు. నేనైతే ఆ ప్రాబ్లమ్ వుండదని గానీ... నువ్వి నిర్ణయం తీసుకోలేదు కదా!" అన్నాడు నెమ్మదిగా.

పకపకా నవ్వింది సింధు.

"ఛ ఛ... నన్నిదేనన్నమాట అర్థంచేసుకుంది" అంది బేలగా.

ఆమె చేయి తీసుకుని, "ఇన్ని సంవత్సరాలు నేనే వండుకుని తినటమో, హొటల్లో తినటమో... తిండిమీద ఆసక్తిపోయింది. ఇప్పుడు నువ్వు తినిపించే ముద్దలకోసం పొట్ట అవురావురుమంటోంది. నేను పూర్తిగా విశ్రాంతి తీసుకుంటాను సింధూ" అన్నాడు.

అతని మాటలకి ఆమె జాలిపడింది. హృదయం ఆర్తితో నిండిపోయింది. చిన్నపిల్లాడు ఆకలేసి తల్లిని అన్నం పెట్టమన్నట్టుగా అనిపించి ఉవ్వెత్తున అనురాగం ఎగిసిపడింది.

అతని చేతిని సున్నితంగా పెదవులకి తాకించుకుంది.

ఆమె చల్లటి ముద్దులో అతని ఒంటరితనంలోని బాధంతా ఒక్కసారిగా మాయమైంది.

★ ★ ★

ఆ తర్వాత నెలరోజులకే వారి వివాహం జరిగిపోయింది. మురళి ఆనందానికి అంతు లేకపోయింది. ఇద్దరి గమ్యాలు ఒక్కటై... జీవితాంతం తమ బంధం మధురంగా, రమ్యంగా సాగిపోవాలని ఆశించాడతను.

కొత్త జీవితం వారిలో నూతనోత్సాహాన్ని తీసుకొచ్చింది. ఉదయం లేవగానే పేపరు చదవటం, కాఫీ టిఫిన్స్ అయ్యాక తయారయి ఇద్దరూ ఎవరి ఆఫీసులకి వారు వెళ్ళిరావటం. సాయంకాలం వచ్చాక చాలాసేపు కబుర్లు చెప్పుకోడం... ఉదయంనుంచి ఆ సాయంకాలానికే చాలాకాలం తర్వాత కలుసుకున్న ఆత్మీయుల్లా ఆప్యాయంగా, ప్రేమగా మాట్లాడుకునేవారు.

కాలం చాలా వేగంగా గడిచిపోతున్నట్లనిపించింది ఇద్దరికీ!

సింధు పెళ్ళి జరిగిపోయాకగానీ, ఆమె నాన్నమ్మ మనసు శాంతించలేదు. ఇద్దరినీ తన బిడ్డల్లానే చూసుకునేది. వారి తిండి, బట్ట, మంచి చెడు అన్నీ ఆవిడే గమనిస్తుండేది.

వాళ్ళు ఆఫీసుకి వెళ్ళిపోయాక ఏ భగవద్గీతో తీసుకుని కూర్చుంటుంది. తన జీవితానికో నిశ్చింత ఏర్పడిందని, తన మనవరాల్ని కంటికి రెప్పలా కాపాడుకునే మనిషి దొరికినందుకు ఆమెకెక్కడలేని ఆనందం కలిగింది.

మురళి కూడా ఆమెను తన తల్లిలానే భావించేవాడు. ఇంత పెద్దవయసు వచ్చి ఇంకా ఆమె తమకోసం బాధ్యత వహించటం అతనికి బాధ కలిగేది.

"పనులుచేయడానికి పనిపిల్ల వుంది.

వంటకూడా మేమే చేస్తాం. మీరు పూర్తిగా రెస్టుతీసుకోండి'' అంటాడతను.

కానీ, ఆవిడ ఆ మాటకి పొంగిపోతుందే తప్ప తను బతికివుండగా సింధు కష్టపడటం చూడలేనంటుంది.

''నాన్నమ్మ అంతే మురళీ! మనం ఎంత చెప్పినా ఆమె విన్పించుకోదు. ఆమెకిలాగే ఇష్టం అంటుంది. కానివ్వండి... ఏం చేస్తాం'' అంటుంది సింధు.

ఓ నెలరోజుల తర్వాత ఓ యాత్రాస్పెషల్ బస్సు కాశీవరకు వెళ్తుందంటే మురళి చాలా గొడవచేసి ఆవిణ్ణి ప్రయాణం చేయించాడు. ముందు తనూ, సింధూ కూడా ఆవిడతో బయల్దేరాలని ప్లాన్‌చేస్తే లీవ్ దొరక్క ఆగిపోవలసి వచ్చింది.

పక్కపోర్షన్‌లో వుంటున్న శ్రీలక్ష్మి కూడా బయల్దేరటంతో అతనికి కొంత మనశ్శాంతి చిక్కింది.

బస్సు బయల్దేరేవరకూ, ఇద్దరికీ ఎన్నో జాగ్రత్తలు చెప్తూనే వుంది. వంటచేసేటప్పుడు పొయ్యిదగ్గర ఎంత జాగ్రత్తగా వుండాలో, ఏయే డబ్బాలో ఏమేం వున్నాయో, ఏ కూర ఎలా చేయాలో ఒకటికి పదిసార్లు చెప్పింది.

''నాన్నమ్మా... నువ్వు నిశ్చింతగా వెళ్ళిరా! పదేపదే మా గురించి తలచుకుని బెంగపడక, అన్నీ చూసిరా! భక్తితో ధ్యానించకపోతే ఇక్కడ కొచ్చికూడా నీ ధ్యాన మనవరాలిమీదేనా అని దేవుడికి కోపం వస్తుంది'' అని నవ్వింది సింధు.

తమను విడిచి వెళ్లటానికి ఆమెపడే యాతన చూస్తే సింధు మనసు ఆర్ద్రంగా అయింది.

★ ★ ★

ఆ రోజు ఆదివారం. రోజులా మంచంమీంచి హడావిడిగా, లేవకుండా, నవ్వులతో వయసు పులకరింతలతో, మనసు పరుగులతో విచిత్రానుభూతులు కలబోసుకుంటూ లేచారిద్దరూ.

సింధు స్నానంచేసి టిఫిన్ ప్రయత్నంలో పడింది.

ఈలోపు మురళి ఓ పావుగంటసేపు పేపరు చూసి, షేవింగ్ చేసుకుని స్నానంచేసి బెడ్‌రూమ్‌లోకి వచ్చిచూస్తే సింధు కనిపించలేదు.

తను స్నానం చేసి వచ్చేసరికి సింధు టిఫిన్‌చేసి, బెడ్‌రూమ్‌లో ప్లేట్స్‌తో రెడీగా కూర్చునేది. ఈవేళ ఏమిటబ్బా ఇంత లేటు అని మనసులో అనుకుంటూ లాల్చీ వేసుకుని, ''సింధూ... టిఫిన్ రెడీయా?'' అంటూ వంటగదిలోకి వినబడేట్టు కేకపెట్టాడు.

ఆమెనుంచి ఏం సమాధానం లేదు. వస్తున్న అలికిడీ లేదు.

రెండు నిముషాలు చూసి వంటగదిలోకి వెళ్ళాడు.

అక్కడ దృశ్యం చూడగానే కించిత్తు ఆశ్చర్యంతోపాటు నవ్వు కూడా వచ్చిందతనికి.

ఒక స్టౌమీద పాలు పొంగి, మరిగిపోతున్నాయి. మరో స్టౌమీద బాండీలో ఏదో నల్లటి పదార్థం వుంది. కింద పడివున్న పాకెట్‌ని తీసిచూస్తే 'మాగీ' అని వుంది.

రెండు నిముషాల్లో అయిపోయే వంటని, అరగంటనుండీ మాడపెట్టేస్తున్నట్టు అర్థమైపోయిందతనికి.

సింధువైపు తిరిగిచూశాడు. ఆమె తనున్నది వంటగది అనే విషయం పూర్తిగా మర్చిపోయినట్లు... డైనింగ్ టేబిల్ ముందున్న ఛైర్‌లో కూర్చుని, పుస్తకమేదో చాలా తీవ్రంగా చదువుతూ కన్పించింది.

బుగ్గన చేయిపెట్టుకుని, తలొంచుకుని ఆమె అంత దీక్షగా చదివే పుస్తకం ఏమిటా అని అనుమానం వచ్చిందతనికి.

పొయ్యి ఆఫ్‌చేసి నెమ్మదిగా నడిచివెళ్ళి ఆమెముందు నిలబడ్డాడు. మరుగుతున్న పాలుకానీ, మాడిపోయి వాసనలు వెదజల్లుతున్న మాగీకానీ ఆమెనీలోకంలోకి తేలేకపోయాయి. ఇంక అతని రాకనేం గమనిస్తుందామె.

ఆమె భుజంమీద చేయివేసి 'సింధూ' అని పిల్చాడు.

ఉలిక్కిపడి ఒక్క వుదుటున లేచి ''అరే- ... మీరే వచ్చేశారే! స్నానం చేసేశారా! రూమ్‌లోకి పదండి. టిఫిన్ తెస్తాను'' అంది స్టౌదగ్గరికి

నడుస్తూ.

బాండీలోకి, పొలగిన్నెలోకి చూసి, తనేం ప్రిపేర్‌చేయాలనుకుందో, ఏం తయారయిందో ఆమెకే అర్థంకాలేదు.

అర్థమయ్యాక ఆమె ముఖంలో మారే రంగులు చూసి, నవ్వాపుకోలేకపోయాడు మురళి.

అతని లాల్చీ బటన్ సరిచేస్తూ- "ఐయాం ఎక్స్‌ట్రీమ్లీ సారీ మురళీ" అంది అభ్యర్థనగా.

"డోంట్ వర్రీ ఎబౌట్‌ఇట్. మళ్ళా ప్రిపేర్ చేసుకుందాం! పద" అన్నాడు అనునయంగా.

"థాంక్స్ మురళీ! మీఅంత మెత్తటి మనమున్న మనిషి భర్తగా దొరకటం నాఅదృష్టం. కాబట్టి ఈ సందర్భంగా మీకో బహుమానం ఇవ్వాలనుకుంటున్నాను" అంది చిలిపిగా చూస్తూ.

"ఏమిటబ్బా అది" ఆలోచిస్తూ అన్నాడు.

"కాస్త ఒంగో చెప్తా" అంది అతని చేయిపట్టుకుని.

అతను ఒంగోగానే అతని చెంపమీద గట్టిగా ముద్దుపెట్టుకుంది.

అతను నవ్వి- "చాలా ఆకలిగా వుంది సింధూ! ముందు టిఫిన్" అన్నాడు పొట్ట పట్టుకుని.

"అరే- ఒక్క నిముషం" అంటూ స్టౌ దగ్గరకు పరుగెత్తింది.

పది నిముషాల్లో టిఫిన్ రెడీచేసి తీసుకొచ్చింది గదిలోకి.

ప్లేటు అందుకుని- "ఏం పుస్తకం సింధూ అది. అంత ఇంట్రస్టింగ్‌గా చదువుతున్నావు" అన్నాడు.

ఆమె అతని ప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా "ఉప్పు సరిపోయినట్టులేదు కదూ!" అంది.

"ఏమో! నీచేత్తో చేసినవాటి గురించి రుచులు నేను పట్టించుకోను" అన్నాడు.

చర్రున లేచింది సింధు.

"అంటే ... నాచేత్తో చేసినవి బావుండవనేగా మీ ఉద్దేశం. అంతేలే ... ఈ మగాళ్ళంతా అంతే! ఎంత చదువుకున్నా... అది చెయ్యలేదు, ఇది చెయ్యలేదు... దీన్లో ఉప్పులేదు దాన్లో కారం లేదు అంటూ భార్యల్ని సాధిస్తుంటారు.

కాస్త ఉప్పు తక్కువైనా, ఒక స్పూన్ కారం ఎక్కువైనా సర్దుకుపోవటం లేదు. అయినా నాకు వంట చేతకాదని ముందే చెప్పానుకదా! అన్నిటికీ ఇష్టపడ్డే చేసుకుని, ఇప్పుడిలా సాధిస్తున్నారు. హుఁ... మిమ్మల్ని నమ్మటం నాదే బుద్ధితక్కువ" ప్లేటు టేబుల్‌మీద పడేసి మంచినీళ్ళు తాగింది.

మురళికి ముందు ఆమె మాట్లాడేదేమిటో అర్థంకాలేదు. తను అన్నమాటలో తప్పేమిటో తెలీక బుర్ర గోక్కున్నాడు. ఆమెకు దగ్గరగా జరిగి, భుజంమీద చేయివేసి "సింధూ! నేననేది..." అతని చేయి విదిలించిపారేసి, అతని మాటలకి అడ్డుపడింది.

"మీ సంజాయిషీలు నాకవసరంలేదు. తెలిసిందికదా, మీరూ అందరిలాంటి మగాళ్ళేనని. లోకంలో మగాళ్ళు లేరని మిమ్మల్ని ఏరికోరి చేసుకున్నాననుకున్నారా?! ఛ... మిమ్మల్ని అని ప్రయోజనం ఏముంది. అంతా నాఖర్మ" అంది.

మురళి గట్టిగా జుట్టు పీక్కున్నాడు ఏంచేయాలో తోచక.

సింధు వాగ్ధాటి అంతటితో ఆగలేదు. ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోస్తూ, "ఇద్దరి గమ్యాలు వేరని గ్రహించలేకపోయాను. ఏ ఒడుదుడుకులూ లేకుండా జీవితం ప్రశాంతంగా సాగిపోతుందని ఆశపడ్డాను. ఇలా చిన్నచిన్న విషయాల్లోనే బైటపడిపోయి, అర్థమ్ము కాలేకపోతే ముందుముందు ఇంకెన్ని అర్థంకులు మన సంసారజీవితంలో ఇద్దరిమధ్య అడ్డుగోడై...." ఆమె మాటలు పూర్తికాకుండానే...

"స్టాపిట్" అని అసహనంగా అరిచాడు మురళి.

"యూహావ్ నో సెన్స్. నువ్వేం మాట్లాడుతున్నావో నీకు అర్థం అవుతుందా అసలు. నీచేత్తో ఏంచేసినా రుచులు పట్టించుకోను అంటే బావుండలేదనా అర్థం! నువ్వేంచేసినా నాకు అద్భుతంగా వుంటుందని అన్నాను. అబ్బ ...

అరగంటనుంచి ఎంత యాతనపెట్టేశావో కదా!'' అని ఆమె గడ్డం పట్టుకుని తనవైపు తిప్పుకున్నాడు.

సింధు మాట్లాడలేదు. ఆమె మౌనం భరించలేనివాడిలా 'సింధూ' అని పిల్చాడు.

ఆమె అతని చెంపలు చేత్తో రాస్తూ కిలకిల నవ్వింది. అప్పటిగ్గానీ అతని గుండెవేగం తగ్గలేదు.

''ఎందుకు సింధూ నన్నిలా ఏడిపిస్తున్నావ్! ఈ సండే హాపీగా గడపాలని ప్లాన్‌చేస్తే నువ్విలా నన్నెందుకు వేధిస్తున్నావ్!'' అన్నాడు. ఆమె అందమైన సోగకళ్ళమీద ముద్దుపెట్టుకుని.

''సరదాగా గడపటమంటే ఇదే స్వామీ! అన్ని సరదాలతోపాటు కాస్త సాహిత్య పిపాస కూడా మనిషికి అవసరం. అది లేకపోతే మనసులు చాలా సంకుచితంగా ప్రవర్తిస్తాయి. మన పెళ్లయాక బొత్తిగా పుస్తకాలు చదవటానికే టైమ్‌లేకుండాపోయిందని ఈవేళ ఈ పుస్తకం ఎలాఅయినా పూర్తిచేయాలని కూర్చున్నాను

పుస్తకం పట్టుకుంటే నా ప్రపంచం వేరుగా వుంటుంది. ఈ వంటలు, తిండి, నిద్ర ఏంగుర్తురావు. పైగా ఈమె నాకిష్టమైన రచయిత్రి రాసిన పుస్తకం కదా! వంట చేయలేదే, మా ఆయనకి టిఫిన్ పెట్టలేదే అని, ఇవన్నీ ఎం జ్ఞాపకం వుంటాయి చెప్పండి. మీరెప్పుడైనా ఈ రచయిత్రి రాజేశ్వరి రాసిన పుస్తకాలు చదివారా?'' అంది.

ఏదో బరువు తలకెక్కినట్టుగా ఫీలయ్యాడతను ఆమె ప్రశ్నతో.

''ఆఁ... చదివాను'' అని అనబోయి మింగేశాడు. చదివాను అన్నదగ్గర్నుండీ ఆమె ఏంరాసింది? వాటి ఉద్దేశం ఏమిటి? ఆమె పుస్తకాల వల్ల సమాజం ఎంతవరకూ ప్రభావితం అయ్యింది? ఇలా ప్రశ్నలవర్షం కురిపించిందంటే తలప్రాణం మోకాళ్లలోకి వస్తుంది. బుద్ధిగా నేనేం చదవలేదంటే ఈ ప్రస్తావన ఇంతటితో ఆపేస్తుందేమో అనుకున్నాడు. అందుకే ''ఆమె పేరు విన్నానుకానీ, నేనేం చదవలేదు సింధూ!'' అన్నాడు.

తెల్లబోయి చూసింది భర్తవంక.

గోడకి చేరగిలబడి- ''జీవితంలో నేను చాలా పెద్ద పొరపాటు చేశానండీ'' అంది శూన్యంలోకి చూస్తూ.

''ఏమిటి సింధూ అది'' అని అడిగాడు.

''మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడం. రాజేశ్వరి ఎవరో, ఏమిటో ఆమెని చదవకుండా బతికేస్తున్నారంటే... మీ బతుకే వేస్టు'' అంది.

అతను ఖంగుతిన్నాడు. ఆమె పుస్తకాల పురుగని అతనికి తెలును. ఏ షెల్ఫ్‌లో చూసినా, సేఫ్‌లో చూసినా, ట్రంకుపెట్టెలో చూసినా పుస్తకాలే కన్పించటం చూసి, 'బాబోయ్ ఇంత ఇంట్రస్టా' అనుకున్నాడుకానీ ఇంత పిచ్చికూడా అని అనుకోలేదు.

ఇలా రచయితల పిచ్చి, నటుల పిచ్చి, ప్లేయర్స్ పిచ్చి వున్నవాళ్లని ఎవరూ పెళ్ళిళ్ళు చేసుకోకూడదు. ఆ పిచ్చితో ఎదుటివాళ్ళకి పిచ్చెక్కిస్తేతప్ప వాళ్ళు నిద్రపోరు. సింధుక్కూడా ఇలా ఓ పిచ్చి వుందని తెలిసి జుట్టు పీక్కున్నాడతను.

''అంతగొప్ప రైటరా ఆవిడ! మా ఫ్రెండ్సంతా... అబ్బా పుట్టి కాకిగోలరా, ఎంత సేపూ ఎవరో ఒకరిని తిట్టిపోస్తూ వుంటుంది. అంతకుమించి ఏంవుండదు ఆమె కథల్లో అనేవారు. అందుకే నేను చదవలా!'' అన్నాడు కసిగా.

''మీకర్థంకాదు. అంతే! మీ మనసులు బూజుపట్టి వున్నాయని తెలిసే కటువుగానైనా చెప్పి తుడిచివేయాలని ఆమె తాపత్రయం. పౌరుషంవల్ల మనసును అద్దంలా చేసుకుంటారని ఆమె ఆశ. ఎంత పెక్యులియర్ కారెక్టర్స్ సృష్టిస్తుందో తెల్సా!

నేనసలు పెళ్ళి చేసుకుంటే ఆమె నవలల్లో పాత్రలాంటి మనిషిని చేసుకోవాలని ఎన్నో కలలుకన్నాను. నా ఆశ నెరవేరకపోగా, కనీసం ఆమెను చదవనుకూడా చదవని మిమ్మల్ని... హుఁ... ఎందుకులే బాధపడతారు'' అంది.

''నవలల్లోలా మనుషులుండాలంటే కలలు కనడమే మంచిది'' అన్నాడు తన అక్కసునంతా వెళ్లగక్కుతూ.

''ఆహాఁ... అలా వుండటానికి ట్రై చేయచ్చు

కదా!" అంది మూతి ముడుచుకుని సింధు.

"ఒక మనిషిమీద మరో మనిషికి అభిమానం ఏర్పడాలంటే ఎదుటిమనిషి తత్వం, ఉద్దేశాలూ ఇవన్నీ తనకు అనుగుణంగా వుంటేనే అలా జరుగుతుంది. సంస్కారం, వ్యక్తిత్వం అనేవి మనిషికి సహజంగానే వుండాలిగానీ, ఓ పుస్తకం చదివినందువల్లా, ఓ సినిమా చూసినందువల్లారావు. పుస్తకాలు ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తిత్వాన్ని మెరుగులు దిద్దుకోడానికి వుపయోగపడతాయి. నాకంటూ ఓ వ్యక్తిత్వం వుంది. ఇద్దరి అభిప్రాయాలు ఒకటిగా చేసుకుని బతకటంలో చాలా ఆనందం వుంది సింధూ! అందుకు నేను వ్యతిరేకిని కాదే!" అన్నాడు.

అలా అన్నందుకు సింధు కోపం తెచ్చుకుంటుందనీ, మళ్ళీ పెద్దగొడవ మొదలుపెడుతుందని భయపడ్డాడు.

కానీ అతను అనుకున్నట్టు సింధు కోపం తెచ్చుకోలేదు. ఆవేశపడలేదు. మెచ్చుకోలుగా చూసింది అతన్ని.

కందిపోయిన అతని ముఖం వంక, బాధతో ఎరుపెక్కిన అతని కళ్ళ వంకచూసి నవ్వింది.

ఆమె కోపమంతా నటనేనని తెలియటానికి ఎంతోసేపు పట్టలేదు అతనికి.

ఆమె తన చెంపని అతని భుజంమీద ఆనించి, వెక్కిరింతగా కనుబొమలు ఎగరేసింది.

అతనేం మాట్లాడలేదు. అలాగే కూర్చున్నాడు బింకంగా. కానీ ఇంతకు ముందున్న బాధతగ్గి, కళ్లల్లో వింతమెరుపు చేరింది.

ఆమె అల్లరి అర్థమైనవాడిలా బెడ్‌మీదికి వాలిపోయాడు. అతని పక్కన చేరి అతని నుదుటిమీద ముద్దుపెట్టి, "కోపం వచ్చిందా! ఊర్కే... తమాషా చేద్దామని ఏదేదో అనేశాను. ఈ మాత్రానికే ఎందుకింత దిగులు ... ఆఁ" అంది అతని జుట్టులోకి వేళ్ళుజొనిపి.

"సింధూ! నా ప్రాణాలన్నీ నీమీదే పెట్టుకుని బతుకుతున్నానుకదా! నన్నర్థం చేసుకోలేకపోతే నేనెంత కలవరపడతానో తెలీదా!" అన్నాడు ఆమెకళ్లలోకి చూస్తూ.

ఆమె నవ్వింది. అతని చేతిని తన గుప్పెట్లోకి తీసుకుని 'సారీ' అంది అనునయంగా.

★ ★ ★

ఆరోజు సింధు ఆఫీసునుంచి ఇంటికి వచ్చేసరికి మురళి ఇంకా ఇంటికి రాకపోవటం చూసి తాళంతీసి లోపలికి నడిచింది. ప్రతిరోజు ఆమె వచ్చేప్పటికి మురళి బ్యాంక్ నుంచి వచ్చేసుంటాడు. టీకాచి ఫ్లాస్కులో పోసి, మొక్కలకి నీళ్ళుపోస్తూనో, ఇన్ని పప్పులు ముందుపోసుకుని తింటూ పేపరో, పుస్తకమో తిరగేస్తూనో వుంటాడు.

ఈవేళ ఆ దృశ్యమేమీ కనబడకపోవటం చూసి బ్యాంక్‌లో వర్క్ వుండివుంటుంది అనుకుంటూ తనే టీ పెట్టుకుని తాగి, స్నానం చేసి వచ్చింది సింధు.

ఏదయినా మురళి రాకపోవటంతో బోర్‌గా అనిపించింది సింధుకి. చదవటానికి మూడ్ లేదు. నెమ్మదిగా లేచి తలుపులు దగ్గరికి వేసి, పక్కపోర్షన్‌లో వుంటున్న వల్లివాళ్ళ ఇంటివైపు నడిచింది.

వల్లి, సింధూవాళ్ళ ఇంట్లో అద్దెకుంటున్న రామారావుగారి ఒక్కగానొక్క కూతురు. కాలేజీలో ఇంటర్ చదువుతోంది. అందం, చురుకుదనంతో చూడముచ్చటగా వుంటుంది. సింధు నాన్నమ్మతో పాటుగా వల్లితల్లి శ్రీలక్ష్మి కూడా యాత్రలకు వెళ్ళటం వల్ల వల్లి, ఆమె తండ్రే ఇంట్లో వుండేది! ఆయన ఆఫీసు నుంచి వచ్చేసరికి ఎనిమిదవుతుంది.

శ్రీలక్ష్మి యాత్రలకి వెళ్ళినప్పటినుంచీ సింధురోజుకొక్కసారైనా, వల్లిని చూసి ఏం తింటోందో, ఏం చేస్తోందో పలకరించి వస్తుంది.

దగ్గరకు వేసున్న తలుపుల్ని ముందుకునెట్టి లోపలికి అడుగుపెట్టిన సింధుకి ముందుగదిలో వల్లి కన్పించలేదు.

'వల్లీ' అంటూ కర్టెన్ తొలగించి బెడ్‌రూమ్‌లోకి తొంగిచూసిన సింధుకి వల్లీ బెడ్‌మీద బోర్లా పడుకుని చాలాదీక్షగా ఏదో రాస్తోంది.

'తన రాకను కూడా గమనించకుండా అంత శ్రద్ధగా ఏంరాస్తోంది. ఖర్మగాలి ఈ పిల్లకూడా కథలు రాయటంగానీ మొదలు పెట్టలేదు

కదా' అనుకుంటూ నెమ్మదిగా రెండడుగులు వేసి ఆమె వెనగ్గా చేరి రాస్తున్న కాగితంలోకి తొంగిచూసింది.

'డియరెస్ట్ రాజేష్' అన్న సంబోధన చూడ గానే సింధు నుదురు ముడివడింది.

అప్పటికే లెటర్ రాయటం, కాగితం మడి చిగట్టిగా పెదవుల కానించుకునికవర్లో పె ట్టటం చేస్తున్న వల్లిచూపులు, చేతులు కట్టు కుని నిలబడి సూటిగా తనకేసి చూస్తున్న సింధుమీద పడగానే ఎక్కడలేని కంగారుతో బెడ్‌మీంచి లేచింది.

చేతులు వెనక్కి పెట్టుకుని, రాని నవ్వు పెదవుల మీదకు తెచ్చుకుని, "ఆంటీ ... ఎంతసేపైంది మీరు వచ్చి?" అని అడిగింది.

"నువ్వు రాజేష్‌కి లెటర్ రాయటం మొద లుపెట్టినప్పుడే వచ్చాను. ఏదీ ఇలాతే?" అంది.

దీనంగా ముఖంపెట్టి తలఅడ్డంగా ఊపింది ఇవ్వను అన్నట్టు.

సింధు చొరవ తీసుకుని వల్లి చేతిలో కవరు బలవంతంగా లాక్కుంది.

'డియరెస్ట్ రాజేష్, ఈ హాలిడేస్ వల్ల నిన్ను రోజూ చూడలేకపోతున్నందుకు నాకుమాత్రం బాధగా లేదా! ప్రతిక్షణం నీకళ్లలోకి చూస్తూ, గువ్వలా నీ గుండెల్లో ఒదిగిపోవాలని, వెచ్చగా చెలరేగే కోర్కెల్ని నీతో తీర్చుకోవాలనీ నాకు కాక ఏగోడకో, చెట్టుకో పుట్టకో వుంటుందా! ఎందు కంత కోపం? రూమ్‌కి రమ్మన్నావు. కానీ నాకు చాలా భయంగా వుంది. కానీ నిన్ను చూడని రోజు ప్రపంచమంతా శూన్యంగా...' అలా సాగి పోయింది ఉత్తరమంతా! ఆపైన చదవబుద్ధి కాలేదు సింధుకి.

ఉత్తరం మడిచి ఆమె చేతికిచ్చి 'బావుంది' అంది.

ఆమె కంఠంలో వ్యంగ్యం వల్లికి అర్థంకాక పోలేదు. కానీ ఆ పిల్ల ఎనిమిదేళ్ళ వయసు నుండీ ఆ ఇంట్లోనే, ఆ వాతావరణంలోనే పెరగటంవల్ల సింధు అంటే అక్కలాంటి భావంతోపాటు భయమూ, భక్తీకూడా వున్నాయి.

అందుకే మాట్లాడకుండా వుత్తరం సింధు చేతికిచ్చింది. ఆ అనుబంధమే లేకపోతే... 'నా బాయ్‌ఫ్రెండుకి నేను రాసుకుంటున్నాను ... అడగటానికి నువ్వెవరు' అని తిరుగుబాటు ధోరణిలో మాట్లాడి వుండేది.

సింధు ఆ పిల్లనే చూస్తోంది. తల్లిచాటున పెరగవలసిన లేత పిందె.. ప్రపంచమంటే ఏమిటో కూడా తెలీని టీనేజ్‌గర్ల్..! చూస్తున్న సినిమాలు, చదువుతున్న పుస్తకాలు, సంచరి స్తున్న వాతావరణం అన్నీ...అన్నీ పెద్ద విషవ లయాలే! ఇంతకంటే మంచి ఆలోచనలు, ఆదర్శాలు ఎలా పుడతాయి?!

ఇది ఆ పిల్లతప్పుకాదు! మనిషికి నీతి, నియమాలు కొంత పుటకలతో వస్తే, మరికొంత పరిసరాల ప్రభావం వల్ల వస్తాయి. పిల్లల మానసిక భావాలు పరివర్తన చెందటానికి గట్టి పునాదులు వేసినా ప్రస్తుతం వున్న వాతావ రణం ఆ పునాదుల్ని కూడా కదిలించి వేయగ లుగుతుంది!

మనసులో చెలరేగుతున్న భావపరంపరల్ని తుంచుతూ 'ఆంటీ' అన్న వల్లి పిలుపుకి ఈ లోకంలోకి వచ్చింది సింధు.

వల్లి సింధు చేయి పట్టుకుని "ప్లీజ్ ఆంటీ ... డాడీకి చెప్పకు" అంది బతిమాలుతూ.

"చెప్పను" అంది చిన్నగా నవ్వి.

"ప్రామిస్..." అంటూ సింధు చేతిని తనే తీసుకుని తన చేతిలో వేసుకుంది.

సింధు నవ్వి, "చెప్పనుగానీ, రాజేష్ ఎవ రూ? ఏం స్టూడెంటూ!" అని అడిగింది.

"అతని పుట్టుపూర్వోత్తరాలు నాకు తెలియ వుగానీ, ఫైనల్‌డిగ్రీలో వున్నాడు. మనిషి చాలా అందంగా ఉంటాడు. నవ్వినా, మాట్లాడినా చాలా స్టైల్‌గా వుంటుంది" అంది ఆనందపడి పోతూ.

"అతనిలో నువ్వు బాగా ఇంప్రెస్ అయిన లక్షణమేమిటో ఒక్కటి చెప్పు?" అని అడి గింది.

'అఁ...' అని ఒక్క క్షణం ఆలోచించి- "శ్రీనా ధుడు రాసిన 'ప్రేమించు' నవల లేదాంటీ, అందులో హీరోకున్న లక్షణాలన్నీ రాజేష్‌లో వున్నాయి" అంది అచ్చమైన అమాయక త్వంతో.

సింధుకి నవ్వూ, ఆవేదనా కలిగాయి.

"నీదారి వక్రమార్గంవైపు వెళ్ళబోతుందని ఇప్పుడే అర్థమయింది తల్లీ! అతను నిన్ను తన రూమ్‌కి రమ్మన్నాడు. నువ్వు భయం వేస్తుందని రాశావు. ఈవేళ కాకపోయినా, రేపైనా తన సమ్మోహనమైన నవ్వుతోనో, మాటతోనో నిన్ను రప్పించుకోగలడు. కోర్కెలు తీరతాయి. ఆపైన జరిగే పరిణామాలు, వాటి ఫలితాలు ఆలోచించావా? అసలునీకు ఇవన్నీ ఊహించగల వయసుందా?" అంది మందలింపుగా.

వల్లీ ఏం మాట్లాడలేదు. బెదురు చూపులు చూస్తూ నిలబడింది. ఆ లెటర్ విసురుగా తీసుకుని చించి పారేసింది సింధు .



వల్లీ భుజం మీద చేయివేసి- "జీవితం చాలా విలువైందమ్మా వల్లీ! పతనం కావటం తేలికే, ఆ తర్వాత జీవితం ఎంత భయంవే స్తుందో! ప్రేమించు. కానీ ప్రేమిస్తున్నానూ అన గానే పడకవేపు చూసే మనిషిని కాదు ప్రే మించేది. ప్రేమించడానికి అర్హమైన మనిషిని ప్రేమించు" అని ఒక్క నిముషం ఆగి గుడ్లప్ప గించి చూస్తున్న ఆ పిల్లని తట్టి- "అసలు నా మాటలు అర్థమౌతున్నాయా?" అని అడిగింది ఎందుకో అనుమానం వచ్చి.

తలవూపిందా పిల్ల అర్థమౌతుందన్నట్టు.

"నీకెలా చెప్పాలో తెలీటంలేదువల్లీ నాకు అక్కలు చెల్లెళ్ళు ఎవరూలేరు. నువ్వేకాదు నీలా ఎవ్వరు తప్పటడుగు వేసినా నా మనసు బాధతో కృంగిపోతుంది. నవలలు చదివి అందులోలా బతకాలనుకోవడం చాలా తెలివి తక్కువపని. ఎలా బతికితే బావుంటుందో నిర్ణ యించుకోవాలి" అంది అనునయంగా.

కొంచెం సేపు నిశ్శబ్దం తర్వాత సింధు అక్కడినుండి కదిలి, వల్లి బుక్‌షెల్ఫ్ దగ్గరికి వెళ్ళి, అందులోవున్న బుక్స్ ఒక్కొక్కటి తీసి చూసి పక్కన పెడుతూ అడిగింది.

"మొత్తం శ్రీనాధుడు రాసిన పుస్తకాలన్నీ వున్నాయే నీ దగ్గర. ఇవన్నీ నీవేనా!" అని.

"కొన్ని నావి. కొన్ని మాఫ్రెండ్స్‌వి. మా ఫ్రెండ్స్ అంతా ఆయన పుస్తకాలంటే పడి చచ్చిపోతారు" అంది వేగంగా.

"మరి ఒక్కొక్కరికీ ఒక్కో బాయ్‌ఫ్రెండ్ కూడా వున్నాడా" అని అడిగింది చాలా కూల్‌గా.

వల్లి నవ్వింది సమాధానం ఇవ్వకుండా!

"చెప్పువల్లీ! రకరకాల మసాలాలు దట్టించి రచయితల కోవలోకి చేరిపోయి, అతను మీ మీదకు వదులుతున్న ఈ చిత్తుకాగితాలకి మీరెంత విలువనిస్తున్నారో అర్థం అవుతోంది. నువ్వేకాదు, నీ ఫ్రెండ్సు, నీ ఫ్రెండ్సులాంటి మరో వందల వేలమంది ఇవి చదివి ఒక ఆలోచన, బుద్ధి లేకుండా ఎటుపయనిస్తున్నా రూ అనేది అర్థంకావటానికి నువ్వే తా ర్కాణం" అంది కటువుగా.

ఆ పిల్ల కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. ఉన్నట్టుండి కుర్చీలో కూలబడి చేతుల్లో ముఖం దాచుకుంది.

సింధు మౌనంగా వుండిపోయింది.

వల్లిని అలా చూస్తుంటే సింధుకి జాలివే సింది.

'అర్థంపర్థంలేని పుస్తకాలవల్ల వచ్చిన అజ్ఞానం తప్ప, ప్రపంచపు అసలురంగు తెలు సుకునే వివేకం రాని వయసు, అమాయక త్వం... పాపం కటువుగా చెప్పి బాధపెట్టా నేమో!' అనుకుంటూ ఆ పిల్ల గడ్డం పట్టుకుని ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకుని కళ్ళు తుడిచి- "ఏడుస్తున్నావా వల్లీ, నీకు మంచిచె డు విడమర్చి చెప్పితే తప్ప అర్థంకాని వయ సు. నీకు చెప్పే అధికారం నాకు లేదా!" అంది.

ఆమె చేయి పట్టుకుని- "లేదాంటీ! ఒకరికొ కరం ఏమీ కాకపోయినా, నా కోసం మీ తాప త్రయం చూసి ఆనందంగానూ, గర్వంగానూ వుంది. చదువు వల్ల వచ్చే జ్ఞానంతోపాటు, మీ దగ్గర నేర్చుకోవలసింది చాలా వుందని పిస్తుంది" అంది.

సింధు తన జీవితాన్ని సరైన గాడిలో పడవేసిందనే విషయం చాలా విచిత్రంగానూ, ఉద్వేగంగానూ వుందామెకి.

"ఈ పుస్తకాలువుండాల్సిన స్థానం ఇదికాదు. ఇంకెప్పుడూ వీటిని తెరవకు. దూరంగా విసిరేయి. జీవిత సమస్యలకి సమాధానం ఇచ్చే నవలలు, మనుషుల్ని అద్భుతంగా స్టడీచేసి కళాఖండాల్ని సృష్టించిన సాహిత్యం, విలువకట్టలేని సాహిత్యం నేనిస్తాను, చదువు. అప్పుడర్థం అవుతుంది జీవితం అంటే ఏమిటో, అసలు సాహిత్యం అంటే ఏమిటో" అంది.

సింధుని మౌనంగా చూస్తోంది వల్లి. దీక్షగా చూస్తోంది. ఆమెకు సింధులో ఒక లేతమొ క్కని తన సంరక్షణలో మహావృక్షంగా తీర్చిది ద్దాలనుకునే బాధ్యతాయుతమైన తల్లి కని పించింది.

ఇంతలో బైట మురళి స్కూటర్ శబ్దం విని వెళ్ళివస్తానని చెప్పి బైటికి నడిచింది సింధు.







రాజు మమత కోసం అరగంట నుంచి ఎదురుచూస్తున్నాడు పార్కులో. జనసమర్థం ఎక్కువగా వుండే పార్కు కాదది. ప్రేమికులు ఏకాంతంగా మాట్లాడుకోడానికి అనువైన ప్రదేశం. అందుకే ఎక్కువగా వాళ్ళిద్దరూ అక్కడే కలుసుకుంటూ వుంటారు.

రాజు ఇప్పుడు పూర్తిగా మమత ఆలోచనల్లోనే గడుపుతున్నాడు. ఆఫీసులో వున్నంతవరకే పనిమీద అతనిదృష్టి ఆ తర్వాత మనసు నిండా మమత రూపమే! భూతకాలం, భవిష్యత్కాలం వీటిని గురించి పూర్తిగా ఆలోచించటం మర్చిపోయాడు.

అద్భుతమైన తెలివితేటలు, విషయపరిజ్ఞానమూ వున్న ఓ యువకుడు దేని ప్రభావమైనా కానీ ప్రేమలోపడి దేశానికి ఓ గొప్ప పౌరుడిగానో, ఓ మేధావిగానో రూపుదిద్దుకునే అవకాశం లేకుండా అతని ఆలోచనలు అడ్డుదారి పట్టాయి.

ప్రేమ పవిత్రమైందే, తపస్సులాంటిదే. ప్రేమిస్తే ప్రేమకు మనసులో ఓ భాగమిచ్చి, జీవితం గురించి కూడా ఆలోచించవచ్చును. ప్రేమింపబడే గుణం, గొప్పతనం అతనిలో వున్నందుకు ఆ సంతోషం అతనివరకే పరిమితం.

కానీ అతనో మేధావిగానో, శాస్త్రజ్ఞుడిగానో కన్పిస్తే ఆ సంతోషం చాలామందిది అవుతుంది. పైగా అలాంటి మేధావిని మరొకరిని తయారుచేసుకోగలిగినందుకు దేశం గర్వపడుతుంది కూడా! ఆ అవకాశాన్ని పూర్తిగా కోల్పోయాడు రాజు. రాజు తెలివితేటలు గాడితప్పక ముందు అతని ఆలోచనలు తెలిస్తే మమత కూడా అలా అతను మందగించకుండా చూసేదేమో! కానీ ఆమెకు తెలీదు ప్రేమలోపడి అతని బుద్ధి, జ్ఞానం నివురుగప్పిపోతుందని.

కలుసుకున్నప్పుడు సరదాగా నాలుగు కబుర్లు చెప్పుకోడం, అప్పటికి విడిపోవటం, అంతే జరిగేది.

తండ్రి కోసమనో, లేక తోచనప్పుడో ఆఫీసుకి వచ్చి కాసేపు కాలక్షేపం చేసి వెళ్ళే ఆమెకు కొత్తగా అప్పాయింటయిన రాజుతో సహజంగానే పరిచయం ఏర్పడింది. అయితే అతనితో మాట్లాడుతున్నప్పుడు తమ కిందపనిచేసే ఒక మామూలు ఉద్యోగితో మాట్లాడుతున్నట్టనిపించలేదు. చాలాకాలం నుంచి పరిచయంవున్న వ్యక్తిలా, ఆత్మీయుడైన మనిషిలా అనిపించాడామెకు. పైగా తండ్రి అతన్ని పొగుడుతుంటే... మరింత అభిమానం పెంచుకుంది రాజుమీద.

అందుకే తరచూ అతన్ని చూడ్డానికి ఆఫీసుకి వెళ్ళేది. అతనితో కబుర్లు చెప్తూ కాలక్షేపం చేసేది. ఆమె డిగ్రీ చదువుతూంది. పుట్టింది ఐశ్వర్యంలోనే అయినా, ఆమె ఆలోచనలు అంతెత్తున వుండేవికావు. జీవితం గురించి, ప్రేమ పెళ్ళి వీటి గురించి స్పష్టమైన అభిప్రాయాలున్నాయి.

అందుకే అతన్ని ప్రేమిస్తోంది. ఆరాధిస్తోంది. పెళ్ళిచేసుకోడానికి సిద్ధపడుతోంది. కానీ ప్రేమలోపడి రాజు కోల్పుతున్నదేమిటో గమనించలేకపోతున్నదామె.

సమయం ఆరుగంటలు.

రాజు సహనం నశిస్తోంది. అందంగా కట్ చేసిన మొక్కలు చిరుగాలికి కదిలీకదలనట్టు కదులుతున్నాయి. చెట్టు కానుకుని దిగులుగా కూర్చున్న రాజు, దూరంగా వస్తున్న మనిషిని చూసి మమతేనని గుర్తించాడు. అతని కళ్ళల్లోకి వింతమెరుపు చేరింది. మనసులో అలజడి.

అప్పటివరకూ ఆమె కోసం ఎదురు చూసిన సంగతి జ్ఞాపకం వచ్చి మూతి ముడుచుకుని కూర్చున్నాడు.

మమత వచ్చేసింది. చిరుజల్లులా! కోపంతో వున్న అతని ఫోజు చూసి నవ్వింది.

అతని పక్కన గడ్డిలో చతికిలబడుతూ- 'హలో హైబాయ్! కోపంలో నీ ముఖం కంది పోయి ఆడపిల్లలా ముద్దుగా వున్నావు. ఇలా నాకళ్ళల్లో చూసుకో, నీకే తెలుస్తుంది" అంది అతని గడ్డం పట్టుకుని తనవైపు తిప్పు కుంటూ.

అతను ఆమె చేయి విసిరికొట్టాడు.

"అబ్బో ... ఇదంతా కోపమే! ఎదురు చూ ర్డంలో వుండే థ్రిల్ ఎలావుంటుందో నీకు తెలియాలని ఆలస్యంగా వచ్చాను. ఇప్పుడు చెప్పు నీఎక్స్‌పీరియన్స్ ఏమిటో" అంది కొంటెగా.

"నా ముఖంలా ఉంది. నీకెన్నిసార్లు చెప్పా ను. వెయిట్‌చేయటం అనేది నాకు చాలా దుర్భరంగా వుంటుందని, పైగా నా అనుభవం ఎలావుందో చెప్పమంటున్నావు! 'ఆc, అర్భకు డు... ఎప్పుడు వెళ్తే ఏముందీ ఎదురు చూడక ఛస్తాడా' అనికదా నీ ఉద్దేశం. కానీ నీకు తెలీదు. ఈ పేదగుండెలో నీస్థానం ఏమిటో! స్థానం ఎలాంటిదైనా గుండె పేదదే కాబట్టి, దానికి విలువ లేదంటావు. అంతేనా!" అన్నా డు వేదన ధ్వనించే కంఠంతో.

మమత అతన్ని సూటిగా చూస్తూ- "ఐశ్వ ర్యానికే విలువనిచ్చేదాన్నయితే.... అవన్నీ వున్న మనిషిని పొందటం నాకేం కష్టంకాదు. అలాఅని ఆరడుగుల అందగాడివనీ నిన్ను ప్రేమించటంలేదు. నాలుగురోజుల పరిచ యంతో నీమీద ప్రేమను పెంచుకోనూలేదు. పేదగొప్ప ఇలాంటివి నా హృదయానికి అంట నివి. నీ మానరిజమ్, నడవడి నన్నాక ర్షించాయి. నీ భవిష్యత్తుకి చేయూతనివ్వాలనే కోరిక కలిగింది. అలాంటి కోరిక కలగటానికి త్వరగా చలించే నా స్వభావం కారణం కావ చ్చు. ఇవన్నీ నీతెలివైన బుర్రకు తట్టలేదా, ఆ గుండె.. ఈ గుండే అని మొదలుపెట్టావు" అంది.

"లేకపోతే నీకెన్నిసార్లు చెప్పాను మమతా! అనుకున్న టైమ్‌కి రావాలి అనీ. ప్రతినిముషం నీ సాన్నిధ్యంలో గడపాలనుకునే నేను నిరీక్ష ణతో గడపటం భరించలేకపోతున్నాను" అన్నాడు దిగులుపడుతూ.

"నిరీక్షణా... అవిడెవరు?" అంది భృకుటి ముడిచి చిలిపిగా.

ఆమె తలమీద మొట్టి, ఆమె మీదకు వంగి చెంపమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆ హఠాత్పరిణామానికి విస్తుపోతూ- "ఏమి టిది? పార్కనే సంగతి మర్చిపోయినట్టున్నావు. ఎవరైనా ఫోటో తీసి మా డాడీకి పంపగలరు జాగ్రత్త" అంది.

"పంపనీ, విషయం తెలిసి వెంటనే మనకి పెళ్ళి చేసేస్తారు" అన్నాడు.

"ఆc... చేస్తారు. పెద్దకర్రతో! అయినా మన విషయం ఇలా బజారునపడి, ఎవరో వెళ్ళిఏదో ఊదితేనే పెద్దవాళ్ళకి తెలిసేపద్ధతి నాకిష్టం వుండదు. ప్రేమకు ధైర్యం, నిజాయితీ అనే ముఖ్యలక్షణాలుండాలి. కాబట్టి మా డాడీతో నేనే మాట్లాడతాను" అంది మమత.

"ఈ ధైర్యం, ఈ ప్రేమే నన్ను నీముందు మూగవాణ్ణి చేస్తున్నాయి. మా అక్క నిన్ను మర్చిపొమ్మని బతిమాలింది. మన విషయం తెలిసినప్పుడు మీ డాడీ పరిస్థితికి అక్క భయపడుతోంది. కృతజ్ఞత చూపాల్సిన మనం ఆ పిల్లమీద ఆయన ఆశల్ని ధ్వంసం చే యటం మంచిదికాదని నచ్చచెప్పబోయింది. అవన్నీ నిజమే అయినా నీమీద ప్రేమను చంపుకోలేక పోతున్నానుమమతా! మీ డాడీ కాదన్నా మనం ఒకటి కావటం నిజం. నిన్ను పెళ్ళిచేసుకుని అందలం ఎక్కించలేకపోతే నన్ను దూషించకు. నన్నువిడిచి ఎక్కడికీ వెళ్ళి పోకు" అన్నాడు. ఆమె చేతిని తన చెంపకు రాసుకుంటూ.

అతనిగొంతులో బాధ, ప్రేమ, భయం అన్ని ధ్వనులూ కలగలిసి పలికాయి ఒక్కసారే.

ఆ ధ్వనికి మమత మనసు ఆర్తితో నిండి, అతని చేతిని మృదువుగా తన పెదవులతో తాకి అంది- "ప్రేమించటం అనేది తప్పే అనే ఉద్దేశమే ఆయనకుంటే ఆ తప్పు చేసిన మనుమల్ని దండిస్తారేమో కానీ, అందుకు బాధ్యులు కానివారినిదూషించేంత సంస్కారం లేనిమనిషి కాదాయన. ఇది మాత్రం నిజం రాజా! మీ అక్కవన్నీ అనవసరపు భయాలు.

ఇవపోతే, నన్నేం అందలం ఎక్కించనవసన

దేశంలోని అన్నిప్రాంతాల మెడికల్, టెక్నికల్ ఎడ్యుకేషన్ కోర్సుల పూర్తి
వివరాలు, చిరునామాలతోసహా అపూర్వ గ్రంథం




ఈనాడు దినపత్రికలో తొమ్మిది నెలలపాటు ధారావాహికంగా వెలువడి
35 లక్షల పాఠకులను ఆకట్టుకొన్న విలువైన వ్యాసాల సంపుటి.

## శ్రీ వి.యస్. హరినారాయణ్

ఈ పుస్తకంలో ఇంజనీరింగ్ కోర్సులు, మెడికల్, పారా మెడికల్, అగ్రికల్చరల్, వెటర్నరీ, మేనేజ్‌మెంట్, కంప్యూటర్, టీచర్ ట్రైనింగ్, పాలిటెక్నిక్, ఐ.టి.ఐ, కంపెనీ సెక్రటరీ, చార్టర్డ్ ఎక్కౌంటెంట్, కాస్ట్ ఎక్కౌంటెంట్, ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్, ఐ.ఎఫ్.ఎస్, పరీక్షల వివరాలు, ఇంటర్మీడియట్, స్కూలుస్థాయి వృత్తి విద్యా కోర్సులు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫేషన్ టెక్నాలజీ, హోటల్ మేనేజ్‌మెంట్, కరెస్పాండెన్స్ కోర్సులు, స్త్రీలకు ప్రత్యేక విద్యావకాశాలు, వికలాంగులకు విద్యాసౌకర్యాలతోసహా దాదాపు 1000 రకాల కోర్సుల పూర్తి వివరాలు చిరునామాలతోసహా పొందుపరిచారు.

**విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే 1000**

వెల: రు. 25/- మనియార్డర్ ద్వారా పంపి
పుస్తకాన్ని పొందండి.

**ఈ పుస్తకం చదివితే మీ జీవితం మారిపోగలదు.**

# శ్రీమహాలక్ష్మి

బుక్ ఎంటర్‌ప్రైజెస్,
మ్యూజియంరోడ్, విజయవాడ-520 002

రంలేదుగానీ, నన్ను నన్నుగా చూస్తే చాలు. కేవలం వంటగది, భర్త, పిల్లలు- ఇదే జీవితంగా గడపాలని లేదు నాకు. కొత్త విధానాలతో అడ్వర్‌టైజ్‌మెంట్ ఫిలిమ్స్ ప్రొడ్యూస్ చేయాలనేది నా కోరిక. మా నాన్నగారి ప్రోత్సాహం ఎలాగూ వుంటుంది కాబట్టి నా టాలెంట్ అందులో చూపించాలనేది ఆశయంగా పెట్టుకున్నాను. ఇంకా టైం పడుతుందిలే... ఇప్పుడే కాదు. అందాకా కబుర్లు చెప్పుకుంటూ జీవితంలో మర్చిపోలేని అనుభవాలు మలుచుకోవాలని...'' పూర్తిచేయకుండా అతని వంక చూసి నవ్వింది.

రాజు మాట్లాడకుండా తల వెనక్కి ఆనించి దూరంగా కొండలమధ్య మసకబారుతున్న సూర్యకాంతిని చూస్తున్నాడు.

పార్కంతా గుబురుగా పెరిగిన చెట్లు, పొదల మూలంగా అంధకారం అలముకున్నట్టు అనిపిస్తోంది. వెలిమబ్బులతో వున్న ఆకాశంలో ఎక్కడో ఓ మూల మిణుకుమిణుకుమని ఓ చుక్క వెలిసింది. పార్కులో కూడా జనం లేకపోవడంతో నిశ్శబ్దంగా వుంది.

మౌనంగా, దిగులుగా కూర్చున్న రాజుని చూస్తే ఆమె మనసు ఆర్ద్రమైంది.

అతని జుట్టులోకి వేళ్ళుజొనిపి చెరిపేస్తూ- ''ఏమిటి రాజూ... అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు. ఆ విషయం ముందే చెప్తే ఇంత కంఠశోష వుండేదికాదుకదా... ఆఁ'' అంది హాస్యంగా.

అతను ఆమె భుజంమీద తన తలానించి- ''మమతా! నీ ప్రేమని పొందటం ఎన్ని జన్మల పూజాఫలితమో! ఆ ప్రేమకి నేను అర్హుణ్ణి కానేమోనని ఆలోచిస్తున్నా'' అన్నాడు.

''పూజాఫలమా, ఇంకా ఏమన్నానా!నేనంత గొప్పదాన్నేంకాదు. అవేం ఆలోచించకు పిచ్చిగా'' అంది అతనికి సాంత్వన కలిగేలా ఆప్యాయంగా.

రాజు జరిగి, ఆమె ముఖాన్ని దోసిట తీసుకుని- ''నువ్వు గొప్పదానివే! నీ మనసులో దొరికిన స్థానం ప్రపంచాన్ని జయించినంత గొప్పగా, ఆనందంగా వుంది. ఈ క్షణంలో నా ఈ పేదగుండె ఆగిపోతే బావుండునని పిస్తోంది'' అన్నాడు.

'హబ్బా' అంటూ తలపట్టుక్కూర్చుంది మమత.

''ఏమైంది మమతా?'' అంటూ ఆందోళనగా అడిగాడు.

''మళ్ళా పేదగుండె దగ్గరకే వచ్చావు. అసలు నాకు తెలీక అడుగుతానూ, సినిమాలు బాగా చూస్తావా నువ్వు? చూస్తే ఎవరివి ఎక్కువ చూస్తావో చెప్పు నాకు'' అంది.

అతను నిట్టూర్చి, ''అదేం కాదు- నువ్వు అవునన్నా కాదన్నా నాది పేదగుండేకదా'' అన్నాడు.

''అహాఁ... ఏది చూడనీ'' అంటూ అతని షర్టుపట్టుకుని బటన్‌తీసి, అతని గుండె భాగం చేత్తో రాస్తూ- ''ఏదీ... నీకసలు గుండె లేందే'' అంది.

అతను ఆమె మాటలు పట్టించుకోలేదు. ఆ చేతి స్పర్శకు అతని నరాలన్నీ ఒక్కసారి జల్లుమన్నాయి. గుండె వేగం పెరిగింది. ఏదో తెలీని ఆవేశం పరవళ్ళు తొక్కింది. రెండు చేతుల్తో ఆమెను చుట్టేసి గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

అతని కౌగిలిలో నలిగిపోతున్న మమత- ''రాజూ... ప్లీజ్'' అంటూ వారించింది.

ఆమె మరో మాట మాట్లాడకుండా ఆమె పెదవుల్ని తన పెదవుల్తో మూశాడు. క్షణాలు గడిచేకొద్దీ అతని పెదవులు ఆమె ముఖమంతటినీ తాకసాగాయి. ఆపుకోలేని తమకంతో, ప్రేమతో ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు.

అతని కౌగిట్లో ఆమె నాజూకు శరీరం నలిగిపోతోంది. అతన్ని ప్రతిఘటించటానికి ప్రయత్నిస్తూ- ''రాజూ... ప్లీజ్... ప్లీజ్ కంట్రోల్ యువర్‌సెల్ఫ్'' అంది ఎలాగో గొంతుపెగుల్చుకుని.

ఆమె నిలువెల్లా ఒణుకుతోంది.

కానీ అతనిలో ఉద్రేకం... ఆమెను పూర్తిగా పొందాలనే కోరిక ఆమె మాటల్ని విన్పించుకోనీయటం లేదు.

మమతకి అతని తాకిడి కొత్తగా, వింతగా వున్నా ఆదినుంచీ ఆమె పెరిగిన వాతావ

రణం, చేసిన నేస్తాలు, చదివిన పుస్తకాలు ఆమెను ఉత్తమ సంస్కారిగా రూపుదిద్దాయి. శరీరానికి కలిగే అనుభూతిని అనుభవించాలనే కోరికకంటే కట్టుబాట్లు, పరిసరాలు, నియమాలు అనే విచక్షణతో ఆమెకు అతని కౌగిలి సుఖాన్నివ్వడంలేదు.

ఒంట్లో శక్తినంతటినీ కూడగట్టుకుని రెండు చేతుల్తో అతన్ని బలంగా అవతలికి తోసింది.

ఊహించని పరిణామానికి రాజు వెనక్కి పడ్డాడు.

రెండు నిముషాల వరకు జరిగిందేమిటో అర్థంకాలేదతనికి. అర్థమయ్యాక తలెత్తి మమతవైపు చూడలేకపోయాడు. అలా నేలమీదే అతని చూపులు. సిగ్గుతో కుంచించుకుపోతున్నట్టుంది అతని వాలకం.

వదినిముషాలు గడిచాయి.

మమత ముఖానికి పట్టిన చెమటని కర్చీఫ్‌తో తుడుచుకుంటూ, హాండ్‌బాగ్ పట్టుకుని పైకి లేవబోయింది కోపంగా.

రాజు వేగంగా ఆమె చేయిపట్టుకుని, ఆమె కళ్ళల్లోకి చూశాడు. అవి తీవ్రంగా తననే చూస్తూ కన్పించాయి.

"రాజూ... దిసీజ్ ఆల్ రబ్బిష్. నాకిష్టం వుండదు. ఉన్నట్టుండి ఏమైంది నీకు. ఆడపిల్ల చేయిమీదపడితేనే హద్దులు దాటేంత బలహీనుడివా నువ్వు... ఐకెనాట్ ఎక్స్‌పెక్ట్‌సో. నిన్ను పక్కదారి పట్టించే ఆలోచనలు, లక్షణాలు ఏమైనా నీ మైండ్‌లోకి చేరితే తుడిచేసుకోవడం మంచిది.

సెక్స్ మడ్ నాట్ బి ద మోటోఫర్ లవ్. నాకిష్టం లేని ఈ లక్షణాలు... నీలో అంతర్గతంగానైనా కూడా వున్నా నేను తెలుసుకోగలను. అప్పుడు నీకు గుడ్‌బై చెప్పడానికి కూడా నేను బాధపడను" ఆవేశంతో చెప్పవలసిన రెండు మాటలూ తీవ్రంగా చెప్పింది.

అతనిలో ఆందోళన మొదలైంది.

ఆమెలో కలిగిన కల్లోలం ఎలాంటిదో ఊహించుకుని ముఖమెత్తి ఆమెను చూడలేకపోతున్నాడు.

హఠాత్తుగా దెబ్బతిన్న పక్షిలా విలవిల్లాడుతూ- "మమతా... నన్ను అర్థం చేసుకున్నది ఇదేనా?" అన్నాడు దీనంగా.

ఆమె కఠినంగా చూసింది అతన్ని.

"ఓ పబ్లిక్ పార్క్‌లో చుట్టూ పరిసరాలు గమనించకుండా వళ్ళుమరచి మూర్ఖుడిలా ప్రవర్తించే వారినేమంటారో చెప్పమంటావా?" అంది తల తిప్పేసుకుని.

ఆమె చేతులు పట్టుకుని- "క్షమించు మమతా! మరోసారిలా జరగదు. నేనెందుకిలా ప్రవర్తించానో కూడా చెప్పలేకపోతున్నాను. జరిగిన దానికి శిక్షగా నువ్వేం చెప్పినా చేస్తాను" అన్నాడు అర్థింపుగా.

"అయితే కనిపించే ఆ చెట్టెక్కి చిటారుకొమ్మన కూర్చో తెల్లవారేవరకూ కోతిలా! అదీ పనిష్మెంట్... అర్థమైందా!" అంది సీరియస్‌గా ముఖంపెట్టి.

అతను కదల్లేదు. ఆమె హాస్యాన్ని కంటోందని అతనికి తెలుసు.

"ఏమిటి... వెళ్ళవేం?" అంది ఆర్డర్ చేస్తూ.

"నాకు గోడలు, చెట్లు, పుట్టలు ఎక్కడం చేతకాదు మమతా!" అన్నాడు ఏడుపు ముఖంపెట్టి.

మమత గట్టిగా నవ్వేసింది.

రాజు ఆమె నవ్వు ముఖం చూసి ప్రసన్నమయ్యాడు.

అతని చేతిమీద గట్టిగా గిచ్చి అప్పుడన్నది- "ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించకు రాజూ! ఫిజికల్ డిజైర్ తీర్చుకోడం కోసమే అయితే ప్రేమించనవసరం లేదు. చాలా మార్గాలున్నాయి. ప్రేమంటే సెక్సువల్ ఎట్రాక్షన్ కాదు... భక్తిలాంటిది. నువ్విలా ప్రవర్తిస్తే దాని అర్థం మారిపోయి, బాధకలుగుతుంది నాకు" అంది అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుని.

"నీమీద నాకు భక్తి ఒక్కటేకాదు... ఆరాధన కూడా! నువ్వు నమ్మగలిగితే సంతోషిస్తాను. లేదంటే తెల్లవార్లూ నువ్వు చెప్పినట్టు ఆ చెట్టుకొమ్మనే కూర్చుంటాను" అన్నాడు తలొంచుకుని.

అన్నీ మర్చిపోయి నవ్వేసింది మమత. ఆమె నవ్వుతో అతనూ శృతి కలిపాడు.

రాజు మమతని అప్పుడప్పుడు కలుసుకుంటూనే వున్నాడు. అతని మాటల్లో, వుద్దేశాల్లో ఎలాంటి మార్పు రాలేదని గ్రహించిన మాలతి, అతని వివాహం గురించిన నిర్ణయం అతనికే వదిలేసింది. తర్కవితర్కాలతో సమస్య పరిష్కారం కానప్పుడు మౌనం వహించడమే మంచిదనిపించిందామెకు.

ఆ రోజు ఆఫీసులో వర్కింగ్ టైమ్ కాగానే ఇంటికి బయల్దేరుతున్న రాజుని పిలిచి "ట్రాఫిక్ ఇన్స్పెక్టర్ పోస్టుకి ఇంటర్వ్యూ ఎప్పుడన్నావు?" అడిగారు కాళిదాసుగారు.

"ఇరవై ఆరునసార్" అని సమాధానమిచ్చాడు రాజు.

"అంటే ఇంకో వారం టైంవుందన్నమాట. బోర్డు ఆఫ్ డైరెక్టర్ నాకు బెస్టు ఫ్రెండ్. ఈరోజు సెవన్ థర్టీకి ఆయన ఇంటికి వస్తారు. నీ విషయం ఆయనతో మాట్లాడతాను. ఆ టైమ్కి నువ్వూ మా ఇంటికి వస్తే బావుంటుందేమో! ఒక కేపబుల్ పర్సన్కి రికమెండ్ చేయడంలో తప్పులేదనే విషయం ఆయన దృష్టికివస్తే నాకు తృప్తిగా వుంటుంది" అన్నారాయన.

"తప్పకుండా వస్తాను సార్" అన్నాడు నమ్రతగా.

"ఓ.కే... యుకెన్ గో" అని ఫైలులోకి తల దూర్చేశారాయన.

ఉన్నట్టుండి అతని కళ్ళు చెమ్మగిల్లాయి. ఆనందంతో గుండె వేగంగా కొట్టుకుంది. మనుషుల్లో చాలా అరుదుగా కన్పించే మానవత్వం ఆయనలో చూసి మనసులోనే ఆయన రూపానికి చేతులెత్తి నమస్కరించాడు రాజు.

ఆ తర్వాత అక్కడి నుండి బైటకి నడిచాడు.

రాజు ఇంటికివెళ్ళి కాస్త టిఫిన్తిని, కాఫీ తాగి, ఆఫీసునుంచి ఎప్పుడు వస్తుందా అని అక్కకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఏడు దాటినా ఇంకా మాలతి రాకపోయేసరికి తల్లికి చెప్పి బయల్దేరాడు. ఏడున్నరకి ఓ పావుగంట ముందే కాళిదాసుగారింటికి వెళ్ళాడు.

కాళిదాసుగారు రమ్మని చెప్పారని వెళ్ళటమే కాకుండా, ఆ రోజుకి మమతని చూడబోతున్నందుకు కూడా అతనికి ఆనందంగా వుంది. అప్పటికి ఆమెను కలుసుకుని వారంరోజులైంది. ఆమెకు పరీక్షలు జరుగుతున్నాయని అతనే మమతని కలవలేదు. ఫైనలియర్ పరీక్షలుకాబట్టి కాస్త శ్రద్ధగారాస్తే....ఆ తర్వాత హాయిగా కాలక్షేపం చేయొచ్చని చెప్పాడతను ఆమె ఫోన్చేసినప్పుడు.

అందుకే అతన్ని చూడకుండా, మాట్లాడకుండా గడిపేసింది వారంరోజులూ.

రాజు వెళ్ళేసరికి హాల్లో మమత ఒక్కతే కూర్చుని మాగజైన్స్ తిరగేస్తూ కన్పించింది.

గుమ్మంలో నిలబడి ఒక్కసారి హాలంతా పరికించి చూశాడు రాజు. ఆ ఒక్క హాలునిబట్టి.... ఆ ఇల్లెంత విశాలమైందో ఊహించుకుంటే అతనికి మతిపోయినట్టయింది ఒక్క క్షణం.

అతను ఆలోచనల్లోంచి తేరుకోకముందే మమత రాజుని చూసింది.

"హాయ్ రాజూ! నువ్వు.... ఇక్కడ?!" అంటూ వేగంగా పరుగెత్తుకొచ్చింది మమత.

వెంటనే తేరుకుని, "ఏం రాకూడదా?" అన్నాడు.

"నో, రాజు" అని నొచ్చుకుంటూ "వెల్కమ్" అంటూ అతని చేయిపట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది.

అతన్ని కూర్చోమని చెప్పి లోపలికి వెళ్ళి మంచినీళ్ళుతెచ్చి ఇచ్చింది.

గ్లాసు అందుకుంటూ, "ఇదేమిటి... మీ ఇంటికొచ్చినవాళ్ళకి మంచితీర్థం తప్ప మరే తీర్థం ఇవ్వరా?" అన్నాడు.

మమత నవ్వి, "చెమటలు కక్కుకుంటూ వచ్చావని ముందునీళ్ళు ఇచ్చాను. నీకే తీర్థంకావాలో చెప్పు... తెస్తాను" అంది.

"ఇప్పుడేం వద్దులే! కాళిదాసుగారు... అంటే మీ నాన్నగారు సెవెన్థర్టీకి రమ్మని ఆర్డర్వేశారు... అదీ విషయం" అన్నాడు గ్లాసు టీపాయ్మీదపెడుతూ.

"మనం కలుసుకుని ఎన్నిరోజులైందో గుర్తుందా?" అంది చిరుకోపంగా.

"వారంపైన. కాని కొన్ని యుగాలుగా అనిపిస్తోంది కదూ" అన్నాడు ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"నిజం రాజూ! నిన్ను చూడాలనే కోరిక అతి బలవంతంగా కంట్రోల్ చేసుకోవలసి వచ్చింది" అంది అతని చేతిని మెత్తగా తాకుతూ.

"యాంత్రికంగా గడుపుతున్న ఈ జీవితాన్ని... సాధ్యమైనంత త్వరగా నీ రాకతో జీవం నింపుకుందామని ఆశతో ఎదురుచూస్తున్నాను. మరోపక్క మీ నాన్నగారు నాపట్ల చూపించే దయ, ప్రోత్సాహం ఇవన్నీ చూస్తుంటే...నిన్ను కాదని ఆ యాంత్రిక జీవితమే జీవితంగా చేసుకోవాలనిపిస్తోంది. ఏంచేయమంటావు మమతా?" అన్నాడు ఉదాసీనంగా.

అతని మానసిక సంఘర్షణ, వేదన ఆమెకు అర్థమైనా ఎప్పటికప్పుడు అతనా ఫీలింగ్‌తో మరింత కృంగిపోకుండా అతన్ని సమాధానపరుస్తూనేవుంది. కానీ అతన్ని వదులుకోడానికి మాత్రం సిద్ధంగాలేదు. వారిమధ్య స్నేహం, అనుబంధం అంత బలపడ్డాయి.



మమత అతనికేం సమాధానం చెప్పకుండా మౌనంగా చూసింది అతన్ని.

"ఏమిటి మమతా చూస్తున్నావ్?" అన్నాడు.

"మన పెళ్ళి గురించి నువ్వింత దిగులు పడ్డం నాకు బాధగావుంది. ప్రేమించుకున్నాం... పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాం. తీసుకున్న నిర్ణయం గట్టిదే అయితే ఇంక నిముషానికో రకంగా ఆలోచించి బాధపడటం నాకిష్టం వుండదు. పద... మా ఇల్లు చూద్దువుగాని" అంటూ లేచింది.

ఆమె నిబ్బరానికి అతను ఆశ్చర్యపోయాడు. ఏం మాట్లాడాలో అర్థంకాక లేచి ఆమెతో నడిచాడు.

ఇంతలో ఫోన్ మోగింది. మమత అందుకుని రెండునిముషాలు మాట్లాడి పెట్టేసింది.

"డాడీ ఫోన్‌చేశారు రాజూ! డైరెక్టర్ మధుసూదనరావుగారి అపాయింట్‌మెంట్ కాన్సిలయిందట. ఆయన అనుకోకుండా మద్రాసువెళ్లారట. మరోసారి ఆయన్ని కలుస్తానని చెప్పారు డాడీ. రాజువస్తే చెప్పు అంటూ ఫోన్ చేశారు. అదీ విషయం. ఏదీ... నీ జాబ్‌గురించా డాడీ మాట్లాడేది?" అని అడిగింది.

అవునని తలూపాడు.

"ఈసారి ఆ జాబ్ నీకు తప్పకుండా వస్తుంది. దాని గురించి అదేపనిగా ఆలోచిస్తూ కూర్చోకు" అంటూ లోపలికి నడిచింది.

"ఇంట్లో ఎవరూ కన్పించరే! మీ అమ్మగారూ..." అంటూ ఆగిపోయాడు.

"మమ్మీ వూరెళ్ళింది. రేపు రావచ్చు. వంటమనిషి లోపలెక్కడో వుంది. మా అక్క ఉంటే ఇల్లంతా సందడిగా, కళగావుంటుంది. ఆమె పెళ్లయి వెళ్ళిపోయాక ఇల్లంతా ఎప్పుడూ నిశ్శబ్దంగా వుంటోంది" అంటూ ఒక్కోగది చూపిస్తూ, తన గదిలోకి దారితీసింది.

నేలమీద కార్పెట్, ఓ పక్క టేబుల్, దాని ఎదురుగా రెండు కుర్చీలు, మరోవైపు బెడ్, ఆపక్కనే పెద్ద బుక్‌షెల్ఫ్, దాన్నిండా పుస్తకాలు పొందిగ్గా సర్దివున్నాయి.

"కూర్చో రాజూ! పదినిముషాలాగి వెళ్లవచ్చు. డాడీ ఇప్పుడే రారులే.... కంగారుపడకు. ఏమైనా స్నాక్స్ తెస్తాను... ఒక్కనిముషం" అంటూ ఆమె లోపలికి వెళ్ళింది.

రాజు లేచివెళ్ళి కిటికీలోంచి బైటకి చూస్తూ నిలబడ్డాడు. ఉన్నట్టుండి అతని మస్తిష్కంలో ఎన్నో ఆలోచనలు రేగటంమొదలుపెట్టాయి. ఒకదానికొకటి పొంతనలేకుండా చెలరేగుతున్నాయి.

కిటికీ గుండా నన్నటిగాలితెమ్మెర గదిలోకి ప్రవేశించినా అది అతనికెలాంటి హాయిని కలిగించలేకపోయింది. అలాగే నిలబడి చూస్తున్నాడు శూన్యంలోకి.

కిటికీ చువ్వలుపట్టుకున్న అతని వేళ్ళు వాటి చుట్టూ మరింత బిగుసుకున్నాయి.

స్వీట్స్, బిస్కట్స్ తీసుకుని లోపలికి ప్రవేశించిన మమత అతన్ని చూసి, ప్లేట్లు టేబుల్ మీద పెట్టి వెళ్ళి అతని భుజంమీదచేయివేసి పిలిచింది అభిమానంగా.

ఆమె కభిముఖంగా తిరిగాడు రాజు. ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని ఆమె చెంప మీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆ చర్యకు మమత అతన్నేమీ అనలేకపోయింది.

రెండునిముషాలు గడిచాక, "రా, రాజూ... స్వీట్స్ తీసుకో!" అంది.

ఆమెను వదల్లేదతను. మరింత గట్టిగా ఆమె భుజాలువట్టుకుని తన కౌగిట్లోకి తీసుకున్నాడు. ఆమెమీద కోరికతో అతని కళ్ళు ఎరుపెక్కుతున్నాయి.

"మమతా! నిన్ను వదులుకోలేను. నువ్వు లేకపోతే నేను బతకలేను.... పిచ్చివాణ్ణయిపోతాను. నన్నాదుస్థితికి తేకు" అంటూ ఆమెను తనలో బంధించేశాడు.

మమతకి అతని ధోరణిలో ఏదో మార్పురావటం గమనించింది. అతన్ని విడిపించుకోవాలని ప్రయత్నిస్తూ...

"రాజూ! ప్లీజ్... లీవ్‌మీ. చూడు... తలుపులుతీసే వున్నాయి. ఎవరైనా చూస్తే బావుండదు" అంటూ గింజుకుంది.

ఒక్కనిమిషం అతను ఆమె కళ్లలోకి గుచ్చి చూసి... ఒక స్థిరమైన నిర్ణయానికి వచ్చినవా

డిలా, 'నో' అంటూ వేగంగా ఆమెను రెండుచేతులతో ఎత్తి మంచంమీద పడేసి వెళ్ళి తలుపులు వేసి వచ్చాడు.

అతనిలో ఏదో మైకం కమ్మింది. విచక్షణా జ్ఞానం కోల్పోయినట్టు ఆమె నోరు గట్టిగా మూసి, ఆమెను ఆక్రమించాడు.

అతని వంట్లో రక్తం ఆవేశంతో పొంగుతోంది.

ఆమె గింజుకుంటోంది. ప్రాధేయపడుతోంది. కాళ్లతో తన్నింది. రక్కింది... అతని శారీరకబలం ముందు ఆమె ఓడిపోయింది.

అతని కోరిక నెరవేరింది. తీవ్రత తగ్గింది.

మరో పది నిమిషాలు గడిచాయి. తనున్న ప్రపంచాన్ని కళ్ళు తెరిచి చూశాడు. ఒక్క ఉదుటున లేచి నిలబడి మమతవంక చూశాడు.

మమత స్పృహకోల్పోయినట్లు పడివుంది.

ఆ స్థితిలో ఆమెను చూడగానే అతనిలో ఆందోళన మొదలైంది. భయంతో నరాలు బిగుసుకుపోయాయి.

వెంటనే ముందుకు వంగి 'మమతా, మమతా' అంటూ పిలిచాడు ఆమెను కుదుపుతూ.

ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్లుంది ఆమె గొంతు.

'ఇడియట్, బిచ్...' ఆపెదవుల కదలిక అర్థంకావటానికి కొద్దిసేపు పట్టింది అతనికి.

అర్థమయ్యాక ఒక్క అడుగు వెనక్కి వేశాడు భయంతో. దుఃఖం తన్నుకొచ్చింది గుండెల్లోంచి. రెండు చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

ఆ క్షణంలో ఏంచేయాలో అతనికి అర్థంకావటంలేదు. చేసిన తప్పిదానికి మనసు కృంగిపోతోంది. సరిదిద్దుకోలేని తప్పుకి నిస్సహాయతతో ధారాపాతంగా కారుతున్న వెచ్చని కన్నీళ్ళు.

ఒక్కక్షణం, ఒక్కక్షణం ఆమె తనపై చూపించిన ప్రేమ, అనురాగం వీటిగురించి ఆలోచించి వుంటే తనింత దిగజారిపోయి వుండేవాడుకాదు.

మంచంమీద పడివున్న మమత 'దాహం' అంటుంటే లేచి టేబుల్‌మీద గ్లాసు చేత్తో పట్టుకున్నాడు.

ఇంతలో తలుపు కొడుతున్న శబ్దం అయ్యింది.

అతని చేతిలో గ్లాసు కిందపడి ముక్కలైంది.

అతని కాళ్లల్లో వణుకు... గుండెల్లో భయం.

వచ్చింది కాళిదాసుగారైతే తనేం సమాధానం చెప్తాడు. తనని బతకనిస్తారా ఆయన. కాల్చిపారేస్తారు. ఇప్పుడేం చేయాలి? ఏం చెప్పాలి? అతనికి మతిపోతోంది. ఒంట్లో శక్తి పూర్తిగా నశిస్తున్నట్లు కృంగిపోతున్నాడతను.

అదురుతున్న గుండెల్తో చుట్టూ చూశాడు పారిపోవాలనే ఆలోచనతో. ముఖంమీద పడుతున్న జుట్టుని వేళ్లతో వెనక్కి తోసుకుంటూ చూశాడు మరోసారి మార్గంకోసం. ఎటు వెళ్లడానికి అవకాశంకానీ, మార్గంకానీ కనిపించలేదు.

కానీ... అంతలోనే అతని మనసు పారిపోవాలనే ఆలోచనని అసహ్యించుకున్నట్టుగా మరింత కృంగిపోయాడు. తను చేసిన తప్పుకి శిక్ష అనుభవించాలి.

తనని ఆదరించి, ఆశ్రయమిచ్చిన, మనిషికి చేసిన ద్రోహానికి ఆయన చేతులతోనే శిక్షించబడాలి అనుకుంటూ వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా కాళిదాసుగారు.

రాజుని చూడగానే... అదీ తన కూతురి గదిలో... పిచ్చివాడిలా నిలబడ్డ రాజుని చూసి వేగంగా లోపలికి నడిచారు.

బెడ్‌మీద స్పృహ లేనట్టు పడివున్న కూతుర్ని ఇటు రాజుని చూడగానే... జరిగిందేమిటో ఆయనకు పూర్తిగా అర్థమైపోయింది.

కాళిదాసుగారు ఉగ్రనరసింహులే అయారు. ఆయన చేతుల్లో అతని చెంపలు రక్తం చిమ్మాయి.

అంతటితో ఆయన కోపం చల్లారలేదు. మరో పావుగంటకి రాజు స్థానం లాకప్‌లో మారింది.

★ ★ ★

ఆ రాత్రంతా తమ్ముడి కోసం ఎదురుచూసి మరునటిరోజు పొద్దుటే కాళిదాసుగారింటి

వెళ్ళింది మాలతి. తమ్ముడు రాత్రి రాకపోవటానికి కారణం కాళిదాసుగారు ఏ వూరైనా పంపించారేమోనని అనుకుంటూ, ఆయన్ని అడిగి తెలుసుకోవడం మంచిదని వెళ్ళిందామె.

ఆమెని చూసి జరిగింది చెప్పారాయన.

గదిలో బెడ్‌మీద కుమిలికుమిలి ఏడుస్తున్న మమతని చూపించారు.

"వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళి కూడా చేసుకోవాలని..." ఆమెను పూర్తిగా చెప్పనివ్వకుండానే ఆయన అన్నారు.

"మమత నాకు చెప్పింది. ఆ విషయం చెప్తే నేనే ఆలోచించేవాడిని కదా! ప్లాన్‌గా నా కూతుర్ని రేప్‌చేస్తే తప్ప అతనికిచ్చి పెళ్ళిచేయననుకున్నాడు కాబోలు. మమత ఇష్టపడితే అతన్ని తీసుకువచ్చేయాలని నిర్ణయించుకున్నాను. కానీ, ఆమె రాజుని స్వీకరించే స్థితిలో లేదు. అందుకే... అందుకే ప్రీతి ఏజన్సీలో యాభైవేలు దొంగతనం చేసిన నేరం కింద అతన్ని అరెస్టుచేయించాను..." అన్నారాయన.

మాలతి మూగదైపోయింది. నిస్సహాయత, తమ్ముడి మీద అంతులేని కోపం, అసహ్యం కలిగాయి.

మమతని క్షమించమని కోరడానికిగానీ, ముఖమెత్తి కాళిదాసుగారి ముఖంలోకి చూట్టానికిగానీ మనసు రాలేదు. సిగ్గుతో తల వాల్చేసింది. దుఃఖంతో వెనక్కి తిరిగి వచ్చేసింది.

మాలతి తల్లి బాధకి, దుఃఖానికి అంతే లేదు. మాలతి దాదాపు మతిస్తిమితం కోల్పోయినదానిలా అయిపోయింది. ఆఫీసుకి సెలవుపెట్టి ఇంట్లోనే వుండిపోయింది.

రెండురోజుల తర్వాత సింధు వస్తే.... జరిగింది చెప్పింది.

సింధునోట మాటరానిదానిలా కూర్చుండిపోయింది. అతన్ని చూడాలనీ, మాట్లాడాలనీ అన్పించింది. మాలతిని అడిగితే ఆమె రానంది.

అందుకే సింధు ఒక్కతే వెళ్ళిందా రోజు.

పిచ్చివాడిలా వున్న రాజుని చూసి బాధపడింది. పసితనంపీడని ముఖం, చురుకైన కళ్ళు చూసినప్పుడల్లా ఎంత మురిసిపోయేది తను. ఇప్పుడా కళ్ళలో కన్పిస్తున్న దైన్యం, ముఖంలో వేదన చూస్తుంటే... ప్లాన్స్ వేసి దుర్మార్గాలు చేసే క్రూరత్వం వుందా అతనిలో అనుకుంది.

సింధుని చూడగానే అతని ప్రాణం లేచివచ్చినట్లయింది. చేసిన తప్పుకి మనసు అగ్నిలా రగిలిపోతుంటే... తన మీద అసహ్యంతో అక్క రాలేదని తెలిసి మరింత కుమిలిపోతున్నాడతను.

ఆ పరిస్థితిలో సింధుని చూడగానే కట్టలు తెంచుకుని ప్రవహించింది దుఃఖం. చిన్నపిల్లాడిలా వెక్కివెక్కి ఏడ్చాడు. తలుపు రాడ్స్‌కేసి తలబాదుకుంటూ ఏడ్చాడు.

సింధు అతన్ని వారించింది. ఓదార్చింది.

కాసేపటికి అతను తేరుకున్నాడు.

"చెప్పు రాజూ! నిన్ను నమ్మి జీవితాంతం నీ భార్యగా వుండటానికి సిద్ధపడ్డ ఆ పిల్ల మీద ఎందుకిలాంటి అత్యాచారం చేసినట్టు?" అంది.

నాకే తెలియదు. ఆ క్షణంలో ఎన్నో ఊహలు. మమత నన్ను ప్రేమిస్తున్నా... మా పెళ్ళి జరగదనే మొదటినుంచీ నా నమ్మకం. ఓ పేదవాడికి సాయంచేయాలన్న విశాలత్వం తప్ప, తన కూతుర్ని కూడా ఇచ్చి చేసేంత గొప్పమనసు కాళిదాసుగారికుందనీ... వుంటుందనీ నా కన్పించటంలేదు.

నేను ప్రేమించిన స్త్రీని మరొకరు తాకితే కలిగే అసూయ, మరొకరి స్వంతమైతే అనే ఊహ కలిగినప్పుడు కలిగే ద్వేషం తలుచుకున్నప్పుడల్లా నాలో ఒకవిధమైన కోపం, పగ బయల్దేరాయి.

"వీటన్నింటికి మించి మరో కారణం వుంది..." అని ఆపాడు.

ఎందుకో అతని ముఖం మరింత కుంచించుకుపోవటం గమనించింది సింధు.

"చెప్పు రాజూ" అంది.

"పెళ్లికాకుండా ప్రేమించిన ప్రియురాలితో శారీరకానుభవం ఎలా వుంటుందో అనుభవించితే తప్ప ఆ థ్రిల్ రాయగలిగేది కాదన్న అవినాష్ సాహిత్యం నా ఆలోచనల్ని నమిలి




మింగేశాయి. అప్పటినుండి నా మనసులో అవే ఆలోచనలు... నాలో లేని ధైర్యం అతని పుస్తకం చదివితే బలం పుంజుకునేది. నాలో లేని ఆవేశం, అతని ప్లాన్స్ చదువుతుంటే నాలో కొత్త కోరికలు బుసలు కొట్టేవి. ఆ ఆవేశంతోనే, ఆ ధైర్యంతోనే నేనీపని చేశాను.

కానీ ఊహలకీ, వాస్తవానికీ చాలా భేదంవుందనీ, అతని రచనల ప్రేరణతో నేచేసిన పనికి పెద్ద సుడిగుండంలో పడిపోయానని ఇప్పుడే అర్థమవుతోంది. ఒక రచయిత రాసిన రాతల్ని చాలా తేలిగ్గా అమలు చెయ్యొచ్చనే నా ఆలోచన నన్నీ నికృష్టస్థితికి తెస్తుందని ఊహించలేకపోయాను.

అక్కా! నాకు బతకాలనివుంది. జీవితంలో ఎన్నో సాధించాలని వుంది. ఈ నాలుగ్గోడల మధ్య కూర్చుని ఆలోచిస్తుంటే... ఇలా మరో నాలుగురోజులుంటే పిచ్చెక్కిపోతుందేమోనని భయంగా వుంది.

'నన్ను రక్షించండి. అక్కని, అమ్మని క్షమించమని చెప్పండి. నా ఆలోచనలు, నా తత్వం మీ అందరికీ తెలుసు. మమత పాదాల నంటి క్షమించమని వేడుకుంటాను. మమత నన్ను క్షమిస్తుంది. ప్లీజ్... ముందు నన్ను రక్షించండి'' అంటూ మళ్లీ దుఃఖించడం మొదలుపెట్టాడు.

సింధు కళ్లు వెడల్పు చేసుకుని చూస్తోంది అతన్ని.

అతన్ని చూస్తోంది... అతనిలోని అమాయకత్వాన్ని చూస్తోంది.

ఇప్పుడతనిమీద కోపంలేదు. అసహ్యంలేదు. జాలి వేసింది విపరీతంగా.

వాటినుండి తేరుకోడానికి చాలాసేపు పట్టింది.

ఇరవైయేళ్ల యువకుడు ఓ బాధ్యతలేని రచయిత ఉబుసుపోక రాసిన రాతల్లోని పెర్వర్టెడ్‌నెస్‌ని, పెసిమిజాన్ని తన జీవితానికి కూడా అన్వయించుకోవాలనే కోరిక కలిగిందీ అంటే ఆ తప్పు ఎవరిది?

అతని మానసికస్థితి అలా ప్రేరేపింపబడిందీ అంటే అందుకు ఆధారభూతమైన సాహిత్యమే అతన్నలా దిగజార్చేసింది. న్యాయస్థానానికి కావలసింది నేరం చేశాడా లేదా అనే కాని, అందుకు దారితీసిన పరిస్థితులు, ఆలోచనలు కాదు.

తన పరువుప్రతిష్టలకి భంగం కలగకూడదనీ, కూతురు భవిష్యత్తు దెబ్బతినకూడదని కాళిదాసుగారు అతన్ని దొంగతనం నేరం కింద అరెస్టు చేయించారు. పరపతివున్న మనిషాయన. సాధించలేనిదేముంటుంది?

రాజుకి ఓదార్పుగా నాలుగు మాటలు చెప్పి భారంగా తిరిగి వచ్చేసింది సింధు.




ఈ సంఘటన సింధుని విపరీతంగా కదిలించేసింది.

సింధు చెబుతుంటే మురళి నోరెళ్లబెట్టుకుని వింటున్నాడు. అతనికింకా నమ్మశక్యం కావటంలేదు. ప్రేమ అనగానే చెట్లు పుట్టలు వెతుక్కునే ఈకాలపు పిల్లలకు భిన్నమైన వ్యక్తిత్వం అన్నమాట మమతది అనుకున్నాడు మెచ్చుకోలుగా.

''తోచక చదివి అవతల పారేసే రాతల్ని ఆచరణలో పెట్టాలని అనుకోడం చూస్తే ఈ పరిణామం ఎటు దారితీస్తుందోనని భయంగా వుంది'' అన్నాడు.

''మనకు తెలిసి రాజు ఒక్కడే! తెలీక ఈ చెత్తనవలల ప్రేరణతో దారితప్పి గిజగిజలాడే పిల్లలు ఎంతమందో? ఈరోజున విడుదలయ్యే సినిమాలు, సాహిత్యం ముఖ్యంగా టీనేజర్స్‌పాలిట సంఘవిద్రోహ శక్తులుగా మారాయని పిస్తోంది. వీటి ప్రభావంతో పిల్లలు రౌడీలుగా, మత్తుపదార్థాలకి బానిసలుగా, ఊహించని అనేక రూపాలుగా తయారై... ఆ తర్వాత దిక్కుతోచక అల్లాడిపోతున్నారు.

ఏమిటీ మార్పు? తల్లిదండ్రుల పెంప కంతోపాటు పెరుగుతున్న పరిసరాలు కూడా సక్రమంగా వుండాలి. లేకపోతే పువ్వుల్లాంటి పిల్లల మనసులు విషం కక్కుతాయి" అంది సింధు బాధగా.

"పరిసరాలు సక్రమంగా వుండాలీ అంటే... ఎవరు చూస్తారు? ఎవరి స్వార్థం వాళ్లు చూసు కునే ఈరోజుల్లో పరిసరాల గురించి పట్టించు కునే తీరిక, బాధ్యత ఎవరికుంది? ఎవరికివారు అప్పటికి ఆవేశపడి, బాధపడి ఆపైన మౌనంగా వూరుకోడమే! మార్పురాదు" అన్నాడు.

"లేదండీ. మార్పు రావాలి... వస్తుంది. సమాజమంటే ఎవరూ... మనమేకదా! ఆ బాధ్యత కూడా మనదే. ఇలాంటి సంఘటన మరొకటి జరగకుండా ఏదైనా చేయాలి... ఏదైనా చేయాలి" తనలో తను అనుకుంటున్నట్టుగా వరధాన్యంగా గొణిగింది సింధు.

ఆ మరునటిరోజు మాలతితో అంది సింధు.

"రాజు బైటపడాలంటే మమతని బతిమాలడమే మార్గం. వెళ్లి ఆమెకు రాజు పరిస్థితి వివరిస్తే... అంత డీప్‌లవ్‌కదా, ఏమూలో కరుణ కలగదా!" అంది.

మాలతి నవ్వింది చేదుగా.

"నా ముఖం ఇంక వాళ్లకి చూపించలేను సింధూ! వెళ్లి అడిగినా ప్రయోజనం వుండదు. ఏ తల్లిదండ్రులు సహిస్తారిలాంటి చర్యల్ని. నా తమ్ముడు తెలీక చేశాడనో, ఇంకేదో ఇంకేదో అంటూ నచ్చజెప్పడానికి కూడా సిగ్గుగా వుంది నాకు. ఏడవనీ, చావనీ ఏమైనా అయిపోనీ... నేనేమీ చేయలేను సింధూ! ఏమి చేయలేను" కుమిలి కుమిలి ఏడుస్తూ అంది మాలతి.

సింధు హృదయం ద్రవించిపోయింది. 'వాడు నా తమ్ముడే కాదు. నా ప్రాణంకంటే ఎక్కువ. వాడి పాలుగారే ముఖం, నాపట్ల వాడు చూపే ఆప్యాయత చూస్తోంటే, పెళ్లిచేసుకుని వాళ్లకు దూరమై ఆ ఆప్యాయతలు పోగొట్టుకుని బతకలేనేమోననిపిస్తుంది' అని అన్న మాలతీయేనా ఇప్పుడతన్ని ఏడవనీ, చావనీ అంటున్నది? అని ఆశ్చర్యం, బాధ కలిగాయి.

ఆమె తలని ఒళ్లో పెట్టుకుని, చాలాసేపు సాంత్వన వచనాలు పలుకుతూ ఆమెను మామూలు మనిషిని చేయడానికి ప్రయత్నించింది సింధు.

"మాలతీ! నేనే మమతని కలుస్తాను. ఆడదాని మనసు వెన్నలాంటిదంటారుకదా. చూద్దాం... ఏమైనా కరుగుతుందేమో" అంది సింధు.

మాలతి మాట్లాడలేదు. ఆ తర్వాత రెండు రోజులకి సింధు మమత ఇంటికి ఫోన్‌చేసి, కాళిదాసుగారు లేరని సమాధానం వచ్చాక అప్పుడు బయల్దేరి వెళ్లింది.

మమత తల్లి సింధుని చూసి 'ఎవరికోసం' అని అడిగింది. కూతురి గురించిన బాధ ఆమెలో ఎలాంటి కల్లోలం రేపుతోందోకానీ పరాయివ్యక్తి దగ్గర బయటపడకూడదన్నట్లు మామూలుగా వుందామె.

"నేను మమత ఫ్రెండుని. ఆమెకు సీనియర్‌ని. నన్ను రమ్మని ఫోన్ చేస్తేనూ..." అంది.

మమత వున్న గది చూపించిందామె.

సింధు లోపలికి వెళ్లేసరికి మమత మంచంమీద పడుకుని, ఏదో పుస్తకం తిరగేస్తూ కన్పించింది. తలుపు తెరచిన శబ్దానికి పుస్తకం జరిపి చూసింది.

అపరిచితవ్యక్తి కావటంవల్ల మంచంమీంచి లేచి, "మీరూ..." అంటూ అర్థోక్తితో ఆగిపోయింది.

తలుపు దగ్గరికి వేసి, "నా పేరు సింధు. ముందు నువ్వు కూర్చో మమతా!" అంది.

"మీరూ కూర్చోండి. నా కోసమే వచ్చారా?" అంటూ కుర్చీ చూపించింది.

మమతకెదురుగా కూర్చుంది సింధు.

"అవును... నీకోసమే వచ్చాను. రాజు అక్కయ్య మాలతి, నేను కొలీగ్స్ ! అంతకుమించి రాజు మాలతికెంత అపురూపమో నాకూ అంతే!" అంది.

రాజు పేరు వినటంతో మమత ముఖం ముడుచుకుపోయింది. ముఖం ఎర్రగా కందిపోయింది.

రెండునిమిషాలు మౌనం.

మమత కళ్లల్లో నీళ్లు చూసి సింధు ఆమెపక్కన కూర్చుని ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొని, "మమతా... రాజు చేసింది తప్పే! కానీ అతను చేయాలని చేయలేదు. అతని బుద్ధి, మానరిజం అన్నీ తెలిసిన నువ్వు ప్లాన్డ్‌గా చేసి వుంటాడని ఎలా అనుకున్నావు? శారీరక బలహీనత... అంతే! కొద్దిరోజుల్లో తన స్వంతంకాబోతున్న మనిషికదా అనే చొరవ అతన్నిలా దిగజార్చింది. క్షమాగుణంతో కాస్త ఆలోచించు.

జైలుగోడలమధ్య పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న అతని ముఖం చూడు ఒక్కసారి.... ఎలాతిగుండెకైనా చలనం వస్తుంది. వాతావరణ ప్రభావం మనిషి బుద్ధిని వికసింపచేయవచ్చు... దిగజార్చనూవచ్చు. అదీగాక అతను చదివే సాహిత్యంప్రభావం కూడా కొంత కారణం. పెళ్లికాకుండా ప్రేమించిన యువతిని తాకితే తప్పులేదు ముద్దుచేస్తే తప్పులేదు అనే అభిప్రాయాన్ని ఆ సాహిత్యం ఏర్పరచటంతో తన చర్యను నువ్వింత సీరియస్‌గా తీసుకుంటావని అతను అనుకోలేదు"

ఆపైన సింధుని మాట్లాడనివ్వలేదు మమత.

ఒక్క ఉదుటున మంచంమీంచి లేచింది.

"మాటలతో నన్ను మభ్యపెట్టాలని చూడకండి. నన్ను నన్నుగా ప్రేమించని మనిషి, నాఇష్టం లేకుండా నాశరీరంమీద అధికారం చలాయించే మనిషి... అది దేని ప్రభావమైనా కానీ నేను సహించలేను. అతను నాకక్కరలేదు...

పుస్తకాలు చదివి ఈరోజు ఇంత దారుణం చేసిన మనిషి, రేపు మరో థ్రిల్లింగ్ కోసం నన్ను చంపడానికి కూడా వెనుకాడడు. మీరీ విషయం చెప్పాక మరింత భయంగా వుంది...

పెళ్లికాకుండానే హద్దులు దాటటంలాంటి చర్యల్ని నేనంగీకరించను. పాపం, పుణ్యం, సంఘం- ఇవి హద్దులుకాదు మన ప్రవర్తనకి. సంస్కారం. దాన్నిబట్టి జీవిత విధానం ఏర్పరచుకోవాలనేది నా సిద్ధాంతం. రాజు నా ఆలోచనలకి భిన్నమైన మనిషని ఊహించలేకపోయాను. రాంగ్‌ఛాయిస్‌గా ఎన్నుకుని మోసపోయాను.

ఒక్కపరీక్ష రాయని కారణంగా విలువైన ఓ సంవత్సరకాలం ఎలా వేస్ట్ అయిపోయిందో చూడండి. నేనతన్ని ఎంత ఉన్నతంగా ఊహించాను. నా మనసులో అతనికి మహోన్నతమైన పీఠంవేసినందుకు నన్ను అథఃపాతాళానికి తోసివేశాడే"

ఆమె కంఠం గాద్గదికమైంది.

"మమతా! క్షమించమని కోరే అర్హత కూడా మాకెవరికీ లేదు కానీ, అతను దుర్మార్గుడుకాడు. నాకు తెలుసు రాజు తత్వమేమిటో! చూడు... వాళ్లమ్మ, అక్క దిగులుతో కృశించిపోతున్నారు. నువ్వు చెప్తే మీ డాడీ కాదనరు. రాజుని బైటికి తేవటం కష్టంకాదు. ప్లీజ్... రిలీజ్ హిమ్ మమతా!" అంది.

ఆ మాటకి మమత మరింత ఆవేశపడింది.

"నో... అతను అక్కడే వుండాలి. చేసిన తప్పుకి కుమిలి కుమిలి ఏడవాలి. తప్పుచేసినప్పుడు మనిషి శిక్ష అనుభవించితీరాలి... అది నా పాలసీ" అంది కఠినంగా.

సింధు ఏం మాట్లాడలేకపోయింది.

"మమతా! నీ నిర్ణయం మారదా! నీకు చేతులెత్తి దణ్ణంపెడతాను. కాస్త కనికరంతో ఆలోచించు" అంది.

మమత మౌనంగావుంది రెండునిమిషాలు. ఆపైన అంది- "నా మనసులో సెగలు పొగలు చల్లారలేదు. అవి చల్లారినప్పుడు... అతను మీ ఇంటికి వస్తాడు. అంతవరకూ నన్నేమీ కోరకండి" అంది నిబ్బరంగా.

తిరుగులేని ఆమె సమాధానం విని సింధు గాఢంగా నిట్టూర్చింది. ఆ పిల్ల వ్యక్తిత్వానికి ఆనందించాలో, రాజు స్థితికి బాధపడాలో అర్థంకాలేదామెకు.

రెండుక్షణాలు అలాగే నిలబడిపోయింది. మమతచేయి స్నేహపూర్వకంగా నొక్కి అక్కణ్ణించి తిరిగి వచ్చేసింది.

మమత గుండె భారంతో మునిగింది. మంచంమీద పడిపోయి దిండులో ముఖం దాచుకుంది.

★ ★ ★





"మాలతీ! రాజుకి జైలుశిక్ష ఎంతకాలం పడుతుందనేది బాధకాదు మమతలో అతనిపట్ల దయ, జాలి కలగటానికి ఎంతకాలం పడుతుందోనని ఆలోచించాలి. మమత వ్యక్తిత్వమున్న పిల్ల. అయినా ఎందుకో రాజు త్వరలోనే బైటికి వస్తాడని నానమ్మకం. చూద్దాం... ఏం చేయగలిగినా ఆ పిల్లే చేయాలి" అంది సింధు మమత దగ్గర్నుండి వచ్చాక.

మాలతి మూగదైపోయింది. ఎప్పటికోగానీ తేరుకోలేదు.

ఆతర్వాత అంది- "కానివ్వు సింధూ! ఏంచేస్తాం. తప్పు మనదే అయినప్పుడు... ఏంమాట్లాడ్డానికీ అర్హతలేదు. అంతే!" అంది బాధగా.

సింధు ఆమెని సమాధానపరుస్తూ... "రాజుని తలచుకుని బాధపడుతూ ఇంట్లోనే కూర్చోకు. ఆఫీసుకి వచ్చేయి. కాస్త మనశ్శాంతిగా వుంటుంది. ఏం?" అంది.

Pinisetty

"అలాగే సింధూ!" అని తలూపింది.

ఆ మరుసటిరోజు నుంచే మాలతి ఆఫీసుకి వెళ్తోందీ, వస్తోందేకానీ ఇదివరకటి ఉత్సాహం లేదామెలో! కొలీగ్స్ అడిగినా ఆమేం సమాధాన మివ్వక పోవటం చూసి, వాళ్లే మౌనంగా ఉండి పోయారు.

మరోవారం రోజులకి సింధు నాన్నమ్మ, వల్లి తల్లి శ్రీలక్ష్మి యాత్రలు ముగించుకుని వచ్చారు. రెండురోజులు సెలవుపెట్టి ఇంట్లోనే కూర్చుండిపోయింది సింధు నాన్నమ్మ కబుర్లు వినడానికి. మనుమరాల్ని అలా దగ్గర కూర్చో బెట్టుకుని మాట్లాడితేకానీ ఇన్నిరోజుల బెంగతీరినట్టుగా అన్పించలేదావిడకి.

మురళిని చూసి, తను యాత్రలకి వెళ్లివచ్చేలోపు అతనిలో వచ్చిన మార్పు చూసి సింధుని కోప్పడింది.

"పండులా ఉండేవాడు. ఎలా నల్లగా, పీచులా అయిపోయాడో! నీచేతివంట తినే ఇలా అయిపోయాడు. అసలా ఉద్యోగం మానేసి, ఇంటిపట్టు నుండి కాస్త వంటా వార్పూ నేర్చుకో! నేను పోతే వేళకింత వుడకేసుకుని తినటానికైనా వంటవస్తే నాకు మనశ్శాంతిగా వుంటుంది" అంది కోపంగా.

అప్పుడు చూసింది అతన్ని సింధు పరీక్షగా. నిజంగానే అతను నల్లబడి నన్నబడినట్టుగా కన్పించాడు. వంట సరిగా చేయలేకపోతున్నందుకు తనని తానే తిట్టుకుంది. అయినా బైటపడదల్చుకోలేదీ విషయంలో ఆమె. అందుకే అంది-

"నీదంతా ఉత్త ఛాదస్తం నానమ్మా! మొన్నటివరకూ నేను పెళ్ళిచేసుకోనన్నందుకు మనశ్శాంతి లేదన్నావు. ఇప్పుడేమో, వంటనేర్చుకోకపోతే మనశ్శాంతి ఉండదంటున్నావు. రేపే మంటావేకానీ, నిన్న థియేటర్లో వెయిట్‌చూసుకున్నాం. పెళ్ళికి ముందుకంటే పదికేజీలు పెరిగారాయన. నేనే పదికేజీలు తగ్గిపోయాను. అయినా నేనలా కన్పించటంలేదు నీకు. ఆయనమీదే నీకు ప్రేమఎక్కువ. హుఁ" అంది ఉక్రోషంగా.

ఆవిడేం నమ్మలేదామె మాటల్ని. "పనికి రాని మిషన్లు ఎక్కిచూసుకుంటే అలాగే చూపిస్తాయి. రంగు, రూపు తెలియటంలేదూ!" అని పెద్దగొడవచేసేసిందారోజంతా ఆవిడ.

తనమీద ఆప్యాయతతో ఆవిడ సింధుని మందలిస్తుంటే అతనిమనసు ఆర్ద్రంగా అయింది. తల్లిలేనిలోటు ఆక్షణం నుండీ తీరిపోయినట్టయి కళ్ళుతడితడిగా అయ్యాయి. నిజానికి తను కోరుకున్న అనుబంధం ఇదే!

పూర్వజన్మలో గొప్పపూజచేసి ఉంటాడు. అందుకే దేవుడు ఈ తల్లిని, సింధుని తనకు కానుకగా పంపించాడు అనుకున్నాడు తృప్తిగా మురళి.

ఆరోజునుంచి ఆవిడ చాలా శ్రద్ధగా మురళికి, సింధుకి దగ్గరుండి వడ్డించి తినేవరకూ వూరుకోవటం లేదు. "ఇలా తినివెళ్తే ఆఫీసులో నిద్రవచ్చేస్తుంది. కొలీగ్సంతా డబుల్‌మీనింగ్స్‌తో నన్ను ఏడిపించుకుతింటున్నారు. నువ్వయినా చెప్పుసింధూ, కంట్రోల్‌లేకుండా తినకూడదనీ" అంటూ భార్యదగ్గర గొడవ పెడుతున్నాడు మురళిరోజూ.

"నేనేం చేయలేను. తమరు పుల్లలా అయిపోయారటకదా నావంటతిని. కానివ్వండి... అవిడశక్తిమేరకు పెడుతుంది. మాగ్జిమమ్ మీరెంతలావవగలరో చూడాలని నాకూ కోరికగా వుంది" అంది సింధు క్రీగంట అతన్ని చూస్తూ.

అతను చేతులు రెండూ నెత్తిమీద పెట్టుకొని, "నావల్లకాదు. ఇలా అయితే నాగ్లామరంతా మంటగలిసిపోతుంది" అంటూ బాధపడ్డాడు.

"మహాపోజు. మీరేమైనా యాక్టరా ఏమిటి, లావైతే గ్లామరు పోతుందని బాధపడటానికి. ఏంఫర్వాలేదు. మీరు ఎర్రగా, బొద్దుగా వుంటేనే నాకు ముద్దు" అంది వెక్కిరింపుగా.

ఆమె వెక్కిరింపుకి అతనికి కోపంరాలేదు, సరదాగానే తీసుకుంటాడు. "నీకంతముద్దయితే ఆఫీసు మానేసి కూర్చుని మరీ తిండి తింటాను సింధూ!" అంటూ చెవిలో గుసగుసలాడాడు.

అతని కొంటెతనానికి సిగ్గుతో అతని గుండెల్లో ఒదిగిపోయింది.

అలా కబుర్లలో పడితే ఎంతటైము గడిచిపో




తుందీ వాళ్ళకే తెలీదు. పదకొండుదాటాక లైటాఫ్‌చేసి పక్కమీదకు వాలి కళ్ళుమూసుకున్న సింధుకి ఏదోజ్ఞాపకం వచ్చి లేచి కూర్చుంది.

"ఏమిటి సింధూ" అని అడిగాడు మురళి.

"చిన్నరిక్వెస్టు" అంది.

"ఏమిటది. ఈరోజేదో ఇంగ్లీషు నవలకొన్నట్టున్నావు. ఈరాత్రంతా కూర్చుని చదివేయాలి... అంతేగా?" ఇదేమీ కొత్తకాదన్నట్టు అడిగాడు నిట్టూర్చి.

ఆమె తల అడ్డంగా వూపి- "కాదండీ! మా ఎడిటర్ అవినాశ్ రాసిన నవలొకటి జస్ట్ ఒక్కసారి రివైజ్ చేయమన్నారు. రేపు ప్రెస్‌కి పంపించేయాలట. ఇన్‌స్టాల్‌మెంట్స్ పద్ధతిలో వారపత్రికలకి సీరియల్స్‌రాసే ప్రముఖ రైటర తను. పూర్తి నవల పంపించేసరికి మా ఎడిటర్ ఆనందానికి అంతులేదు. నెక్స్ట్‌వీక్‌నుంచి స్టార్టవ్వాల్సిన నవలిది. అందుకని ఒక్క అర గంట... మీరు నిద్రపొండి నేనొచ్చేస్తాను" అంది లేచి.

"రేపు ఉదయం చూడవచ్చుకదా! రెస్ట్ తీసుకోరాదూ" అన్నాడు.

"ఫర్లేదు.. ఓఅరగంటకోసం ఏముందీ" అని లేచి తన డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళిలైట్ ఆన్‌చేసి టేబుల్‌ముందు కూర్చుంది.

తెలుగు కథాసాహిత్యానికి కొత్తవరవడి సృష్టించిన రచయిత అవినాశ్. జీవితంమీద సమగ్రమైన అవగాహనలేదు, కథావస్తువులు, పాత్రలు వాస్తవంలోంచి కాకుండా, వూహల్లోంచి కూడా సృష్టించవచ్చుని; సమాజాన్ని ప్రతిబింబించాల్సిన అవసరం సాహిత్యానికి ఏమాత్రం లేదనీ... కాసేపు కాలక్షేపానికీ, సరదాకీ చదువుకునే పుస్తకాల్లో జీవితాల చీకటికోణాలు చూపి, మనిషిని మరింత భయపెట్టడం తనలక్ష్యంకాదనీ అతనే అంటాడు.

అనటంకాదు... రాసిచూపిస్తున్నాడు. అభ్యుదయ భావచైతన్యాలూ, మానవత్వపు వెలుగులు, కుటుంబాలను, అనుబంధాలను విచ్ఛిన్నం చేస్తున్న ఆర్థిక అసమానతలు ఇవి ఏవీ వెదికి చూసినా కనబడవు. యజమానుల నిర్లక్ష్యానికి గురై దుర్భరజీవితం గడిపే అమాయక జీవుల ఆక్రందనలు అసలు తనమనసులోకే రానీయడు. అతనిదారిలోనే మిగతా రచయితలూను. ఆ దారిన వెళ్ళనివాళ్ళూ ఉన్నారు గానీ వాళ్ళిప్పుడు ప్రముఖ రచయితల కోవలో లేరు.

కథలనిండా భూతలస్వర్గాలు, సైంటిఫిక్ ఫాంటసీలూ, సస్పెన్సు పాఠకుల్ని మత్తులో ముంచే కాల్పనికకథా వస్తువులతో, పాఠకులు తమ విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి ఒకరకమైన ఉద్రిక్తతకు లోనయ్యేలాంటి సబ్జక్ట్సు ఈనాటివి.

అయితే మాత్రమేం! సమకాలీన రచయితలెవ్వరూ అందుకోలేని స్థానాన్ని అందుకున్నారువారు. పాఠకుల్లో విపరీతమైన క్రేజ్‌ని డెవలప్‌చేసుకున్నారు.

అదో పెద్దవేవ్... సెన్సేషన్.

సాహిత్యంయొక్క అసలు ప్రయోజనానికి మునుగువేసి, పాఠకుల బలహీనతలు కనిపెట్టినట్టు వయొలెంట్ కథల్ని సృష్టించి, నేరాల్ని మనిషిలోని నికృష్టపు ఆలోచనల్ని వ్యక్తిగతమైన బలహీనతల్ని సమర్థిస్తూ సెంటిమెంటల్ మోటివ్స్‌ని కల్పించారువారు.

రచయితలుగా వాళ్ళు పేరు, కీర్తి సాధించారు. పాఠకుల్లో పెచ్చుపెరిగిన క్రేజ్‌ను విపరీతంగా కాష్ చేసుకోగలుగుతున్నారు.

ఏ రిరచనలు రెండుమూడు కన్నా చదవలేకపోయిన సింధుకు పాఠకుల్లో ఉన్న ఆ క్రేజ్‌ని చూసి జాలివేసి తీవ్రంగా ఆలోచించేది తప్పు ఎవరిలో వుందని! పాఠకులు చదువుతున్నారని పబ్లిషర్సూ, పబ్లిషర్సు వేస్తున్నారు కాబట్టి చదువుతున్నామని పాఠకులూ, ఎడిటర్స్ కోరుతున్నారుకాబట్టి రాస్తున్నామని రచయితలూ, లక్షలతో కోట్లతో ప్రారంభించిన పత్రికలు నష్టపోకుండా చేయటం తమబాధ్యత అని ఎడిటర్సూ...

అదోపెద్దవిషవలయం.

'ఫలానా రచయిత రాసిన నవల అద్భుతం... తరతరాలకూ భద్రంగా ఉంచుకునేందుకు బంగారు పెట్టెలో దాచాలనిపిస్తుందని ఓపాఠకుడూ...

నవల చదువుతున్నంతసేపూ పదిమంది

విలన్స్‌తో వీరోచితంగా పోరాడిన హీరోయిన్‌లో నన్నే ఊహించుకుని నేను పొందిన ఆనందాన్ని ఎలా తెలుపను...

అంటూ వచ్చే ఉత్తరాలు చదువుతున్నప్పుడు బాధతో వారి అజ్ఞానానికి జాలితో విలవిల్లాడి పోతుందామె.

ఒకవక్క ఉక్రోషం... మరోవైపు ఏమీ చేయలేని నిస్సహాయత.

కాలేజి అమ్మాయిల అభిమానం, ఈనవలల్లో హీరోల్లా వుండాలని లేఅఫ్‌డ్రెస్సింగ్ నుండి సమస్తం అనుకరించే అబ్బాయిల ఆదరణ... ఈరచయితల్ని తిరుగులేని సాహితీపీఠంపై కూర్చోపెట్టాయి.

సింధుకి వీరిలో నచ్చేది ఒక్కటే... అది వారి అద్భుతమైన శైలి. వారు రాసేది గొప్పసాహిత్యం కాదని ఖచ్చితంగా చెప్పొచ్చుకానీ, అరాసే స్టైల్ పాఠకుణ్ణి ఒకవిధమైన ట్రాన్స్‌లోకి తీసుకెళ్ళినట్లు వుంటుంది. అలా ఇంకెవ్వరూ రాయలేరేమో అనిపించేంత అద్భుతంగా వుంటుంది. అదీ వీరిలోని ప్రత్యేకత.

ఈవేవ్‌తో ఎప్పటినుండో వున్న రచయితలకు విశ్రాంతి లభించింది. చాలాకాలంగా స్తబ్దంగా, ఏచలనమూ లేకుండా సాగుతున్న సాహిత్య ప్రపంచానికి చలనం మాత్రం వచ్చినట్లయింది.

అందుకే అప్పుడప్పుడు అనుకుంటుంది సింధు 'ఈ అద్భుతమైన శైలితో, ఏదో ఒక సమస్యని తీసుకుని, దాన్ని విశ్లేషించడంలో పాఠకుణ్ణి ఆలోచింపచెయ్యగల విశిష్టమైన నట్లక్ష్ను తీసుకుంటే అత్యున్నత శిఖరాలనధిరోహించగల మంచి రచనలు రాగలవేమో' అని.

టేబుల్‌ముందు కూర్చుని దీక్షగా ఒక్కోపేజీ తిప్పుతున్న సింధు ముఖంలో నిమిషనిమిషానికి రంగులు మారుతున్నాయి.

పత్రికలు చదివేది మేధావులేకాదు సామాన్యులుకూడా అనే విషయం మరిచి తన భాషాపటిమను బలవంతంగా అనవసరపు సన్నివేశాల్లో, సందర్భాల్లో ఇష్టం వచ్చినట్లు రాసేశాడతను. లిటరేచర్‌లో స్పెషలైజేషన్ చేసింది ఇందుకోసమేనన్నమాట అనుకుంది. పాత్రలు రచయిత చెప్పినట్లు వినకుండా విశృంఖలంగా ప్రవర్తిస్తున్నాయా అనిపించిందో క్షణం. ఒక నిరుద్యోగి కథ రాస్తున్నా అతని అశాంతి, ధనం కోరలలోచిక్కి సమాజం ఎంత అస్తవ్యస్థంగా మారిందో, తాను నిరుద్యోగిగానే మిగిలిపోయే పరిస్థితులేమిటో...ఎక్కడా అవేం కన్పించటంలేదు.

ఊహించని మలుపులు...వూహకందని పర్యవసానాలూ పేజీలు తిప్పినకొద్దీ! దొంగతనాలు, వేశ్యావాటికలు, అందమైన అమ్మాయిలతో స్టార్‌హోటల్స్‌లో రాసక్రీడలూ...

ఇక భరించలేకపోయింది సింధు.

ఉన్నట్టుండి రాజు మెదిలాడు మనసులో! అతని దీనవదనమే కన్పిస్తోంది.

ఆవేశంతో ఆమె నిలువునా వణికిపోతోంది.

హఠాత్తుగా ఓ పెనుగులాట...భరించలేని సంచలనం. వళ్ళంతా స్వేదంతో తడిసి అసహనంగా ఫైల్ మూసేసింది.

చీరచెంగుతో ముఖం గట్టిగా తుడుచుకుంది.

కుర్చీలోంచి లేవలేదు. మూసివున్న ఫైల్ వంక తదేకంగా చూస్తూకూర్చున్న ఆమె మనసులో చాలా విచిత్రమైన సంకల్పానికి అంకురార్పణ జరిగింది.

ఆలోచన మెదడులోకి చేరిందే తడవుగా అనుకున్నది చేసితీరాలనే దృఢనిర్ణయంతో వేగంగా వెళ్ళి అగ్గిపెట్టెతెచ్చి ఫైల్ కిందవదేసి అగ్గిపుల్ల గీసి అంటించింది,

అంతే! క్షణాల్లో మంటలు...కాలి బూడిదగా మారబోతున్న సాహిత్యపు చితిని కళ్ళప్పగించి చూస్తోంది.

అనుకోని సంఘటన...అనుకోని పరిణామం...నిస్తేజం...నిశ్శబ్దం

మంటల వెలుగులో ఆమె ముఖంలో ఓరకమైన ఆనందం...చల్లారుతున్న కోపం.

'ధన్'మని తలుపు తోసుకుని లోపలికి వచ్చి చూసిన మురళిని, అక్కడ దృశ్యం హతాశుణ్ణి చేసింది.

అతని నోటినుంచి మాటరాలేదు. వేగంగా వెళ్లి బకెట్‌తో నీళ్ళుతెచ్చి మంటమీద దిమ్మరించాడు.

విపుల

చతుర



# అరుదైన అనుభూతి

ఎజుత్తచ్చన్ ఎనభైఏళ్ల వృద్ధుడు.

అవసానదశలో వున్నఆయన తన ఆఖరి కోరికగా ఆ వూళ్లో పేరుమోసిన కాంట్రాక్టరు నంబియార్ భార్య 'సతి'ని ఒక్కసారి తాకాలనుకున్నాడు.

ఆయన మంచంచుట్టూ వున్నవాళ్లందరినీ ఆశ్చర్యపరిచిందా వింత కోరిక.

ఆయన ఆఖరి కోరికను తీర్చాలని సహృదయంతో వెళ్లిన వ్యక్తికి ఎటువంటి అనుభవం ఎదురైంది?

చివరకు ఆవృద్ధుడు సతిని మనసారాస్పృశించగలిగాడా?

యం.ముకుందన్, మలయాళీ కథ 'కడపటికోరిక' చదివి తెలుసుకోండి.

**సెప్టెంబరు సంచిక** రెండున్నర రూపాయలే

ఆరిపోయిన మంటల్నిచూసి, చివ్వున తలె త్తి చూసింది.

బకెట్ అవతలపడేసి కంగారుగా, నగంకాలి ఆరిపోయిన కాగితాల్నితీసి ఫాన్ కింద ఆరబెట్టాడు.

ఆమె వేగంగా అతనిదగ్గరికి నడిచి, "ము రళీ... ఏమిటిది?" అంది కటువుగా.

"నా ప్రశ్నకూడా అదే" అన్నాడు కోపంగా.

ఒక్కనిమిషం నిశ్శబ్దం.

మనసులో చెలరేగిన కోపం, అందుకు ఆధా రభూతమైన ఆ నవలలోని అస్తవ్యస్తత మళ్ళీ మళ్ళీ నుదులు తిరుగుతుంటే...కిటికీ చువ్వ లు పట్టుకుని నిలబడ్డ సింధు చేతులు మరింత బిగుసుకున్నాయి.

"కాల్చేశాను మురళీ! మెలోడ్రామాలతో, అర్థంపర్థంలేని సెంటిమెంట్లతో, యువతను వక్రమార్గాలు పట్టిస్తున్న కాల్పనికసాహిత్యాన్ని జనంమీదికి ఉప్పెనలా ఉవ్వెత్తున ఎగిసివ దేలా వదులుతున్న సాహిత్యాన్ని కాల్చి బూడి దచేశాను" అంది ఆవేశంగా.

ఇంతెత్తున లేచాడు- "డోంటాక్ రబ్బిష్. నువ్వు చేసినవని ఎంత ఫూలిష్‌గావుందో; నీ ఆలోచన, విజ్ఞానం అంతా ఏమైపోతున్నాయో నాకర్థం కావటంలేదు సింధూ!

మంచికానీ, చెడుకానీ లోపల రగిలే ఇన్ స్పిరేషన్స్‌ని కాగితాలమీద అక్షరాలుగా పేర్చ టానికి ఆ రైటరెంత శక్తి వినియోగించాల్సి వచ్చిందో! ఆ ఆలోచనలు, అనుభూతి తిరిగి అతనికి వస్తాయా? నువ్విలా చేశావని తెలిస్తే అతను తీసుకునే యాక్షన్ ఏమిటో ఒక్కసారి ఆలోచించావా? బాధ్యతాయుతమైన ఉద్యో గంచేస్తూ, నువ్వు చేసిన పనికి మీ ఎడిటర్‌కి ఏం సమాధానం చెప్తావ్ సింధూ!" అన్నాడు మండిపడుతూ.

"ఈ విషయంగురించి మీరేం వర్రీకాకండి. నేను మానేజ్ చేసుకుంటాను. పోతే ఉద్యోగం పోతుంది. నాకు వచ్చిన రిమార్క్‌వల్ల మరే పత్రికాఫీసులోనూ ఉద్యోగం రాకపోవచ్చు. అందువల్ల నాకేం నష్టంలేదు... బాధపడను.

కానీ...

ఒకప్పుడు అద్భుతమైన రచనలతో కళకళలాడిన సాహితీసౌధం... ఏ సాహితీవరు డు పట్టించుకోక...చీకటితోనిండి విధ్వంసం కా వడానికి సిద్ధంగా వుంది. అది నేను భరించలే ను మురళీ! ఈ పరిణామాన్ని నేనుకాదు నాలాంటి ఎంతోమంది గొంతులు చించుకుని అరుస్తున్నారు... ఆక్రోశిస్తున్నారు.

కత్తికంటే కలం గొప్పదని ఎందుకన్నా రు! జీవితాన్ని నిర్దేశించేది సాహిత్యమైనప్పు డు...మానవజీవన పరిణామానికి సాహిత్యం ఎంత బలవత్తరమైనదో గుర్తించటంలేదు.

కూలిపోతున్న ఈ సౌధాన్ని ఎలాగైనా పునఃప్రతిష్ఠచేయాలి. కొత్త రూపుదిద్దాలి. కూలి పోతున్న సామ్రాజ్యాల్ని పోగొట్టుకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సోషలిస్టుదేశాలు తిరిగి సాధించుకున్నాయంటే ఒక్క తిరుగుబాటుతో నేకాదు... సాహిత్యమనే ఆయుధంకూడా ఉప యోగించవలసి వచ్చింది.

ఎటుచూసినా నిరాశ, నిస్పృహ, ఆకలి, తాండవిస్తుంటే చదువుకోవలసిందీ, ఆలో చించవలసిందీ ఈ కాల్పనిక సాహిత్యంగు రించికాదు. ఇది కాలగర్భంలో కలిసిపోవాలి... మార్పుతేవాలి. అందుకు ఏదో ఒకపథకం వేయక తప్పదు. నా నిర్ణయంలో తిరుగులే దు... మార్పురాదు. అంతే!" అంది.

ఆమె కంఠంలో అధికారం, కోపం, నిబ్బరం చూస్తుంటే ఆక్షణాన అతనిలో భయంలాంటిది కలిగింది. అర్థరాత్రి ఆ నీరవనిశ్శబ్ద వాతావర ణంలో ఆమె మాటలు గదిలో ప్రతిధ్వనిస్తుంటే ఏదో అలజడి, గగుర్పాటు కలిగాయతనికి.

అతను బదులుచెప్పటానికి నోరు విప్పాలని ప్రయత్నించినా విప్పలేకపోతున్నాడు.

ఆమె దగ్గరికెళ్ళి చేయిపట్టుకుని, "సింధూ... దేవుడు నిన్నిలా సృష్టించాడెందు కో నాకర్థం కావటంలేదు. జీవితం...జీవితంలో వుండే సమస్యలు, ఆకలి, అసమానతలు ఇవ న్నీ ఈ దౌర్భాగ్యపు భారతదేశంలో మామూలే! ఇవన్నీ సాహిత్యంవల్ల పోయేవికావు. అవే కథ లుగా రాస్తే చదివే పాఠకుడేలేడు. నువ్వు అనవసరంగా, అజ్ఞానంగా మరొకరి ఆలోచనా సంపదని కాల్చివేయటం పొరపాటు. రేపు మీ

ఎడిటర్‌గారికి ఏం సమాధానం చెప్పాలో ఆలోచించు. ఇప్పుడుకాదు. ముందు నిద్రపో... రేపు చూద్దాం'' అన్నాడు ఆమెను బెడ్‌రూమ్‌వైపు నడిపించుకు తీసుకెళ్తూ.

ఆమె పడుకుందే కానీ మాట్లాడలేదు. మౌనంగా చూస్తోంది. దీర్ఘంగా ఆలోచిస్తోంది.

జరిగిపోయిన సంఘటన తాలూకు ప్రభావం ఏరూపం దాలుస్తుందోననికాదు ఆమె ఆలోచించేది. ఆమె ఆలోచనలో రకరకాల భావాలు. తన అరుపులు అరణ్యరోదన కాకూడదనీ...తనలాంటి మరో వందల వేలగొంతులతో ఈ చీకటి రాతలకు జీవంలేకుండా చేయాలనే తపన...ఆలోచన.

"సింధూ... ప్లీజ్'' అంటూ ఆమె తలను తన చేతి మీదికి తీసుకున్నాడు మురళి.




తెల్లవారాక సింధు మామూలుగానే ఉంది. ఆమెలో బాధ, దిగులు, బెంగ ఏమీ లేవు. కానీ మురళికి మాత్రం ఆందోళనగా వుంది. 'పైకి బింకంగా వున్నా... లోలోన ఫీలవకుండా వుంటుందా? ఎడిటర్‌కి ఏం సమాధానం చెప్తుంది? క్షమించమంటుందా? లేక తన మామూలు ధోరణిలో... 'చదువుతుంటే వళ్లు మండింది... కాల్చేశాను. ఎడిట్ చేయమని నాకివ్వటం మీదే తప్పు! అంటూ దండెత్తుతుందా? అంతే! ఆమె తన ధోరణి మార్చుకోదు'

అతని ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి.

అతని మౌనం చూసిన ఆమె నవ్వుకుంది. ఆమెకు తెలుసు అతని ఆలోచనల వరవడి.

అందుకే అంది– "ఏదో ఒకటి సర్దిచెప్పుకోడం నా ఆత్మగౌరవానికి భంగమని నేను అనుకోడం లేదు. అసలు నేచేసినది తప్పుకాదని నా మతం. అందుకే నా ఉద్దేశాల్ని యధాతథంగానే చెప్తాను'' అంది దృఢంగా.

ఆమెకేం సమాధానం చెప్పాలనిపించలేదతనికి. 'తన ఆలోచనల ఫలితాలు అనుభవంలో ఋజువైనప్పుడైనా భయంకరమైన వాస్తవం ఆమెకు అర్థం కాకపోదు' అనుకున్నాడు.

తనెంతో అపురూపంగా చూసుకునే తన భార్య ఎవరిముందు తలొంచుకొని నిలబడాల్సి వస్తుందోనని అతని బాధ. ఆఫీసుకి ముభావంగానే వెళ్లిపోయాడు.

సింధు నగంనగం కాలిన కాగితాలు బాగ్‌లో కుక్కి టిఫిన్ చేసి ఆఫీసుకి బయల్దేరింది.

జయరామ్ నుంచి పిలుపు రాకముందే... తానే ఆయన రూమ్‌లోకి వెళ్లింది.

సింధుని చూడగానే స్వచ్ఛమైన నవ్వుతో విష్ చేశాడాయన.

"గుడ్‌మార్నింగ్ సర్'' అంటూ కుర్చీలో కూర్చోబోతూ లేచి నిలబడింది.

"కూర్చో సింధూ... లేచావే? '' అన్నాడాయన.

"ఇప్పుడు నేను చెప్పబోయే విషయం వింటే 'గెటప్' అనే పదం మీ నోటితో వినాల్సి వుంటుందేమోనని, అడ్వాన్సుగా నేనే లేచి నిలబడ్డాను'' అంది.

"ఏమిటి సింధూ?'' అంటూ ఆందోళనగా అడిగాడాయన.

జిప్ లాగి అందులోంచి గుప్పిళ్లతో కాగితాలు తీసి టేబిల్‌మీద పడేసింది.

వాటిని చూసి ఆయన నిర్ఘాంతపోయాడు.

నగంనగం కాలి, నల్లగా మారిన కాగితాలు చూసి ఒకటి చేతిలోకి తీసుకుని చూశాడు.

చూడగానే అర్థమైపోయింది. అది అవినాశ్ నవల 'జ్వాల' తాలూకు తను ఆమెకిచ్చిన రాత ప్రతి అని.

అంతే? ఆయన గుండె ఆగినంత పనైంది.

మనసులో ఆందోళన, అయోమయ పరిస్థితి. ఆయన కళ్లు తీక్షణంగా చూశాయి.

ఆమెపట్ల ఇంతకు ముందెన్నడూ రానంత కోపం, ఆవేశం వచ్చాయి. లోకం పోకడ అర్థం చేసుకోగలిగే విజ్ఞానం, వివేకం వుండి కూడా తన మనసుకు తోచిన విధంగా చేసేస్తూ, తనకు నచ్చినవిధంగా మాట్లాడేసినా... ప్రపంచంలోని వైవిధ్యం, వైరుధ్యం నెమ్మదిగా తెలుసుకుంటుంది లెమ్మని ఇంతకాలం ఆమెను తన కూతురే అలా మాట్లాడితే మౌనం వహించినట్లుగా ట్రీట్ చేశాడు సింధుని.

కానీ, ఇప్పుడీ సంఘటన తర్వాత ఆమె ఆవేశంతో, అర్థం లేని ఆలోచనలతో ఒక గొప్ప పేరున్న రచయిత నవల నిలువునా కాల్చి వేయటం బాధ్యతారాహిత్యంగా, క్షమించరాని నేరంగా భావిస్తున్నాడాయన.

ముందు వెనుకలు ఆలోచించని ఆవేశపరురాలు, ఉద్రేకి అయిన సింధు ఇలా చేయడానికి ఆమె స్వభావమే కారణమైనా కూడా పెద్ద షాక్‌గా వుందాయనకి.

పైగా అవినాశ్‌కి ఏం సమాధానం చెప్పాలా అని బుర్ర తిరిగిపోతోంది. నవలను తనకు సబ్మిట్ చేసినట్టు సంతకం ఉంది. లీగల్‌గా ప్రొసీడ్ కావడానికి అవకాశమున్న సంఘటన ఇది. తన ఇన్నేళ్ల అనుభవంలో ఇలాంటి సంఘటన ఎన్నడూ ఎరుగడు.

అయినా అడిగాడు "ఏమిటిది?" అని.

"అవినాశ్ నవల. ఎంత అబ్సర్డ్‌గా వుందో, చదివి వుంటే మీకే తెలిసేది. వెంటనే రిజెక్ట్ చేసి వుండేవారు కూడా " అంది తొణక్కుండా.

ఆయనకి వళ్లు మండిపోయింది.

"దిసీజ్ టూమచ్. నీకు మతిపోయింది సింధూ? బావుంది, బాలేదు అని నిర్ణయించాల్సింది నువ్వు కాదు. నీ ఇష్టమొచ్చినట్లు చేయడానికి, నీకు తోచిన నిర్ణయాలు తీసుకోడానికి ఇది నీ స్వంత పత్రికా కాదు. జనం పిచ్చివాళ్లయి చదవటం లేదతని రచనల్ని. నిన్ను... నిన్ను ఓ మంచి టేస్ట్ వున్న అమ్మాయిగా భావించి నీ దగ్గర క్లోజ్‌గా వుండటం నేచేసిన పొరపాటు. ఇప్పుడు నేను నీకిచ్చే పనిష్మెంట్ ఏమిటో తెల్సా?" అన్నాడు వగుర్చుతూ.

సింధు కదలకుండా నిలబడివుంది. ఆమె కదలికల్లో, ఆలోచనల్లో మార్పు లేదు. దేన్నయినా ఎదుర్కోడానికి సిద్ధపడేవున్నానన్నట్టు నిలబడి వుంది.

ద్వారం దగ్గర ఎప్పుడొచ్చి నిలబడ్డాడో జయరామ్ – ప్రశ్నకు సమాధానంగా అవినాశ్ అన్నాడు.

"ఆ పనిష్మెంట్ మీరు కాదు... నేనిస్తాను" అంటూ రెండు అడుగులు ముందుకు వేశాడు.

అతని కంఠ స్వరం విని గిరుక్కున వెనుతిరిగి చూసింది సింధు.

చేతిలో వెలుగుతున్న సిగరెట్ యాష్‌ట్రేలో గుచ్చి, టేబిల్‌మీద కాగితాలు అపురూపంగా చేతిలోకి తీసుకుని, "మూడు వందల పేజీలు... ముప్పయి పేజీలుగా మిగిల్చింది" అంటూ ఆమె వైపు తిరిగాడు.

"ఇష్టం లేనివన్నీ ఇలా కాల్చేసే అధికారం ఎవరిచ్చారు నీకు. మూడు వందల పేజీలను ఒక్క అగ్గిపుల్లతో బూడిదగా చేశావు. కానీ... నేను రాసినట్టు ఒక్క వాక్యం రాయి చూస్తాను. కొన్ని వేల, లక్షల మంది ఉత్కంఠతో చదువుతున్నారు.

నా ఒక్కడి నవలతో వారానికి పబ్లిషయ్యే రెండు పేజీల కోసం లక్షల కాపీలు సర్క్యులేటవుతున్నాయి. లైబ్రరీల్లో, చిన్న చిన్న షాపుల్లో కూడా నా పుస్తకాల కోసం పోటీ? కళ్లు మూసుకుని నాలుగు గోడల మధ్య ఉన్నదే ప్రపంచం అనుకుంటూ బతికే నీలాంటి అవివేకి, పొగరుబోతులకేం తెలుస్తుంది. నాపేరు ప్రఖ్యాతులు చూడలేక ఇలా చేయమని ఎవరో నిన్ను ప్రేరేపించి వుంటారు. కానీ కీర్తిశిఖరాలపైన వున్న నన్ను కూలదోయటం ఎవరి తరమూ కాదు.

నా నవల చితాభస్మం చేసిన నిన్ను..." అని ఒక్క క్షణం ఆగి, "చెప్పటం కాదు... చేసి చూపిస్తాను" అన్నాడు కోపంతో వూగిపోతూ.

ఎడిటర్ జయరామ్ కంగారుపడ్డాడు. ప్రస్తుతానికి అతనికేదో ఒక సమాధానం చెప్పి, టైం దాటెయ్యాలని భావించిన ఆయనకి అతని రాక, కోపం మరింత కల్లోలాన్ని రేపింది.

తన నవల ప్రచురణలో పబ్లిసిటీకి సంబంధించి నూతన పద్ధతిలో చేయవలసిన మార్పుల గురించి, రెమ్యూనరేషన్ గురించి మాట్లాడాలని వచ్చిన అతనికి ఇలాంటి పరిస్థితి ఏర్పడినందుకు బాధా, ఆవేశాలతో వూగిపోతున్నాడు అవినాశ్.

సింధు మాత్రం అలాగే నిలబడి వుంది. అతని మాటలు వింటుంటే అతనెంత అహంభావో అర్థమైపోయింది. పైగా మూడు వందల పేజీల్ని ముప్పై పేజీలుగా చేసింది— అని అన్న అతని మాటల్లో 'చేసింది' అని అతను తనను ఎద్రను చేయుటం ఆమెకెక్కడ లేని కోపం తెప్పించింది.

అతనికేసి కఠినంగా చూస్తూ అంది--

"మీరెక్కింది కీర్తి శిఖరాలో లేక పేక మేడలో నాకనవసరం. రచయితగా మీ బాధ్యతలు మర్చిపోయి రాస్తుంటే బాధ్యత గల పాఠకురాలిగా... నాలాంటి వందల, వేలమంది



కోసం, వాళ్లు వక్రమార్గం పట్టకుండా ఉండటం కోసం, ఎదిగీ ఎదగని పిల్లల మనసులు మీ రాతలు చదివి ఛిద్రం కాకుండా ఉండటం కోసం నేనీ పని చేశాను...

మీరు ఏది రాస్తే అదే సాహిత్యం అనుకుంటే అది మీ మూర్ఖత్వం ఈరోజుకాకపోయినా రేపయినా కళ్లుతెరిచిన పాఠకులు మీరెక్కిన శిఖరాలనుంచి అథః పాతాళానికి తోస్తారు. అందువల్ల మీకు జరిగే నష్టం ఏమీ లేకపోవచ్చు...

ఎందుకంటే ఆ స్థితికి పాఠకులు వచ్చేసరికి వాళ్ల అజ్ఞానాన్ని కాష్ చేసేసుకుని బ్యాంక్ బాలన్సులు, ఆస్తి అంతస్తులు సమస్తం పెంచేసుకుని వుండచ్చు

కానీ, ఒక రచయితగా మీకు సాహితీ పీఠం వేసిన పాఠకులకి, సమాజానికి మీరు చేసిన సేవ, ఇచ్చిన సందేశం ఏమిటో ఒక్క నిమిషం ఆలోచించండి...

సమాజంలో మూఢాచారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు, కూకటివేళ్లతో పెళ్లగించాలనుకునే సంఘసంస్కర్తకీ; ఆలోచనా లేమి, జడత్వం, తీవ్రమైన వైరుధ్యాలు, సంకుచితాలు వున్న మనుమల్ని ప్రభావితం చేయాలనుకునే రచయితకీ తేడాలేదు. ఒక రచయితని సంస్కర్తగా ఆశించి, ఆరాధించే మాకు మీరిచ్చేదేమిటి...?

అభూతకల్పనల్ని శాస్త్రీయ విషయాలుగా నిరూపిస్తూ పాఠకుల్లో సంభ్రమాశ్చర్యాలతోపాటు మూఢనమ్మకాల్ని తిరిగి ప్రవేశపెడుతున్నారు. రొమాంటిసిజాలు రాసి, టీనేజ్‌లో తమకో బాయ్‌ఫ్రెండో, గర్ల్‌ఫ్రెండో లేకపోతే ఆ ఏజ్‌కి అర్థమేలేదనుకునే స్థితికి దిగజారుస్తున్నారు కాలేజీ పిల్లల్ని...

కాలక్షేపం కథలు, సైన్స్ ఫిక్షన్స్ రాయటం తప్పనికాదు నావుద్దేశం. సాహిత్యాన్ని చదివి నేర్చుకోవలసింది, అన్వయించుకోవలసింది ఏమీలేదు అనుకునే దశనుంచి మనం దాటిపోతే అప్పుడు రాయండి అలాంటి కథలు. కానీ మనమంత అద్వాన్సుకాలేదే!

మీ రచయితలకు ఈ సామాజిక వాస్తవి కత ఎప్పుడు అర్థమౌతుంది? ఈ తెలుగు పత్రికల్లో ఈ ట్రాష్ మరెంతకాలం భరించాలి అని మొరపెట్టుకునే వాళ్లు మిమ్మల్ని అభిమానించే వారి సంఖ్య కంటే ఎక్కువే అని గుర్తించండి'' అంది.

"ఈ ఫిక్షన్సూ, దెయ్యాలూ, భూతాల కథలు ఈరోజు నేను సృష్టించినవి కావు. ప్రాచీన సాహిత్యాలన్నింటిలోనూ ఇవే కథావస్తువులు తెరిచిచూస్తే కోకొల్లలుగా కన్పిస్తాయి. వెస్టర్న్ కంట్రీస్‌లో ఈ కథలమీద ప్రజలకెంత క్రేజో వాళ్ల సాహిత్యం, సినిమాలు చూస్తే తెలుస్తుంది. మన పురాణాల్లో, శాస్త్రాల్లో కూడా వీటి గురించి చాలా భీభత్సంగా రాశారు. అందులోంచి వచ్చిందే ఈ సస్పెన్స్ సాహిత్యం. మనిషి సంస్కారం బట్టి నమ్మకాలు, ఆదర్శాలు వుంటాయి. సాహిత్యం చదివి అలవర్చుకుంటే ఎంతోకాలం నిలుస్తుంది'' అన్నాడు.

"కాలంమారింది. మనిషి ప్రవృత్తిలో వస్తున్న మానసిక పరిణామాలను గుర్తిస్తే మీరిలా మాట్లాడరు. మారేకాలాన్నిబట్టి అవగాహన కూడా మారుతుంది కదా!...

మీలోని అవగాహనకి ఒక సమగ్రత, జీవితాన్ని సమాజాన్ని అర్థం చేసుకోడంలో వున్న సమన్వయం, వీటివల్ల మీలోంచి వచ్చే భావాలు మంచి కథలుగా ప్రజల్లోకి వెళ్లగలగాలి''

ఉన్నట్టుండి ఆమె కంఠస్వరంలో మార్పురావడం గమనించాడు అవినాశ్.

"మీరొక్కరేగాదు ఇలా రాస్తున్నది. ఇతర్లు రాసేవన్నీ గొప్పకథలు, రాసేవాళ్లంతా నిజాయితీపరులు అని నేననటంలేదు. కార్మికులు, భూస్వాముల ఘర్షణలు, సమాజసేవ, సాహిత్యసేవ అని రాసేవాళ్లల్లో కూడా ఈ లక్షణాలేవీ ఉండటంలేదు'' అంది.

"మూఢాచారాలు, సంఘర్షణలే ఇతివృత్తాలుగా తీసుకుని చదివే పాఠకులు నాకు కన్పించటం లేదు. కేవలం వాటినే ఆశయంగా పెట్టుకుని ప్రచురిస్తున్న కొన్ని పత్రికలు, వాళ్ల కుటుంబసభ్యులు కూడా చదువుకోడానికి ఉపయోగపడనిస్థితిలో వున్నాయని నీకు తెలియదు'' అన్నాడతను.

పూర్వం మన తాతముత్తాతలు తమ ఘనకార్యాల్ని కథలుగా చెప్పి ఒక విధమైన ఇంట్ర

స్టు క్రియేట్ చేసేవారట. ఆ తర్వాత లిపి వచ్చింది. ఆ కథలు ఎప్పటికీ చదువుకునే వీలుగా భద్రపరిచారు. అలా ఏర్పడినవేకదా ఈ వేదాలూ, ఇతిహాసాలు. అలా క్రియేట్ చేయగల సత్తాలేనప్పుడు పత్రికలు పెట్టుకోవడం దేనికి'' అంది సింధు.

''పదిమంది మేధావులు, సాహితీవేత్తలు, వర్కర్సు మధ్య అవగాహనతో కొన్ని రూల్స్, రెగ్యులేషన్స్‌తో నడిచే పత్రిక విషయంలో ఆకలిదప్పులు, స్త్రీ స్వేచ్ఛల గురించి రాస్తూ కూర్చుంటే పత్రిక అద్భుతంగా నడుస్తుందనుకోడం ఫూలిష్‌నెస్. ఎవరో పెట్టే లక్షలతో ఈ పదిమందీ ఆడుకోడం పద్ధతి కాదు'' అన్నాడతను.

అతని మాటలకి సింధుకి ఎక్కడలేని కోపం రగులుకుంది.

''ఎవరో ఒక లక్షాధికారి నష్టపోతాడని మీరు లక్షలాది పాఠకుల్ని నష్టపరిచే ఈ రకమైన సాహిత్యం సృష్టిస్తున్నారన్నమాట. సమాజం ఏ తీరుగా వుందో చెప్పి వాళ్ళని చైతన్యవంతుల్ని చేసే సాధనం సాహిత్యం ఒక్కటే. అలాంటి లక్షల మంది ఈ రకమైన సాహిత్యం వల్ల ఎంత నష్టపోతున్నారో మీకవసరంలేదన్నమాట...

ఒక రచయిత మాట్లాడాల్సిన మాటలు కావివి. కానీ పాఠకులు వూరుకోరు. రచయిత బాధ్యత తెలియజేస్తారు. అందుకు నాందిగా మీ నవల అగ్నికి ఆహుతి చేశాను. ఇకనుండి ఈ రకమైన ట్రాష్ ఎలా వస్తుందో కూడా చూస్తాను'' అంది ఆ పాద మస్తకం ఉద్వేగంతో వూగిపోతూ!

అతని నేత్రాలు కోపంతో కదిలాయి. కనుపాపలు రక్తంలా ఎర్రగా మెరుస్తున్నాయి.

అతని గుండెగాడి తప్పినట్టు అయోమయంగా కొట్టుకుంటోంది. అతనంతగా కలవరపడటానికి కారణం ఆమె అన్న మాటలకికాదు. తన జీవితకాలంలో 'సింధులాంటి ఆడపిల్లని చూడలేకపోవడమే'

సింధు హాండ్‌బాగ్ తీసుకుని ఇంకొక్క నిముషం కూడా అక్కడ నిలబడకుండా డోర్ తీసుకుని బైటికి వెళ్ళిపోయింది విసురుగా.

బైటికి వెళ్ళబోతున్న ఆమె జబ్బుపుచ్చుకుని ఇవతలికి లాగి ఈడ్చిచెంప పగలకొట్టాలని పించిందతనికి.

కానీ అతనలా చేయలేకపోయాడు. పెదవులు దాటి రాబోయిన మాటలు కూడా గొంతులోనే సమాధి అయిపోయాయి.

అతనిలో అంతర్గతంగా వున్న ఏదో అశక్తత అతణ్ణి మూగభావంగా వుంచేసింది.

జయరామ్ బొమ్మలా నిలబడే వున్నాడు. అయిదు నిమిషాల తర్వాత తేరుకున్నారిద్దరూ.

అవినాశ్‌ని కూర్చోమని సైగచేశాడు.

అతను కూర్చున్న తర్వాత అడిగాడు- ''ఈమె ఇక్కడ ఎంతకాలం నుంచీ పనిచేస్తోంది'' అని.

''రెండేళ్లనుంచీ'' అన్న సమాధానంతోపాటు ఆదినుంచి ఆమె నడవడి, మనస్తత్వం, సాహిత్యాభిలాష... ఇవన్నీ కూడా వివరించి చెప్పాడాయన.

అతను విన్నాడు మౌనంగా.

తామిద్దరి మధ్య ఎంతోకాలంగా పరిచయం, స్నేహం వున్నాకూడా నవల గురించి ఏం చేస్తాడో ఊహించలేకపోతున్నాడాయన.

అతనేం మాట్లాడకుండా సిగరెట్ వెలిగించాడు.

భయంకరమైన నిశ్శబ్దం ఆ గదిలో.

ఎదుటి మనిషి గురించి ఆలోచించే నైజమే చచ్చిపోయిన ఈ రోజుల్లో... ఓ ఆడపిల్ల నలుగురి గురించి అంతగా ఆక్రోశిస్తుంటే... అది ఆమె అజ్ఞానంగా భావించి, పొగరబోతనే రూపుదిద్దిన అవినాష్ 'బ్లడీ బిచ్ ఆమెను అంత తేలిగ్గా వదలకూడదు. పగ తీర్చుకోవాలా, పనిష్మెంటివ్వాలా' అని ఆలోచిస్తున్నాడు.

ఎడిటర్ జయరామ్‌తో ఏంమాట్లాడకుండా లేచి, ''ఇంటికి వెళ్ళాక ఫోన్ చేస్తాను. మీరేం వర్రీ కాకండి'' అంటూ బైటికి వెళ్ళిపోయాడు.

లోపల జరిగిన ఘర్షణ స్టాఫ్‌కి తెలియకపోలేదు. ఏవో గుసగుసలు, జోక్స్ రకరకాలుగా.

సింధు సీట్‌లో కూర్చోలేదు. వెళ్ళి క్యాంటీ

న్‌లో కూర్చుంది ఒక్కతే.

ఆమె మనను స్థిమితంగా వుందిప్పుడు! అప్పటికి చేయాలనుకున్నది ధైర్యంగా చేసేశా నన్న తృప్తితోపాటు...

మనసు పొరల్లో ఎక్కడో, అద్భుతమైన శైలీ, శిల్పనంపద వున్న ఓ రైటర్‌ని దుయ్యబట్టడం బాధనిపించింది. అదే క్షణంలో తన మనసులో నలిగే ఆలోచనా ఒరవడికి, తను కోరుకునే సాహితీకళకి అంకురార్పణ చేయమని అత న్నే కోరాలనే ఓ దృఢమైన సంకల్పం కలిగింది.

మనసులోకి ఆలోచన వచ్చిందే తడవుగా... ఎంతసేపలా ఒంటరిగా తన భావనాప్ర పంచంలో వుండిపోయిందో, వాచీ చూసు కుంటే వన్నెండు.

లేచి, రెండురోజులు లీవ్ రాసిచ్చి బైటకు నడిచింది సింధు.

★ ★ ★

అవినాశ్ తనగదిలో రాబిన్ కుక్ రాసిన 'కోమా' చదువుతున్నాడు. నవల చదువుతు న్నాడే కానీ అతని మనసు అక్కడ నిలవ టంలేదు. అతని మస్తిష్కంలో పదేపదే సింధు అన్నమాటలే ప్రతిధ్వనిస్తున్నాయి. పుస్తకం అవతల పారేసి, సిగరెట్ ముట్టించి కిటికీ దగ్గర నిలబడ్డాడతను.

తలుచుకున్న కొద్దీ ఒకపక్క కోపం, మరో వైపు ఆమె తార్కిజ్ఞానానికి విభ్రమం కలుగు తున్నాయి.

మనసులో ఏమూలో పేరుకున్న నిరాశ, నిస్పృహ ఉన్నట్టుండి పెల్లుబికాయి.

ఆమెమీదే కాదు ఈ సర్వ ప్రపంచంమీదే కసి, తనమీదే తనకు కసి, జాలి. ఈ ప్రపంచా న్ని సర్వనాశనం చేయాలనిపించే కాఠిన్యం.

ఎవరికీ తెలియని, చెప్పుకోలేని దట్టమైన చీకటి అనంతంగా విస్తరించుకున్నట్టు కుంచించుకుపోయాడు.

గుండెల్లోంచి తన్నుకు వస్తున్న విషాదం భరించలేనివాడిలా అతనికే తెలియకుండా ధారగా కారిన కన్నీరు.

శరీరంలో సన్నగా ప్రకంపన...

నిలబడలేనివాడిలా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి విస్కీ బాటిల్ ఒకటి తీసి గ్లాసులో వంపుకుని గటగటతాగేశాడు. అప్పుడుకానీ అతనికి మన శ్శాంతిగా అనిపించలేదు. వెళ్ళి బెడ్‌మీద పడిపోయాడు.

కళ్ళు మూసుకున్న అతనికి ఒకప్పుడు తను జీవితం కొట్టిన ఎదురుదెబ్బలకి తట్టుకో లేక పిచ్చివాడిలా తిరిగిన విషయం జ్ఞాపకం వచ్చింది.

ఆదుకునే ఆత్మీయుడుకానీ ఆదరించే నేస్తం తంకానీ, బతిమాలినా రచనలు ప్రచురించే ఎడిటర్లుగానీలేరు అలమటించిపోయిన తను సంఘం మీద ద్వేషం, కసి, విరక్తి పెంచుకున్న తీరు గుర్తుకొచ్చింది.

జీవితం మీద ఉత్సాహం, పెదవులమీద చిరునవ్వు,అనుబంధాల మీద భ్రమలు సమ స్తం చచ్చిపోయాయి అప్పట్లో.

తను సుఖపడక పోవడానికి కారణం సమస్త ప్రపంచమూ అన్నట్టు, తనకు శాంతి లేకపోవ టానికి, తను మోసపోవటానికీ ఈ మనుషులే కారణమన్నట్టు కసి, కాఠిన్యం పెంచుకున్నాడు.

ఆ మానసిక క్షోభలోంచి పుట్టిన భావాల్నే కథలుగా మలిచాడు. లోకంమీద ప్రత్యక్షంగా తీర్చుకోలేని కసి, కార్పణ్యం, కోపద్వేషాలను రాతల్లోకి మార్చి "కాంపోజ్" ఇంజక్షన్ నెమ్మ దిగా నరాల్లోకి జారినట్టుగా... పాఠకుల మెద డులోకి నైతికవిలువల్ని దిగజార్చే సాహిత్యా న్ని సృష్టించి వదిలాడు.

తన అస్తవ్యస్తమైన వూహలకి అందమైన శిల్పాకృతినిచ్చాడు. సాహిత్యమనే అద్భుత వర్ణచిత్రానికి అస్పష్టమైన ఆలోచనల్ని అంద మైన రంగులుగా అద్దాడు. చెడుని చెడుగా వూహించలేని పాఠకులు చాలాత్వరగా రిసీవ్ చేసుకున్నారు తనని. తన సాహిత్యపు మత్తులో అదొక శిథిల శిల్పంగా, జీవంలేని వర్ణచి త్రంగా గుర్తించలేకపోయారు.

బతుకులోని నిరర్థకతను ఆవిధంగా చల్లా ర్చుకున్నాడు, ఎడిటర్లను పాదాక్రాంతుల్ని చే సుకున్నాడు.

ఇప్పుడు... ఇంతకాలం తర్వాత ఒక ఆడ పిల్ల తన అహంభావపు చీకటినీ, రాతల్లోని కోణాలన్నింటినీ ఎత్తి చూపటం వింతగా, అస

విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో కొత్త పరిమళంతో వస్తోంది

హనంగా అనిపిస్తోంది. నీతి కొలతలతో విమర్శించి తనలోని యాటిట్యూడ్‌ని భగ్నం చేసిందామె.

సింధు మాటలు పదేపదే మారుమోగినకొద్దీ తనలోని అపశృతులు తనకు తెలిసినా...అది నేరంగా భరించలేకపోతున్నాడు.

'ప్రపంచ నాగరికతకు అలవాటుపడి, ఆమె చెప్పిన నీతినియమాలను పాటించటానికి అనువైన పరిస్థితులులేని సమాజానికి, తనందించే సాహిత్యంతప్ప మరొకటి అంగీకరించలేరు ఈ పాఠకులు. ఆ విషయం ఆమె గ్రహించలేకపోతోంది' అనుకున్నాడు.

ఆ రాత్రి అతనికంటిమీద కునుకులేదు. ఎన్నడూ ఎరుగని అలజడి. ఆమెలోని భావగర్భితమైన కోపానికి అతనిలోని భావుకత్వం తలవొంచిన అనుభూతి.

ఎందుకలా అన్పిస్తోందో అతనికే అర్థంకావటంలేదు. కాల్పనిక జగత్తులో బతుకుతూ అలాంటి రచనలే అందించిన తనకు వాస్తవాన్ని అంతకటువుగా, ఛాలెంజ్‌గా చెప్పి తన ఆలోచనల్ని సంస్కరించింది అనుకున్నాడు.

అలా అనిపించిన తర్వాత...అతని ఆలోచనల్లో వివరీతమైన చైతన్యం వళ్ళు విరుచుకున్నట్టయింది.

'ఎందుకో అప్పటివరకూ తను రాసిన రాతలన్నీ వ్యర్థప్రయాసలుగా కొడిగట్టిన దీపాల్లా అనిపించసాగాయతనికి. తన హృదయం ఎలా యోచిస్తే అలా కాగితాలమీద పేర్చిన అక్షరాలు, ప్రజల్ని అజ్ఞానంలో ముంచిన పిచ్చిరాతలుగా అనిపించాయి.

బాధలతో, బరువులతో కృంగిపోతున్న యువతకి తనిచ్చిన సందేశాలు, పట్టించిన పెడమార్గాలు ధ్వంసంచేస్తేతప్ప తన రాతలకు నిష్కృతి లేదనిపించింది.

పీడకలలాంటి గతాన్ని రాతల్ని పాతేసి, కొత్తమార్గాన్ని అన్వేషించాలి. గుండె నెత్తురులోంచి ఒలికే భావాలు చరిత్రపుటల్లోకి చేరేలా అద్భుతసృష్టి చేస్తాను. అప్పుడు కానీ తన జీవితానికి సార్థకత వుండదు.

అలా అనుకున్న తర్వాతకానీ అతని మనను శాంతించలేదు. తన నవలను, కొన్నివేల ఖరీదుచేసే తన నవల రాతప్రతిని సింధు కాల్చిపారేయటం నేరంగా కనిపించలేదాక్షణాన.

తెల్లవార్లూ అలా ఆలోచిస్తూనే వున్నాడు అవినాశ్.

ఉదయం లేవగానే జయరామ్ ఇంటికి ఫోన్‌చేశాడు. ఆయన ఆ సమయంలో ఇంట్లోనే వున్నాడు.

"సింధు విషయంలో మీరేం చేయాలనుకుంటున్నారు?" అని అడిగాడు ఆయన ఉద్దేశం ఎలా వుందో తెలుసుకోవాలని.

"మీ నిర్ణయంకోసమే ఎదురుచూస్తున్నాను. ఏం చేయమంటారు చెప్పండి?" అన్నాడాయన.

అవినాశ్‌కి జాలేసింది ఆయన పరిస్థితికి.

అతన్నుంచి ఒక్క నిముషం సమాధానం లేకపోయేసరికి ఆయనే అన్నాడు మళ్ళీ-

"రిజైన్ చేయమని చెప్పమంటారా?" అని.

"వద్దు. ఆమెనేం క్వశ్చన్‌చేయకండి. ఆమె మాటల్లో ఏదో శక్తి...నన్ను పీడిస్తోంది. మరొక నవల రాసి సాధ్యమైనంత త్వరలో మీకిస్తాను. 'జ్వాల' నవల గురించిన పబ్లిసిటీని ఆపివేయించండి" అని పెట్టేశాడు.

ఎడిటర్ జయరామ్ హతాశుడయ్యాడు అతని నిర్ణయం విని. ఏమార్పువల్ల అతనీ నిర్ణయానికి వచ్చాడో ఆలోచించలేకపోతున్నాడాయన.

ఈ గొడవ ఎంతదూరం పోతుందో, తమ పత్రికకు ఎలాంటిపేరు వస్తుందోనని క్రితంరోజునుండి బాధపడుతున్న ఆయనకు అతని మాటలు రిలీఫ్‌గా అనిపించాయి.

అయినా సింధుమీద కోపంమాత్రం పోలేదు. 'ఈ సమస్యకు ఏదో ఒక పరిష్కారం తీసుకోకపోతే...ఆమె తిరిగి ఇలా చేయకుండా వుండదు. అందువల్ల ఎదురయ్యే పరిణామాలకు బాధ్యుడు తనేకాబట్టి ఆలోచించాలి ఆమె విషయం' అనుకున్నాడాయన మనసులో.

★ ★ ★

ఇంట్లో వున్న రెండురోజులూ సింధుకి ఎంతో చకచకతమతమైపోయింది. ఆఫీసుకి శెలవుపెట్టాను అని అనేసరికి ఆమె నాన్నమ్మ 'వంట్లో

బావుండలేదా? ఏమైంది... తలనొప్పా, వళ్ళు నొప్పులా, పులుపుగానీ తినాలనిపిస్తోందా?' అంటూ ఒకటే గొడవ.

"అదేంకాదు నాన్నమ్మా! ఆఫీసులో చిన్నగొడవేదో అయింది. అందుకే రెండురోజులు శెలవు పెట్టాను. రేపు వెళ్ళాలి" అంది ఆవిడ చాదస్తానికి నవ్వుకుంటూ.

"కాదు... నలతగా కనిపిస్తున్నావు. అబ్బాయిని తీసుకుని ఒక్కసారి హాస్పిటల్‌కి వెళ్ళిరా" అని అనటమేకాకుండా, మురళికి చెప్పి ఆమెను తీసుకెళ్ళేవరకూ వూరుకోలేదావిడ.

ఆమె చాదస్తానికి విసుగేసిన సింధు అలా గేనని బయల్దేరింది. హాస్పిటల్‌కి బదులుగా సినిమా చూసొచ్చారిద్దరూ. ఆవిడకేదో సమాధానం చెప్పి అప్పటికి ఆ సమస్యనుంచి తప్పించుకోగలిగిందామె.

జరిగిపోయిన సంఘటనవల్ల ఎడిటర్ జయరామ్, అవినాశ్ తనమీద కోపంతో రగిలిపోతూ ఉంటారనీ, తనని ఉద్యోగంలోంచి తీసివేయాలని నిర్ణయించుకుని వుంటారని అనుకుంది. వాళ్ళ నోటితో ఆ విషయం వినకముందు తనే రిజైన్ చేయాలని అనుకుంది.

అలాకాకుండా వాళ్ళు తనమీద మరోవిధంగా ఏమైనా యాక్షన్ తీసుకోవాలనుకుంటున్నారేమో, అది ఏమైవుంటుందో వూహించలేకపోతోంది. ఏది యేమైనా తను భయపడదు... బాధపడదు. ధైర్యంగానే ఎదుర్కొంటుంది. తన ప్రవర్తన సమర్థించుకోడానికి సరైన కారణాలు, ఉద్దేశాలు ఖచ్చితంగా చెప్తుంది.

ఇందులో కాంప్రమైజ్‌అయ్యే ప్రసక్తిగానీ, క్షమాపణలు వేడుకోవడంకానీ జరగదని చెప్తుంది. అంతే... అనుకుందామె.

ఆరోజు సాయంకాలం సింధు మొక్కలకి నీళ్ళుపోసి, చల్లటిగాలి వీస్తుంటే అక్కడే, ఆ మొక్కలమధ్యే కూర్చుంది వల్లీతో కబుర్లుచెప్తూ.

గ్రీష్మతాపానికి అలసి వాడిపోయిన మొక్కలు, చల్లటినీళ్ళకి వూపిరిపోసుకుని, పులకరింతలతో రెపరెపలాడుతున్నాయి. సూర్యకాంతి మసకబారి, ప్రకృతిచీకటిని పులుముకుంటోంది. వెలిమబ్బులు ఆకాశంలో పరుగెడుతున్నాయి. పగటి వేడికి ఉడికిపోయిన ప్రకృతిని చల్లబరచడానికి చందమామ ముస్తాబవుతున్నాడు.

ఆకాశానికి అందాన్నిస్తూ అక్కడక్కడా నక్షత్రాలు వచ్చిచేరాయి. గాలికి పచ్చగడ్డి వూగుతుంటే సింధు పరవశంగా చూస్తోంది.

ఆ నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ, బైట కారాగిన శబ్దంఅయి సింధు, వల్లి ఒక్కసారే చూశారు తలతిప్పి.

కారులోంచి దిగిన అవినాశ్ గేటుతీసుకుని లోపలికి రావటంచూసిన సింధు కళ్ళు సూర్యాస్తమయాన పశ్చిమాకాశంలా ఎర్రగా అయ్యాయి. గుండె వేగంగా కొట్టుకుంది ఒక్క క్షణం.

అప్రయత్నంగా లేచి నిలబడింది.

అవినాశ్ గేటుదగ్గరే నిలబడిపోయాడు నవ్వుతూ. అతనిది ముప్ఫయి అయిదేళ్ళ వయసు. అయినా అతని డ్రెస్, మాట, నడవడి అంతకంటే తక్కువ వయసున్నవాడిలా అనిపిస్తాడు.

ఏదో ఎడ్వర్‌టైజింగ్ ఏజన్సీలో పార్టనర్ అతను. బిజినెస్‌కంటే అతనికి రాయటమే ఎక్కువ గిట్టుబాటుగా ఉందిప్పుడు.

అక్కడే నిలబడిపోయిన అవినాశ్ ఆమె నుండి ఏవిధమైన ఆహ్వానమూ రాకపోయేసరికి, భుజాలు ఎగరేసి తనలో తను నవ్వుకుంటూ తనంతట తానే నడిచివచ్చాడు.

తనకు రెండడుగుల దూరంలో నిలబడ్డ అతన్ని చూసి, తేరుకుని లేని నవ్వు ముఖాన పులుముకుని- "రండి." అంటూ లోపలికి దారితీయబోతుంటే ఆమెను చేతి సైగతో ఆపి- "ఇక్కడే బావుంది... ఈ చల్లటిగాలి నన్ను కూడా పీల్చుకోనివ్వండి" అన్నాడు.

సింధుకి ఆశ్చర్యంగావుంది. ఉన్నట్టుండి అతనలారావటం దేనికో, ఆమె ఊహించలేకపోతోంది. పైగా, ఆరోజు అతని మాటతీరుకీ, ఇప్పుడు చూస్తున్న అతనిలోని సౌమ్యతకీ అర్థాలు వెతకడానికి ప్రయత్నిస్తోంది.

అతనివంక సాలోచనగా చూస్తూ- "కూర్చోండి" అంది ఛైర్ చూపించి.

అతను కూర్చున్నాడు. తెల్లటి బట్టల్లో ఏదో స్వచ్ఛత అపాదించుకున్నట్టు వెన్నెల్లో మరింత మెరుస్తున్నాడతను.

వల్లీ మౌనంగా కూర్చుని అతన్ని పరిశీలిస్తోంది. అతన్ని ఎక్కడో చూసిన జ్ఞాపకం... ఎక్కడ చూసిందో జ్ఞాపకం రావటంలేదు.

"ఆంటీ! ఆయనెవరు? ఎక్కడో చూశాను. పెద్దపోజుగా వున్నాడు. ఒక ఆటపట్టించనా!" అంది చెవిలో.

సింధు నవ్వింది కినుక్కున.

చుట్టూ పరిశీలిస్తున్న అతను ఆమె నవ్వుకి కళ్ళుతిప్పి చూశాడు.

వల్లీ ఎటో చూసింది అతని చూపుల్ని తప్పించుకుందుకు.

సింధు అతన్ని చూపిస్తూ, "ఈయనెవరో గుర్తు రావటంలేదా! శ్రీనాథుని ఫేవరిట్‌వికదా! తప్పుకాదులే గుర్తురాకపోవటం. ఈయన అవినాశ్ అని దిగ్రేట్..." ఆపైన మాటలు ఆమె గొంతులోనే వుండిపోయాయి వల్లీ వేసిన కేకకి.

"వాట్, మైగాడ్. దిగ్రేట్ రైటర్ అవినాశ్?! నిజంగా! గాడ్‌ఈజ్ గ్రేట్ ఆంటీ! చూస్తుంటే నా గుండెఆగిపోతుందేమో అనిపిస్తుంది" అంటూ అతనివైపు తిరిగి- "మిమ్మల్ని ఇలా చూస్తున్నందుకు చాలా హాపీగా వుంది. అయాం సౌలక్కీ" అంటూ అతని చేతులు పట్టుకుని కుదిపేసింది.

ఆమె వాక్ప్రవాహానికి అడ్డుపడకపోతే.... ఆ కాసేపట్లో అతన్ని మింగేస్తుందో, ఆ ఆనందానికి తట్టుకోలేక నిజంగానే ఆపిల్ల గుండె ఆగినా ఆగిపోతుందేమోననిపించింది సింధుకి.

ఆపిల్ల అలా ఉక్కిరిబిక్కిరి అవటం చూస్తుంటే సింధుకి నవ్వూ, ఏడుపూ రెండూ ఒక్కసారే వచ్చాయి.

"వల్లీ... ఉత్తఅభిమానమేనా మాకేమైనా మంచి కాఫీ ఇస్తావా, లేదా" అంది సింధు.

"తప్పకుండా ఆంటీ! వన్‌మినిట్" అంటూ ఉరుకులు పరుగులతో వెళ్ళింది.

సింధు నవ్వుతుంటే... అది చూసిన అవినాశ్ మనసు ప్రసన్నమైంది.

ఆ తర్వాత అన్నాడు- "మీకు నవ్వటం కూడా వచ్చన్నమాట" అని.

"ఏం నేనెలా కన్పిస్తున్నాను!" అంది.

"భయానక రసాలు తప్ప సాత్విక లక్షణాలే మీ కన్పించలేదు ఇంతకుముందు వరకూ" అన్నాడు చిరునవ్వుతో.

సింధు నవ్వకుండా ఉండలేకపోయింది.

"కాఫీ రెడీ" అంటూ వరదగోదారిలా వస్తున్న వల్లీని చూసి, అవినాశ్ భయంగా అన్నాడు- "ఈవేళ సక్రమంగా ఇంటికి చేరగలనా" అని.

"ఊఁ... పొంగిపొరలే పవిత్రమయిన ప్రేమాభిమానాలను ఏ శక్తీ ప్రతిఘటించలేదంటూ డైలాగ్స్ రాయటంకాదు. అవి మీవైపే ప్రవహిస్తుంటే భయపడతారెందుకు? అందరికీ వస్తుందా అలాంటి అదృష్టం. కానివ్వండి" అంది సింధు వెక్కిరింపుగా.

"ఈమె బుర్రనింకా ప్రక్షాళన చేయలేదా మీరు?" అన్నాడు.

ఆమె సమాధానం చెప్పేలోపే వల్లీ వచ్చేసింది.

ఇద్దరికీ చెరో కప్పు అందించి- "ఆంటీ.. మీకు అవినాశ్‌గారు తెలుసునని ఎందుకు చెప్పలేదు" ఆమె పెద్దనేరం చేసేసిందన్నట్టుగా అడిగింది వల్లీ.

"రాజేష్ ప్రస్తావన వచ్చినప్పుడు నేచెప్పిన విషయాలు అప్పుడే మర్చిపోయావన్నమాట" అని ఆగి వల్లీ వంక చూసింది సింధు. ఆమె ముఖంలో కోపంలేదు, మాటల్లో మందలింపులేదు. కానీ ఒక్కసారి విషయాన్ని మననం చేయాలనే ఉద్దేశంతో అంది.

వల్లీ నాలుక్కరుచుకుని- "సారీ, ఆంటీ... మీరు చెప్పిన ఏ విషయమూ నేను మర్చిపోలేదు. మీపట్ల నాకెంత అభిమానంవుందో, మీ మాటమీద అంతకంటే ఎక్కువ గౌరవం కూడా వుంది" అంది సింధుకి మాత్రమే వినపడేంత నెమ్మదిగా.

ఆపైన రెండు నిముషాలు మాట్లాడకుండా తలొంచుకుని కూర్చుంది. వల్లి.

అది చూసి- "అలా తలొంచుకుని మౌనంగా కూర్చోకువల్లీ! నువ్వు నవ్వుతూ, గలగల మాట్లాడితే బావుంటుంది... మాట్లాడు.

అవినాశ్‌గార్ని ఇంటర్వ్యూ ఏమైనా చేస్తావా" అంది తమాషాగా.

"ఊహుఁ, కానీ ఒక్కప్రశ్న అడుగుతాను" అంది అతన్ని క్రీగంట చూస్తూ.

"ఒక్కప్రశ్నే. బాబోయ్ భయంగా వుంది. ఊఁ, ఆస్క్‌మి" అన్నాడు నవ్వుతూ.

"మీ కథల్లో అమ్మాయిలపేర్లు అంత అందంగా, పెక్యులియర్‌గా, ఎక్స్‌ట్రార్డినరీగా వుంటాయి కదా! మీ శ్రీమతి పేరేమిటో తెలుసుకుందామని" అంటూ ఆగిపోయింది.

"ఓహ్, గొప్పప్రశ్నే. నా శ్రీమతిపేరు కావాలా నీకు. నువ్వు వూహించు చూస్తాను" అన్నాడు.

ఆలోచించి ఒకటి రెండు పేర్లు చెప్పింది... అతని నవలల్లో అమ్మాయిల పేర్లే గుర్తు చేసుకుని.

అవేవీ కాదన్నాడు. ఆ తర్వాత చెప్పాడు "లక్ష్మి ...వెంకటలక్ష్మి...."

సింధు, వల్లీ గట్టిగా నవ్వేశారు.



"ఆ, అబద్ధం ఆడుతున్నారు. ఒకవేళ అసలుపేరు అదే అయినా మీరు తప్పకుండా ఆమెపేరు మార్చేసేవుంటారు. చెప్పండి" అంది వల్లి.

ఓ నిముషం అతనేం మాట్లాడలేదు.

"నేను పెళ్ళి చేసుకోలేదు. మా లూసీ, అంటే కుక్కపిల్ల, నాపనులు సమస్తం జాగ్రత్తగా చూసే పావన్న వీళ్ళే నాఇంటివాళ్ళు. ఇంకేంపేరు చెప్పను" అన్నాడు. అలా అంటున్నప్పుడు అతని కంఠంలో పలికిన ధ్వని వేదనగా గ్రహించింది సింధు.

వల్లి ఆశ్చర్యపోతూ చూసింది. మళ్ళా ఏదో స్ఫురించినట్టు పెదవి విప్పబోతుంటే ఆమె తల్లి శ్రీలక్ష్మి గట్టిగా కేకపెట్టింది.

"మళ్ళావస్తాను. మమ్మీకేం తెలుసు, వచ్చిన మనిషి ఎవరో, ఏమిటో! ఒక పుస్తకం చదవదు, పేపరు చూడదు. అప్పడాలు, వడియాలు అంటూ ఇరవైనాలుగ్గంటలూ వంటగదిలో కాలక్షేపం చేసే ఈ తల్లులకి రాజీవ్‌గాంధీ అంటేనూ, అవినాశ్ అంటేనూ ఏంఅర్థమౌతుంది. ఖర్మ" అంది అక్కసుగా.

అవినాశ్ గట్టిగా నవ్వేశాడు.

వల్లి వెళ్ళిపోయింది.

"చూశారా మీరు పాఠకుల్లోకి ఎంత డీప్‌గా వెళ్ళారో! మీ కథల్లో పేర్లకు కూడా ఎంత ఇంపార్టెన్స్ ఇస్తున్నారో ఇప్పుడే వింటున్నాను" అంది.

అతనేం మాట్లాడలేదు. ఆమె మాటలవల్ల తన మనసులో చెలరేగిన కల్లోలం ఆమెకు చెప్పాలా వద్దా అనుకుంటూ మౌనంగా వున్నాడు.

"నా గతాన్ని సంజాయిషీగా చెప్పుకోడానికి రాలేదు. నేను ఇక్కడికి వచ్చాక హాయిగా స్వచ్ఛంగావున్న ఈ వాతావరణం, ద్వేషిస్తావేమోనని భయపడ్డ వాడికి సాదరమైన నీ ఆహ్వానం, నాకెంతో నచ్చాయి. నీకు కొన్ని నిజాలు వివరించాలనిపించింది" అన్నాడు.

"ఎదుటి మనిషి బాధని అర్థంచేసుకోగల సంస్కారం నాలో లేదనుకోకండి. మిమ్మల్ని చూడగానే మీ 'జ్వాల' నవలని కాల్చివేసినందుకు నాకు పనిష్మెంటేమిటో చెప్పడానికి వచ్చారనుకున్నాను. చెప్పండి నేను బాధపడను, భయపడను" అంది.

"కాదు నీకు పనిష్మెంట్‌ఇచ్చి నా జీవితాన్ని మరింత దుర్భరం చేసుకోను. కళ్ళముందు కనిపించి మురిపించిన రంగులకల, నిర్దాక్షిణ్యంగా చెదిరిపోయిన బాధవల్ల అంతర్గతంగా నాలో పరుచుకున్న లోకంమీద కసి, కార్పణ్యం నా రచనల్లోకి పాకాయి. నా రచనకు కారణం ఇదేననిచెప్పి నన్ను నేను సమర్థించుకోవడంలేదు సింధూ! నాపరిస్థితిలోవున్న ఏమనిషైనా ఇలాగే చేస్తాడని చెప్తున్నాను" అన్నాడు.

సింధు భావగర్భితంగా నవ్వింది.

"అనుభవంవల్ల మనిషి జ్ఞానవంతు డౌతాడంటారే! మీరేమిటి ఇలా వెనక్కి వెళ్ళటం" అంది.

"లేదు అనుభవంలో రుజువైన చెడును మంచిగా సమర్థించటం నావల్లకాలేదు. చెడునే ఆదర్శంగా ప్రచారం చేయాలని నా ఆలోచనల్ని అంతహేయంగా సృష్టించాను. నా ఆశ, ఆశయం ఇచ్చిన ఫలితాలు నన్నే ఆశ్చర్యంలో ముంచాయి. సంచలన రచయితగా నన్ను కీర్తించటంచూస్తే నాకే ఆశ్చర్యం కలిగింది. అనుక్షణం సమస్యలతో వేధింపబడే మనిషికి నా రచనలు ఊరట కలిగిస్తున్నాయని గ్రహించి, నాలాంటివాళ్ళు చాలామంది ఈ లోకంలో వున్నారనే విచిత్రమైన తృప్తితో మనసు నిండింది. సంఘానికి నైతిక విలువలతో సంబంధం లేనప్పుడు ఏరకమైన రచనలైనా ఒక్కటే అనుకుని నన్ను నేను సమర్థించుకున్నాను.

ఒకవిధమైన మైకంలో బతుకుతున్న నాకు నీ మాటలతో నాలోని నిజమైన భావుకుడు నిద్ర లేచాడనిపించింది" అన్నాడు.

"చాలా అద్భుతమైన శైలితో రాయగలిగిన మీరు వ్యక్తిగత జీవితాన్ని సాహిత్యంతో ముడిపెట్టి ప్రజల్ని మరింత ఆలోచనా రహితుల్ని చేయటం నేను సహించలేకపోతున్నాను.

మీకు తెలీదుగానీ మీ రచనల ప్రేరణతో నా కొలీగ్ మాలతి తమ్ముడు ప్రస్తుతం జైలు శిక్ష అనుభవిస్తున్నాడు" అంటూ జరిగిపోయిన

సంఘటనలను అతనికి వివరించింది.

అవినాశ్ హతాశుడై విన్నాడు. బాధపడ్డాడు. చాలా సేపటివరకు అతను మాట్లాడలేకపోయాడు.

సింధూయే మళ్లీ అంది.

"మారుతున్న కాలంతోపాటు, ప్రజల ఆలోచనలు మారుతున్నాయి. హితాన్ని మాత్రమే బోధించాల్సిన సాహిత్యం ఎటుపోతోందో అర్థం కావటంలేదు. జాతిని జాగృతం చేసేది సాహిత్యమే అయినప్పుడు... జాతిని నిర్వీర్యం చేస్తున్న ఈ సాహిత్యం యొక్క రూపురేఖలు మార్చాల్సిన బాధ్యత తప్పకుండా మీ రచయితలమీదే వుందంటాను నేను." అంది సుతిమెత్తగా.

"మీలోవున్న టాలెంట్... మీ రచనల్లో శిల్పం, ఫ్లో నన్నెంతగానో ఆకట్టుకుంటుంది. నివురుగప్పిన నిప్పులా మీలో దాగివున్న ఉన్నతత్వం వెలికి రావాలనీ, ఆ టాలెంట్‌తో అద్భుతమైన రచనలు సృష్టించగలరని గ్రహించే, నిన్నంకో చంగా చెప్పాను" అంది ఒక్క నిముషం ఆగి, కుర్చీలోంచి దిగి మోకాళ్ళమీద కూర్చుని, అతని చేతులు పట్టుకుని ఉద్వేగంగా అడిగింది.

"అవినాశ్... నా ఆలోచనల్నీ నా తపననూ అర్థం చేసుకోండి. మీ నవల కాల్చి బూడిదచేసినందుకు నాకెలాంటి శిక్ష వేయాలనుకుంటున్నారో తెలియదుకానీ, అందుకు నేను భయపడటంలేదు. ప్రాధేయపడను. కానీ నా నివేదనను అర్థంచేసుకోండి. మీనుండి నేకోరుకునే రచనలు రావాలి.

మీరు రాసిందే వేదం, నాదం అని భావించే పాఠకుల్ని మీరే సమాధాన పరచగలరు. తరంమారినా... మారిన తరానికి కూడా ఉపదేశంలా, చరిత్ర వున్నంతకాలం చెప్పుకునే సాహితీకారుల పేర్లలో మీరూ ఒకరు కావాలని నాకోరిక. అలాంటి ఉత్తమ నవలలను మాకందించండి. ఇది నాఒక్కదాని కోరిక మాత్రమేకాదు. నాలాంటి వందల వేలమంది కోరిక".

మనసు మూగదై మాటరానట్టు వుండిపోయాడు అవినాశ్.

"నా జీవన యాత్రలో ఓడిపోయి, అలసిపోయిన నేను... సాహిత్యానికి నిజమైన నిర్వచనం ఇచ్చే కథని సృష్టించలేకపోయాను. నేకోల్పోయిన తృప్తిని, ఆనందాన్ని దైవకానుకగా భావించే సాహిత్యంలోనైనా దొరుకుతాయేమోననే తపన ప్రారంభమైంది నాలోనూ.

ఈ తపన, ఆలోచన నాలో ప్రేరేపించింది నువ్వే. అందుకు నిన్ను ఎలా అభినందించాలో అర్థంకావటంలేదు సింధూ. నా సాహితీ ప్రపంచంలో కొత్త మలుపు నీ ఇన్‌స్పిరేషనే! నిజం" అన్నాడు.

సింధు అతని మాటలకి కదిలిపోయింది. ఆనందంతో ముఖం విప్పారింది.

"థాంక్స్ అవినాశ్, చాలా థాంక్స్" అంది అంతకంటే ఆమెకు మాటలు దొరకటంలేదు.

ఆమె కళ్ళల్లో మెరిసేకాంతి, అనుకున్నది సాధించానన్న తృప్తి కనిపించాయతనికి.

"నువ్వు రిజైన్ చేయడంగానీ, ఎడిటర్ జయరామ్ నిన్ను రిజైన్ చేయమనడం కానీ జరగదు. నీలాంటివాళ్ళు ఎడిటర్స్‌గా వుండటంవల్ల, ముందు ముందైనా పత్రికలస్థాయి, విలువ పెరుగుతాయని ఆశించవచ్చునేమో!" అన్నాడు.

సింధు నవ్వి వూరుకుంది.

ఇద్దరూ చిరకాల మిత్రుల్లా చాలాసేపు మాట్లాడుకున్నారు. అప్పటివరకు ఇరువురి ఆలోచనలు వేరైనా... ఇప్పుడు చేరుకోవాలనుకునే గమ్యంమాత్రం ఒక్కటేనని తెలిశాక ఒకరి పట్ల ఒకరికి ఆప్యాయత, అభిమానాలు జనించాయి.

ఉద్యోగానికి రిజైన్ చేసేయాలని నిర్ణయించుకున్న తన ఆలోచనకు స్వస్తి చెప్పింది అంతటితో.

ఆరాత్రి మురళితో చెప్పింది అవినాశ్ వచ్చిన విషయం. అతనికి ఎక్కడలేని ఆశ్చర్యం వేసింది. పాఠకుల్లో తిరుగులేని రచయితగా స్థానాన్ని ఆక్రమించుకున్న ఓ సంచలన రచయితలో.. తన భార్య మాటలకి పరివర్తన కలిగిందంటే విచిత్రమైన విషయంగా తోచింది.

సింధు చెప్పింది. 'అతని ఆలోచనా దృష్టిలో మార్పుకి కారణం తను కాదనీ అంతకు

ముందు అతని జీవితానుభవాల తాలూకు ప్రభావమని ఏదియేమైనా ఈ సంఘటన అతనికి నమ్మశక్యం కాకుండావుంది. అతని నిర్ణయాలను అమలు పరచటం విషయంలో అపనమ్మకం ఏర్పడింది.

సంవత్సరానికి అతను రాసే నవలలు, వాటిమీద అతనికొచ్చే ఆదాయమూ, సినిమాలమీది ఆదాయము ప్లస్ అతనిమీద క్రేజ్ తగ్గేలోపు అతను రాయగలిగిన మొత్తం నవలలు... వాటిమీద ఆదాయమూ లెక్కించి, సింధుకి వినిపించాడు.

"మైగాడ్" అంటూ కళ్ళు వెడల్పుచేసి గుండెమీద చేయివేసుకుంది.

"మురళీ... అతను చేసిన త్యాగం చాలాగొప్పదే. ఆదాయమే ఆనందంగా భావించేరోజులివి". అని 'హేట్సాఫ్ అవినాశ్' అనుకుంది అభినందనగా.

మురళికి భార్యను చూస్తుంటే ఓపక్క అభిమానంగానూ, మరోపక్క విచిత్రంగానూ అనిపించింది.

తనవంకే తదేకంగా చూస్తున్న భర్తని చూసి— "ఏమిటాచూపు" అంది మందలింపు, కొంటెతనం కలగలిపి.

ఆమె చేతిమీద తనచేయివేసి మృదువుగా నొక్కాడు. "నీలాంటి వ్యక్తిత్వంవున్న అమ్మాయి దొరకటం నా అదృష్టం" అన్నాడు ఆమెను దగ్గరకు తీసుకుని.




ఆ మరునటిరోజు ఆఫీసుకువెళ్ళింది సింధు. స్టాఫ్ అంతా ఆమెను అడగటమే 'హౌడేర్‌యూ బిహేవ్ లైక్‌దట్' అని. ఆ సంఘటనగురించి ఆమె ఎక్కువగా మాట్లాడలేదు.

తనపనిచేస్తూనే ఎడిటర్ జయరామ్‌నుంచి పిలుపు ఎప్పుడొస్తుందా అని ఎదురుచూస్తోంది. పన్నెండుదాటాక ఎప్పుడో పిలిచాడాయన.

ఎదురుగా నిలబడ్డ సింధుని చూసి, జరిగిపోయిన సంఘటన గురించి ప్రస్తావించకుండా, మొన్నటిలా మరోసారి ప్రవర్తించవద్దనీ, అందువల్ల తమ పత్రికకు, తనకూ ఎంత చెడ్డపేరు వస్తుందో... ఆమెకు నచ్చచెప్పేధోరణిలో మాట్లాడాడు.

అయితే ఆయనమాటల్లో ఇదివరకటి ఆప్యాయత, మందలింపు ఇవేవీ ధ్వనించకపోవటం సింధు గమనించకపోలేదు. కానీ, వాటిని గురించి ఆమె బాధపడదల్చుకోలేదు. అందుకే మౌనంగా వచ్చేసి తన సీట్లో కూర్చుండిపోయింది.

సాయంకాలం నాలుగ్గంటల ప్రాంతంలో హరనాథ్ వచ్చాడు ఆఫీసుకి.

వస్తూనే సింధుని పలకరించాడు ఆప్యాయంగా.

"మీరు కన్పించి చాలాకాలమైంది. ఎందుకు రావడంలేదు" అంది నవ్వుతూ.

"అఁ, ఏదోస్తబ్దత. ఒక్కోసారి ఎక్కడికీవెళ్ళాలనిపించదు. ఎవరితోనూ మాట్లాడాలనీ అనిపించదు. సోమరిగా గడిపేయడమే రోజులు" అన్నాడు.

ఆమెనవ్వి— "ఇప్పుడు ఆ స్థితిలో లేరుగా?" అంది.

'ఏం' అని అడిగాడు మామూలుగా.

"ఆస్థితిలో లేకపోతే మీతో మాట్లాడదామనీ! వుంటే సోమరిగావుండటమంటేఎలాగో తెలుసుకుందామనీ" అంది.

అతను గట్టిగా నవ్వేశాడు. అతని నవ్వుతో శృతికలిపింది సింధు.

"అలా బైటికి వెళ్ళి కాంపౌండ్‌లో కూర్చుందాం. ఇక్కడ ఉక్కగావుంది" అంది.

అతనేం సమాధానం చెప్పకుండా ఆమెతో

నడిచాడు. హరనాథ్ అంటే ఆమెకు అభిమాన మనీ, అతను ఆఫీసుకి వచ్చినప్పుడల్లా గంట లుగంటలు అతనితో మాట్లాడుతూ కూర్చోడం ఆఫీసులో అందరికీ తెలును.

"చెప్పండి... ఏంరాస్తున్నారు కొత్తగా" అని అడిగింది అక్కడున్న బెంచీమీద కూర్చుని.

"నథింగ్. ఏదైనా రాయాలని ఆలోచిస్తు న్నా" అన్నాడు.

"రాయండి. మా పత్రికలో కథలపోటీ పె ట్టాంకదా! మీకు కథలంటేనే ఎక్కువ ఇంట్రస్టు కాబట్టి మంచి కథ ఒకటి రాయండి" అంది.

అతను నవ్వాడు.

"పోటీల కోసమని కూర్చుంటే నాకు మూడ్ రాదు. ఇన్‌స్పిరేషన్ ఉండదు. పాఠకుల మన సుని తాకేలా చెప్పగలగాలంటే ఇవన్నీ ఉండాలి. కథరాసేటప్పుడు దానికి సంబంధించిన అంశాల్లో లీనంకావటంతప్ప, టైమ్‌గురించికానీ, పేజీలగురించికానీ, పోటీల గురించికానీ నేనాలోచించను. అంతగా లీనమై తేతప్ప నేను రాయలేను" అన్నాడు సిగరెట్ అంటించుకుని.

"కథలో లైఫ్‌ని రిప్రెజెంట్‌చెయ్యడానికి కా వలసిన మనోలక్షణాలలో మీకున్న చైతన్యం నాకు సంతోషాన్ని కల్గిస్తుంటుందండీ"

"ఒక్కచైతన్యమే కాదు సింధూ! లైఫ్‌ని రిప్రజెంట్ చెయ్యడానికి అవగాహన అనే ప్రిజమ్ ద్వారా బయటకు వచ్చినప్పుడే రచ యితకి ఒక ఇండివిడ్యూయాలిటీ వస్తుంది. వీటితోపాటు ప్రత్యేకత, ఒక స్థాయిరావాలంటే అతనిలో డిస్‌పారిటీ అనేది వుండకూడదు. చాలాబాగా రాశాడూ, మంచి అవగాహనతో రాశాడూ అని మనం అనుకునే రచయితల్లో ప్రోగ్రెసివ్ ఐడియాస్ వున్నాకూడా ఈ సంకు చితం అనే లక్షణం కనిపిస్తూనే వుంటోంది. అది గమనించి అంచనా వేయాలి" అన్నాడు.

మళ్ళా తనే అన్నాడు వెంటనే!

"మంచిని రాసే రచయిత అన్నీ గొప్పవిష యాలే చెప్పలేకపోవచ్చు. తను చెప్పేవిషయా నికీ, వున్నవాస్తవానికీ సమన్వయం కుదరకపో వచ్చు. అలాంటి సందర్భాల్లో ఆ రచయితని తక్కువగా అంచనావేసి దులిపేయకూడదు" అని నవ్వాడు.

సింధు కూడా నవ్వింది. తనకు కాస్త ఆవేశం ఎక్కువనీ, అందుకనే ఆయన నవ్వు తున్నాడనే విషయం, ఆమెకు తెలును. అది గమనించి ఫ్రీగా నవ్వేసింది.

సింధు అంటే అతనికి ప్రత్యేకమైన అభి మానం. కాలక్షేపానికి చీరలో నగలో... అదీకాక పోతే ఒకరిమీదఒకరు అపవాదులు వేసుకో డమో చేసే ఆడవాళ్ళకు భిన్నంగా, విశిష్టమైన వ్యక్తిత్వం వున్న అమ్మాయిగా సింధు అంటే ఇష్టమతనికి. అందుకే ఆమెతో చాలా ఇంట్ర స్టుగా మాట్లాడతాడు.

"సినిమాలేం చూశారు?" అంది. అతను సినిమాలు చాలాఎక్కువ చూస్తాడు. అతను బావుందీ అని ఏదైనా పిక్చర్‌ని సజెస్ట్ చేస్తే తప్పకుండా చూస్తుంది సింధు. అందుకే అడి గింది.

"అన్నీచూసేశాను. 'ప్రేమ' తప్పమరోసమ స్యగానీ, థీమ్‌గానీ లేనట్టు అన్నీ దానిచుట్టు అల్లుకున్నకథలే! ప్రేమ, పెళ్ళి వీటిగురించి రాయకూడదనీ, తీయకూడదనీ నేననటంలే దుకానీ, దాని విలువని పరిగణిస్తే బావుంటుంది. అదేంవుండదు. ప్రేమలోపడ్డ ఇద్దరు యువతీయువకులు, ఎంతసేపూ, విరహం, తాపం అంటూపాడుకోడం, 'ట్ర యాంగిల్‌లా' త్యాగాలగోల. ఏమిటో! చిరాకు, కడుపులో తిప్పినట్టు వుంటాయి ఆ త్యాగాలు. మనకర్థంకావులే సినిమావాళ్ళ ప్రేమలు" అన్నాడు చేతిలో సిగరెట్ అవతల పారేస్తూ.

సింధు పకపకనవ్వింది.

★ ★ ★

ఒకరోజు సింధు ఆఫీసులో ఎడిట్‌చేసి ప్రెస్‌కి పంపించాల్సిన కథలతో కాస్త బిజీగావు న్న సమయంలో పక్కటేబుల్ దగ్గర కూర్చున్న రాంప్రసాద్ ఆమెను పిల్చాడు.

సింధు అతనివైపు చూసింది.

అతని పక్కనే ఛైర్‌లో కూర్చున్న ఓ అపరి చిత వ్యక్తిని చూపించి — "సింధూ... ఈయన మీకు తెలుసా?" అని అడిగాడు.

సింధు అతనివైపు తలత్రిప్పి చూసింది. మనిషి చామనఛాయ అయినా కళగావుండే

ముఖం. పెదవులమీద ఎప్పుడూ చిరునవ్వు కదలాడుతూ వున్నట్టనిపిస్తుంది. వయసు నల భైఏళ్ళుండవచ్చునేమో, మనిషి మాత్రం చాలా చురుగ్గా కనిపించాడు.

సింధుని చూసి — 'నమస్కారం' అంటూ చేతులు జోడించాడు.

'నమస్తే' అని రాంప్రసాద్‌ని చూసింది ఎవరన్నట్టు.

"యన్.కె.మూర్తి అనే పేరుతో కథలు అవీ వస్తుంటాయి. మీరు చదివే వుంటారు. ఆయనే వీరు" అన్నాడు.

ఆ పేరుతో కథలుగట్రా ఏంవచ్చాయో, ఎన్నివచ్చాయో గుర్తుతెచ్చుకోడానికి ప్రయ త్నించింది కానీ, సాధ్యంకాలేదు.

ఏమో చదివినా, మర్చిపోయానేమో అను కుని — "ఆహాఁ... ఇప్పుడేం రాస్తున్నారు?" అంది పెదవులమీదికి నవ్వు తెచ్చుకుని.

అలా అడగకపోతే బావుండదని అడిగింది అంతే! అందుకతను తను కూర్చున్న ఛైర్ లోంచి లేచి, సింధు టేబుల్ దగ్గరకు ఒక్క గెంతుగెంతి వచ్చి కూర్చున్నాడు.

అదిరిపోయింది సింధు.

టేబులుమీద చేతులానించి ముందుకు వంగి అన్నాడు —

"ఏం రాస్తున్నారని అడిగారు కదూ! ఏంచె ప్పమంటారులెండి. వ్యాసాలు, కథలు, నవల లు, కవిత్వం సమస్తం ఏదైనా రాయగలను" అన్నాడు.

"ఆహాఁ," అని ఆగి — "విశ్వ శ్రేయస్సు కోసం కావ్యం అన్నారు పెద్దలు. అలాంటి ఓ కావ్యం రాయకూడదూ మీరు!" అంది.

"రాస్తాను. కానీ టైమేదీ! పగలు, రాత్రి కూడా కూర్చుని రాయాలనీ, అవినాశ్‌లా సాహిత్య ప్రపంచాన్ని ఒక్కఊపు వూపేయా లనీ నాఆశ. నేనసలు తలచుకోవాలేకానీ, అవి నాశ్ ఎంతటి వాడనీ! అలా కలం పట్టుకుని కూర్చుంటానో లేదో ఫోన్లమీదఫోన్లు... అందులో అభిమానులనుంచీ వచ్చేఫోన్లు. ఇవీ కాకుండా ఉత్తరాలు... అభిమానుల ఉత్తరాలకు జవాబు రాయకపోతే వాళ్ళు బాధపడతారు. శపిస్తారు. అందుమూలంగా గంటల టైము వేస్టవు తుంది. అయినా తప్పదుకదా!" అన్నాడు.

అతనేం చెప్పాలనుకుంటున్నాడో ఆమెకు అర్థంకాలేదు.

"అందువల్ల... ఎక్కువగా రాయలేకపోతు న్నానంటారు. అంతేనా" అంది వ్యంగ్యంగా

"ఆఁ, కరెక్టే... అందువల్లే నేను రాయలేక పోతున్నాను. కానీ రాస్తాను. ఓ అద్భుతమైన నవలకి ప్లాట్ ఆలోచిస్తున్నా. అది మీ పత్రిక లోనే సీరియల్‌గా రావాలని నా ఆకాంక్ష. మీ ఆకాంక్ష కూడా అదేనని నాకు తెలుసు. పెద్ద పిటీ ఏమిటో మీకు తెలుసా" అని ఆగి, కాస్త ముందుకువంగి — "మీకు తెలుసో లేదో, నేను చాలా సాహిత్యసేవ చేస్తుంటాను. అదోపిచ్చి. దానివల్లకూడా కొంత సమయం వృధా అవు తుంటుంది మరి" అన్నాడు.

"సాహిత్యసేవ అంటే...?"

"ఎలాగా అని అడుగుతున్నారా! తమ కథలు పత్రికల్లో పడకో; లేక తమ కథలకు సరైన ఆదరణ లభించకో బాధపడే రచయిత లకు, రచయిత్రులకు సాహిత్య ప్రపంచంలో ఒక స్థానాన్ని కల్పించటం. ఎందుకో అది నా బాధ్యతగా అన్పిస్తుంది. కొంతమందిలో నివు రుగప్పిన నిప్పులా, చాపకింద నీరులా టాలెంటు వుంటుంది. కానీ పైకి కనపడదు. పాపం ఆ టాలెంట్‌ని ఎవరూ గుర్తించకపోతే వాళ్ళు నష్టపోవటమేకాదు, సాహిత్యరంగమే ఆణిముత్యాల్లాంటి కథల్ని పోగొట్టు కుంటుంది. అందుకనీ..."

అతనికి వాక్ప్రవాహం అంతటితో ఆగింది. గట్టిగా నిట్టూర్చాడు. తనలోని సాహిత్యాభిలా షకూ, మట్టిలో మాణిక్యాలను ఏరి పత్రికలకు అందిస్తున్న తన సాహితీసేవకు ఆమె అబ్బుర పడిపోతూ వుంటుందనుకున్నాడు.

ఆ రెండు నిముషాల్లోనే సింధుకి అర్థంఅ యిపోయింది అతని తత్వం. అంతటితో అత న్ని బ్రేక్‌చేయకపోతే తనపని ఔట్ అనుకుంది.

అందుకే అంది — "మీ సాహితీసేవకు ధన్యవాదాలు. మీతో ఎక్కువగా మాట్లాడ్డానికి నాకే భయంగావుంది. ఎందుకంటే — 'ఇంట్లో ఈగలమోత బైట పల్లకీలమోతనీ' ఇంట్లో

అభిమానుల తాకిడి, బైటకొస్తే మాలాంటివాళ్ళ డిస్టర్బెన్స్! ఇంక మీరెలా రాయగలరు! కాబట్టి శెలవు తీసుకుంటున్నాను" అంది. అసహనంగా ఫైల్లోకి తలదూర్చుతూ.

అతను కంగారుపడిపోయాడు.

"నో, నో, నో అలా అనకండి... మీక్కూడ సాహిత్యంపట్ల ప్రత్యేకమైన అభిమానమని, విలువ అనీ రాంప్రసాద్ చెప్పారు. మీలాంటి వారితో పరిచయం నా అదృష్టంగా భావిస్తాను. కథలు రాయకపోతే ఏమైంది? మంచి పుస్తకం చదవటం మంచి స్నేహంతో సమానమని అంటారు కదా! అలాగే మంచి స్నేహితునితో పరిచయం మంచి పుస్తకం చదివిన లెక్క. కాబట్టి మీరలా అనకండి. నాగుండె ఆగిపోతుంది" అన్నాడు అదోలాచూస్తూ.

ఎందుకో ఆ చూపు ఆమెకు అలర్జీగా అనిపించి అప్రయత్నంగా మొహం చిట్లించింది.

ఈ జిడ్డుని తనకెందుకు అంటించాడో అర్థంకాక రాంప్రసాద్‌కేసి చూసింది.

అప్పటివరకూ వారినే గమనిస్తున్న రాంప్రసాద్... మూర్తిపడే అవస్థకు నవ్వుకుంటూన్న అతను సింధు సీరియస్‌గా తనని చూసేసరికి పనున్నవాడిలా తలొంచుకున్నాడు.

సింధు మూర్తివైపు తిరిగి — "రచయితగా మంచిపేరు తెచ్చుకోవాలనీ, సమాజానికి సాహిత్యసేవ చేయాలనే మంచి ఉద్దేశాలు కలవాళ్ళు మనలో ఎక్కడున్నారు? నాతోనో, మరొకరితోనో కాలక్షేపం చేస్తూ కూర్చుంటే మీకు ఆనందమే అయినా, సమాజం ఒక మంచి సాహితీవేత్తను మిస్సవుతుంది. నాలాంటి సాహిత్యాభిలాష కలవాళ్ళు అది భరించలేరు" అంది ఓరగా అతని ముఖకవళికలు గమనిస్తూ.

అతను గట్టిగా నవ్వేశాడు.

"మీరు భలే మాట్లాడతారు. చాలా మంది చెప్పారు మీ గురించి. అందుకే మీ పరిచయం కోసం ఉవ్విళ్ళూరాను" అన్నాడు సంతోషం పట్టలేనట్టు.

సింధు చిరునవ్వు నవ్వింది. అప్పటికి ఏదో ఒక సమాధానం చెప్పి అతని బారినుండి తప్పించుకోవాలని ఆమె ఉద్దేశం. అసలు రాంప్రసాద్ తనింత బిజీగా వున్నానని తెలిసీ... ఇంత ఆత్మస్తుతి మనిషిని తనెలా రిసీవ్ చేసుకుంటానో కూడా తెలిసీ పరిచయం చేశాడంటే ఏదో విశేషమే వుండి వుంటుంది అనుకుంది.

"సారీ... ఒక్క పది నిముషాలు కూర్చుంటారా? ఎడిటర్‌గారు పిలుస్తున్నట్టున్నారు వెళ్ళివస్తాను" అంది.

"ఆఁ, కూర్చుంటాను. మీరు వెళ్ళిరండి" అన్నాడు చలనం లేకుండా.

ఈ బాధ ఇప్పటితో తప్పేట్టులేదనుకుని "ఈ కథలన్నీ ఆయనకు సబ్మిట్ చేయాలి. వాటిగురించి మాట్లాడ్డంలో లేటయినా మీరేమనుకోకండి. మరోసారి కలుద్దాం ఉంటాను" అతని సమాధానం కోసం కూడా చూడకుండా వెళ్ళిపోయింది.

ఆమె ధోరణికి అతని హావభావాల్లో దుగ్ధచేరింది. అందుకే ఆమె వెళ్తుంటే నుదురు చిట్లించి చూశాడు.

రెండు నిముషాలు అలాగే కూర్చుని, ఆపైన లేచి రాంప్రసాద్ దగ్గరకి వెళ్ళాడు.

"ఏమిటీవిడ. ఏదో లుక్ బావుందని కాస్త కాలక్షేపంగా మాట్లాడితే ఫోజు కొడుతుంది. నాలాంటివాడు వచ్చి, మీ పరిచయం కావాలి అని కోరటం ఆమె అదృష్టమని తెలియటంలేదు. అహర్నిశలూ నా సహాయ సహకారాల కోసం తిరిగే అమ్మాయిల సంగతి చెప్తే అప్పుడు తెలుస్తుంది మనమేమిటో, మన లెవలేమిటో! చెప్తా... చెప్తా. ఏదో ఒక మాస్టర్‌ప్లాన్ వేయలేకపోతానా, అప్పుడు నా చుట్టూ తిరక్కపోతుందా" అన్నాడు అక్కసుగా.

"ఆమె కథలూ అవీ ఏంరాయదు. మంచి అండర్‌స్టాండింగ్. అంతే!" అన్నాడు రాంప్రసాద్ నవ్వి.

"ఆమె నాలాంటివాణ్ణి గుర్తించేలా చేయడానికి కథలు, అవీ నే రాయాలటయ్యా! ఏంఅవసరంలా! చూస్తుండు. ఆమె పొగరెలా అణచాలో నేను చూస్తాను. అవినాశ్ నవలేదో కాల్చి అవతల పారేసిందటగా! అది విని, ఆనందించి ఆమెతో పరిచయం చేసుకోవాలనుకున్నాను" అన్నాడు వగురుస్తూ.

"ఏం! ఆయనకీ, మీకూ పడదా!" అన్నాడు.

"అంత చిన్నవయసులో... పాఠకుల్లో అంతటి స్థానాన్ని పొందటం ఎలా సహించగలం! ఏదోవిధంగా అతన్ని దెబ్బతీయాలని నాకోరిక" అన్నాడు.

"ఆమెలో తెచ్చిపెట్టుకున్న వినయం, గొప్పలు చెప్పుకోడం ఇవేమీ వుండవు. ఏ విషయాన్నైనా ధైర్యంగా చెప్తుంది, చేస్తుంది" అన్నాడు రాంప్రసాద్ ఆమె వ్యక్తిత్వాన్ని అతనికి తెలియజేయాలని.

"అయితే నాకు భయమా... ఇలాంటివాళ్లని ఎంతమందిని చూశాను" అన్నాడు తేలిగ్గా.

"సింధు... మీరనుకునే తత్వం గల అమ్మాయి కాదు. చాలా రాఫ్" అన్నాడతను.

అతని మాటలకి మూర్తి ముభావంగా వున్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. రెండు నిము



షాలు కూర్చుని రాంప్రసాద్‌కి చెప్పి బైటికి నడిచాడు.

అతను వెళ్లిపోయాక సింధు వచ్చి తన సీట్‌లో కూర్చోబోతూ, గుర్తొచ్చి రాంప్రసాద్ దగ్గరకు నడిచింది.

"ఏమిటీ! ఈ ఉదాత్త పురుషుణ్ణి నామీదకు తోలారూ... మీకేం తోచటంలేదా!" అంది నవ్వి.

అతను గట్టిగా నవ్వాడు.

"అతనికో బలహీనత వుందని విన్నాను సింధూ! రచయిత్రులు కావాలని తాపత్రయ పడే అమ్మాయిలతో పరిచయం చేసుకుని, వాళ్ళు రాసిన కథలు, నవలలు పట్టుకుని పత్రికాఫీసులచుట్టూ తిరుగుతుంటాడు. బాగా డబ్బుంది. ఆ డబ్బుకీ, పరపతికీ ఆత్మవంచన చేసుకుని, అడుగులకు మడుగులొత్తే మనుమ లెక్కడలేరు? పర్యవసానంగా ఈ అయోమ యపు కథలు, నవలలు అవలీలగా పత్రికల్లోకి ఎక్కేస్తున్నాయి. ప్రతిభ, సామర్థ్యంవున్న కథ లు మరుగునపడి, అవి లేని కథలు కొన్ని ఇలా వెలికివస్తున్నాయి. ఏంచేయగలం మనం!" అన్నాడు నిరాశగా.

సింధు ఆశ్చర్యపోతూ విన్నది.

"ఇతను ఇంతకుముందెన్నడూ కన్పించలేదే" అని అడిగింది.

"వచ్చాడు... ఆ సమయంలో మీరు లీవ్‌లో వుండటమో, సీట్‌లో లేకపోవడమో ఏదో జరిగింది. అందుకే అతని దర్శనభాగ్యం లభించలా! అతనితో నాకున్న కాస్త పరిచయానికీ ఇవాళ ఎందుకో గొడవపెట్టాడు మిమ్మల్ని పరిచయం చేయమని.

విశేషమేమిటో తెలీదుకానీ, కేవలం ఆడవాళ్ల కథలకోసమే పాకులాడ్డం, ఆడవాళ్ళ పరిచయాలకోసమే కొట్టుకుపోవడంచూసి అదో బలహీనతేమో అనిపించింది నాకు" అన్నాడు.

"ఇలాంటివాళ్లని జయరామ్‌గారు చేరనివ్వడం ఏమిటి?" అంది కాస్త సీరియస్‌గా.

"ప్రత్యేకమైన కారణమంటూ నేను చెప్పలేనుగానీ ఈ సామాజిక వ్యవస్థలో ఇవన్నీ మామూలే సింధూ! మీరు అవేం ఆలోచించకండి. అందర్నీ ఒకేచూపుతో చూసే ఎన్కేమూర్తికి మిమ్మల్ని పరిచయంచేస్తే, కాస్త ఆ చూపులో మార్పు వస్తుందేమోఅని అతను అడగ్గానే మిమ్మల్ని పరిచయం చేశాను. సారీ" అన్నాడుమృదువుగా.

"నథింగ్‌టు వర్రీ. మూర్తిలాంటి మనుమలుంటారని తెలుసుకానీ, పుస్తకంలో తమపేరు చూసుకోడంకోసం, ఇలాంటి మనిషికి లేనిపోని ప్రత్యేకతలు ఆపాదిస్తున్నవాళ్ళు కూడా వున్నారంటేనే బాధగావుంది. అయినా ఆడవాళ్ల కథలు వేయించి ఈయన వారినుంచి ఆశించేదేమిటో?" అంది అనుమానంగా.

చేతులు రెండూ ఊపుతూ— "నాకు తెలీదండీ బాబోయ్. అదేమిటో నావరకూ రాలేదు" అన్నాడు భయం నటిస్తూ.

సింధు నవ్వింది. "అయినా అలా ఎంతకాలమని అతనిద్వారా కథలు వేయించుకుంటారు. పాఠకుల్లో గుర్తింపెలా వస్తుంది?" అంది సందేహంగా.

అతను నుదుటిమీద కొట్టుకుని— "అయ్యో... మీరు చాలా తెలివిగలవాళ్లనుకున్నాను. చాలా పిచ్చివాళ్ళుకూడానన్నమాట. మీలాంటివాళ్ళే పాఠకులు కూడాను. ఆవిధంగా పదోపదిహేనో కథలు వచ్చి ఆపైన ప్రఖ్యాత రచయిత్రులైనవాళ్ళున్నారు. ఆమధ్య మీరు రిజెక్ట్‌చేసిన ప్రవీణాదేవి కథ మన పత్రికలో రాలేదూ! అది ఎవరి మహిమనుకుంటున్నారు. ఈయనే! వాళ్ళిద్దరికీ మంచి స్నేహం" అన్నాడు.

సింధు గుండె వేగంగా కొట్టుకుంది. ఎందుకో అవన్నీ వింటుంటే జుగుప్సగా, చిరాగ్గా అనిపించింది.

"పాఠకులకి ఆ కథ ఎలా వచ్చిందీ, బాగ్రౌండ్ ఏమిటీ అనేది ఎలా తెలుస్తుంది. ఏదో చదివేస్తారు. ఎక్కడో ఏదో సన్నివేశం నచ్చుతుంది. అంతే! ఆకాశానికెత్తేస్తారు. భయంకరమైన అభిప్రాయాలతో, అభిమానాలతో వందలకొద్దీ ఉత్తరాలు. ఆ రచయిత్రికి పీఠం దొరికినట్టే! ఇహ అప్పటినుంచి మొదలౌతుంది పాఠకుల్ని హింసపెట్టడం. అదో వేవ్... అది తగ్గేలోపు మరొకరు పునాదులు వేసుకుంటారు. ఈలోపు వాళ్లకు కాస్త పేరుఅదీ




వచ్చి, తనకింత పేరు రావటానికి కారణమైన మనిషిని కాలదన్నటమో, కన్నెత్తి చూడకపోవటమో జరుగుతుంది. అవిడంతు చూస్తాను, ఈమె కథలెలా వస్తాయో చూస్తానంటూ ఈయన రంకెలు వేయటం, అబ్బో, పెద్ద గోలలెండి" అన్నాడు నవ్వుతూ.

ఆమె భారంగా తల విదిలించింది.

"ఇవన్నీ వింటుంటే చాలా భయంగా, బాధగా వుంటుందొక్కోసారి. జీవితంలో ఒక ముఖ్యభాగమైన సాహిత్యం ఇంత అవినీతిలో మునిగిపోయిందేమిటా అని నా బాధ. ప్రక్షాళన చేయటం సాధ్యమయ్యేవనే కాదేమో అనే డిప్రెషన్ వచ్చేస్తోంది" అంది వేదనగా.

ఆమె మానసిక వేదన, సంచలనాన్ని అర్థంచేసుకున్న అతను ఆమెను సమాధానపరిచే ప్రయత్నంగా అన్నాడు.

"ఏ రంగంలో చూసినా అణువణువునా స్వార్థపూరిత శక్తులు పేరుకుపోయాయి. అందువల్ల ఎదురయ్యే సమస్యల్ని ఎవరూ ఎదుర్కోలేరు. ఆలోచిస్తే ఆవేశం తప్ప మరేమీ మిగలదు. ఈ విషయం మర్చిపోండి ఇంక" అన్నాడు.

సింధు ఏంమాట్లాడలేకపోయింది. అలాగే కూర్చుంది చాలాసేపు.

★ ★ ★

ఎన్కేమూర్తి గురించి మురళికి చెప్తూ— 'ఎడిటర్ జయరామ్‌పట్ల తనకుగల అభిమానం, ఆయన నిజాయితీపట్ల ఆశ్చర్యాన్ని వివరిస్తూ... అలాంటి ఉన్నతమైన వ్యక్తి ఇప్పుడు...' అంటూ ఆమె ఏదో చెప్పబోతుంటే మురళి వారించాడు.

"సింధూ... మీ ఆఫీసు విషయాలు నాకు చెప్పొద్దు. నీ తత్వానికి సరిపడే మనుషులు చాలా తక్కువగా వుంటారు. నువ్వు ఆశ్చర్యపడి, ఆవేశపడినంతమాత్రాన ఎవరూ మారరు. అందుకే అనవసరపు హైరానా పడద్దని చెప్తున్నాను" అన్నాడతను.

సింధు ఆ మాటలకు కాసేపు అలిగినా తర్వాత నవ్వుతూ గడిపేసింది అతనితో.

ఒక ఆదివారం వంటల పుస్తకం దగ్గర పెట్టుకుని ఏదో స్వీట్ తయారుచేసే మూడ్‌లో వుంది. అది పూర్తిచేసి ప్లేట్స్‌లో పెడుతుంటే చిరకాల మిత్రురాలు భార్గవి వచ్చింది.

భార్గవి, సింధు క్లాస్‌మేట్స్. మంచి స్నేహితులు కూడాను. భార్గవి భర్త ఇంజినీరు. ఇద్దరి ఇళ్ళూ దూరంకావడంవల్లా, సింధు ఉద్యోగంచేయడంవల్లా నెలకి ఒకటిరెండుసార్లుకంటే ఎక్కువ కలవడానికి వీలుకాదు.

భార్గవి కాలేజీలో చదివే రోజుల్నుంచీ కథలు రాస్తుండేది. అవన్నీ సింధుకు చూపించి అభిప్రాయం అడిగేది. భార్గవి తీసుకునే థీమ్స్ సింధుకి నచ్చేవి. అందుకే చాలా ఎంకరేజ్‌చేసి, పత్రికలకు పంపిస్తుండేది తనే. అడపా దడపావచ్చే కథలు, ఇద్దరూ చదువుకుని సంతోషపడేవాళ్ళు. వచ్చిన రెమ్యూనరేషన్‌తో ఆరోజు సరదాగా గడిపేసేవాళ్ళు. అదో ఆనందం...

పెళ్ళయ్యాక కూడా ఆమె రాయటం మానలేదు. అప్పుడప్పుడూ పత్రికల్లో కథలు వస్తూనే వున్నాయి.

భార్గవిని చూడగానే సింధు ముఖం వికసించింది.

"రావే! పొటాటోతో కొత్త ప్రిపరేషన్. టేస్ట్ చూడు" అంటూ ప్లేటు ఆమె చేతికిచ్చింది.

అందుకుని, స్పూన్‌తో నోట్లో పెట్టుకోబోతుంటే... "అయ్యొయ్యో, ఆగండి" అంటూ వారించాడు మురళి ఆమెని.

ఆమె కంగారుపడి చూసింది అతన్ని.

"అంత సాహసం మీరుచేస్తే ఎలా? మీరు మాగెస్ట్‌కదా! మీకేదైనా అయితే బాధ్యత మాదే కదా!

ఆగండి... నేతిన్నాక, ఏంకాకుండావుంటే అప్పుడు మీరు టేస్ట్ చూద్దురు. అసలే ఒకచేత్తో నవల, మరోచేత్తో వంటల పుస్తకం పట్టుకుని చేసిన స్వీట్ ఇది" అంటూ ఏడిపించాడామెని.

సింధు కొరకొరా చూసింది అతన్ని. భార్గవి వెళ్ళాక మీపని చెప్తాను అన్నట్టు సైగచేసింది కళ్ళెర్రజేసి.

భార్గవి గట్టిగా నవ్వింది.

అతను తిని అప్పుడన్నాడు, "భార్గవీ!



నోడెట్... నిశ్చయంగా ఇది గొప్ప స్వీటే! చాలా బావుంది" అన్నాడు.

"నేను నమ్మను. సింధు ఎర్రబడ్డ కళ్ళు చూసి ప్లేట్ మార్చేశారు" అంది భార్గవి జోక్‌గా.

ఆమె తలమీద గట్టిగా మొట్టింది సింధు "నేనంటే మీకు ఆటగావుంది" అంటూ.

మురళి కాసేపు కబుర్లుచెప్పి తన గదిలోకి వెళ్లిపోయాడు. సింధూ నాన్నమ్మ పెరట్లో ఏదో పని చేస్తోంది. ఇరవైనాలుగ్గంటలూ ఏదోఒకటి చేయకపోతే ఆవిడకు తోచదు.

భార్గవి, సింధు డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చుని కబుర్లలో పడ్డారు.

మాటలమధ్యలో చెప్పింది భార్గవి... తన నవలొకటి సీరియల్‌గా రాబోతోందని.

ఆమెను మనస్ఫూర్తిగా అభినందించింది సింధు.

"నాకేం ఆనందంగాలేదు సింధూ!" అంది వాడిపోయిన ముఖంతో.

"ఏం?" అంది ఆశ్చర్యపోతూ.

"ఆ నవల విషయంలో నేను కొంత ఇబ్బంది పడాల్సి వచ్చింది" అంది దైన్యంగా.

"ఏమైంది భార్గవీ?" అని అడిగింది అనునయంగా.

"నీకు తెలుసో లేదో కానీ ఎన్కేమూర్తి అని అప్పుడప్పుడు కథలవీ వస్తుంటాయి. అతనికి లిటరరీ ఇంట్రస్ట్ చాలా ఎక్కువనీ, మంచిమనిషనీ నా ఫ్రెండ్ ఒకామె అతన్ని పరిచయం చేసింది. నిజమేననుకున్నాను. అప్పుడప్పుడు ఇంటికివచ్చి కాసేపు కబుర్లుచెప్పి వెళ్ళిపోయేవాడు.

"మీరు రాసిన కథలు అవీ తీసి బైటపెట్టండి... చూస్తాను' అంటూ ఒకరోజు గొడవచేశాడు. రెండు కథలు తీసి ఆయనకిచ్చాను. అవి చదివి అద్భుతంగా వున్నాయంటూ, ఇవి భద్రంగా ఇంట్లో వుంచుకుంటే ఏం వస్తుందంటూ తనకూడా తీసుకెళ్లాడు.

ఆతర్వాత ఇమ్మాల్లోనే రెండు కథలూ పబ్లిష్ అయ్యాయి. నాకాశ్చర్యం వేసింది.

తర్వాత నవలిమ్మని అడిగినప్పుడు, 'ఈ రకమైన పద్ధతి నాకిష్టంలేదు. టాలెంట్ వుంటే ఎప్పుడో ఒకప్పుడు అచ్చులో చూసుకోలేకపోను' అన్నాను. అతను వినలేదు.

ఈకాలంలో పేరుప్రఖ్యాతులు రావడానికి టాలెంట్ ఒక్కటే పనిచేయదనీ, పేరుప్రఖ్యాతులకోసం ఎవరెవరు ఎలా పాకులాడేదీ, ఎలాంటి టెక్నిక్స్ ఉపయోగించేదీ చెప్పాడు. బలవంతంమీద నవల ఇచ్చాను.

ఆ నవల తీసుకెళ్ళి ఒక ఎడిటర్‌కిచ్చాడట.

ఆనాటి నుంచి అతని ధోరణిలో మార్పు కనబడటం మొదలైంది. నన్ను నా అందాన్ని పొగడటం, ఈయన ఆఫీసుకు వెళ్ళిన టైంలో వచ్చి, మీరంటే నాకెందుకో అభిమానం ఏర్పడింది. మిమ్మల్ని చూడకుండా వుండలేకపోతున్నానంటూ మొదలుపెట్టాడు. నాకు భయంవేసింది. ఏంచేయాలో అర్థంకాలేదు. రచయిత్రిగా నాకు ముందుముందు వచ్చే పేరుప్రతిష్ఠల గురించి ఏదేదో మాట్లాడుతున్నాడు.

నా మౌనం చూసి, 'చెప్పు భార్గవీ... నన్నేంచేయమంటావు' అంటూ అతను నాదగ్గరకు రాబోతుంటే ఆ ధైర్యం ఎలా వచ్చిందో నాకే తెలీదుకానీ, చెంపలు పేలిపోయాయి నా చేతిలో. బైటికి పొమ్మని అతని ముఖాన్నే వేసేశాను తలుపులు. వెళ్ళిపోయాడు... మళ్ళా కనపడలా!

అతనిలో గొప్ప ధైర్యం ఏంలేదు. అదో బలహీనత. అంతే! ముందు ట్రైల్స్‌వేసి, పడకపోతే మట్టికొట్టుకుపోయేలా చేస్తాను అంటాడు. అంతే! నేను ఆ ఎడిటర్‌ని కలిసి, నా నవల బావుంటే వేయమని, లేకపోతే ఇచ్చేయమనీ కోరాను. ఆ తర్వాత ఓ నెలకి యాక్సెప్ట్ చేసినట్టు చెప్పారు... అదీ విషయం. ఎందుకో ఆ సంఘటన తలచుకుంటే చాలా చిరాగ్గా వుంటుంది సింధూ!" అంది.

సింధుకి నోట మాటరాలేదు.

"చాలా చిత్రంగావుంది భార్గవీ! అతను మొన్నీమధ్యనే పరిచయం అయ్యాడు ఆఫీసులో. అతని గురించి రాంప్రసాద్ చెప్పాడు కానీ, ఇంత రోగ్ అనుకోలేదు" అంది పళ్లబిగువున.







కనాకగాకర్జుకన కసికమెంకట్
కప్రుం కదా..!?
రహస్యంగా
అడగక్కర్లేదు!
కంట్రోలు రేటులోనే
దొరుకుతుంది..!
MAM 67

"ఇతనొక్కడే కాదు... ఇలాంటివాళ్ళు ఇంకా వున్నారట. నా ఫ్రెండ్ ఒకామె చెప్పింది. తనూ రైటరే! నవల ఇవ్వడానికి ఆఫీసుకు వెళ్తే 'ఈ నవల వేస్తే ఏమిస్తారు?' అంటూ వెకిలినవ్వు నవ్వాడట ఒహడు. గౌరవింపదగిన జ్ఞానం వున్నా వ్యక్తులుగా మాత్రం చాలా అల్పులు వీళ్ళు. ఏమిటో ఈ ప్రపంచం" అంది భార్గవి భారంగా.

"పాడయిపోయింది భార్గవీ ఈ సాహితీ ప్రపంచం... పూర్తిగా పాడయిపోయింది. ఏదో ఒక గొప్పమార్పు, అలజడి రాకపోతే ఇది ఇలాగే వుంటుంది" అంది నిర్వేదంగా.

"మార్పు రావటం మాటలుకాదు సింధూ! ఒకదానికొకటి ముడిపడివున్న వ్యవస్థ మనది. ఒక సమస్యకోసం పోరాడుతుంటే మరొకటి పుట్టుకొస్తుంది. సమస్యల్ని తీర్చటం ఎవరివల్లా సాధ్యంకాదు... చూస్తూవూరుకోడమే" అంది భార్గవి నిరాశగా.

"అలాఅయితే దేనికి మనం బతకడం. జానెడు పొట్ట నింపుకోడంకోసం బతకాలా! అదొక్కటే జీవిత ధ్యేయమా! ఛ... అందుకే అయితే ఈ బతుకే... పెద్ద రోత. నాకవసరంలేదు" అంది ఉద్వేగంతో.

"అనవసరంగా ఫీలవుతున్నావు సింధూ! ఆలోచిస్తే తెలుస్తుంది లోకమేమిటో!" అంది భార్గవి.

కోపాన్ని బాధనీ అణచుకుని కాసేపు మామూలు విషయాలు మాట్లాడింది సింధు.




అవినాశ్‌కి ఫోన్‌చేసి అడిగాడు ఎడిటర్ జయరామ్ "'జ్వాల'ని తిరిగి రాస్తానన్నారు. ఎంతవరకు వచ్చింది?" అని. అతను సమాధానం చెప్పేలోపే మళ్ళీ అన్నాడాయన- "సింధు చేసిన పనికి నేనే మరోసారి సారీచెప్తున్నాను. మీ మంచితనంవల్ల... ఆమెను ఆ సీట్‌లో వుంచగలిగాను. అదే మరొకరైతే పెద్ద కేసుకిందికి వచ్చేది. ముప్పయి చెరువుల నీళ్ళు తాగినంతపనయ్యేది కూడాను" అని.

అవినాశ్ నవ్వి అన్నాడు-

"సింధు విషయంలో ఏమీ చేయలేకపోవటమనేది, ఎందుకంటే ఆమె గుండెల్లోంచి మాట్లాడే నిజాయితీకి, సాహిత్యంపట్ల ఆమె పరిశీలనా దృష్టికి భయపడ్డాను... ఆనందించాను. ఇప్పటివరకూ నేను నడుస్తున్న మార్గాన్ని మార్చి గమ్యం చేరుకోవాలనుకుంటున్నాను. 'జ్వాల'ని తిరిగి రాయలేను. అయినా నేనందించిన నవలలకు భిన్నంగా ఓ మంచి నవల, ఉన్నతమైన నవల రాసి ఇస్తాను. అందుకు ప్రేరణ సింధు అనే విషయం మీరు గమనిస్తే సంతోషం" అన్నాడు.

ఎడిటర్ జయరామ్‌కి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

చాలా విచిత్రంగా, హఠాత్తుగా మలుపుతిరిగిన అతని ఊహలు, ఆలోచనలు... అందుకోడానికి, అర్థంచేసుకోడానికీ ప్రయత్నించినా వాటి పర్యవసానం ఎలావుంటుందీ అనేది ఒక జర్నలిస్టుగా ఆయన అంచనా వేయగలడు.

అద్భుతంగా రాయగలిగిన సామర్థ్యం వుండీ, ప్రతి పత్రికలోనూ ధారావాహికంగా ప్రచురింపబడుతున్న అతని రచనలు, అతనికి పేరు ప్రఖ్యాతులను తెచ్చిపెడుతున్నాయి ఇప్పుడు. మంచి ప్రాచుర్యం పొంది, ఊపిరాడకుండా సాగిపోయే కలం... హఠాత్తుగా ఆలోచనలోపడిందంటే అది ఆనందించవలసిన విషయమో, కలవరపడాల్సిన విషయమో పాఠకులే నిర్ణయిస్తారు- అనుకున్నాడాయన.

అదే సమయంలో రాంప్రసాద్, సింధు, మాలతి, మరో ఇద్దరు కొలీగ్స్ క్యాంటీన్‌లో కూర్చొని కాఫీ తాగుతున్నారు.

సింధు ఎక్కడుంటే అక్కడ సందడిగానూ, సరదాగానూ వుంటుంది. జోక్స్‌వేస్తూ, నవ్వుతూ నవ్విస్తూ వుంటుంది. ఆమె మాటల్లో కృత్రిమత్వం, ఆత్మవంచనా, నాటకీయత ఏమీ

వుండవు. ఏది మాట్లాడినా స్పష్టంగా, నిర్మలంగా మాట్లాడుతుంది. అదే ఆమె కొలీగ్స్‌కి కూడా నచ్చుతుంది. అందరూ ఆమెపట్ల ప్రత్యేకమైన అభిమానం చూపిస్తారందుకే.

ఉన్నట్టుండి ఏదో జ్ఞాపకం వచ్చినట్టు అడిగింది సింధు రాంప్రసాద్‌వైపు తిరిగి.

"కథలపోటీ ఫలితాలు వచ్చాయా?" అని.

"కొన్ని కథలు నేను చూశాను. సెలెక్టు చేసి ఇచ్చాను. ఫైనల్ డెసిషన్స్‌తో మనకు సంబంధంలేదు కాబట్టి, ఎవరికో ఏమిటో రేపో ఎల్లుండో తెలుస్తుంది. ఏం కథలో; చదువుతుంటే మతిపోయింది; సాహిత్యంలో చాలా మార్పు వచ్చేసింది. వందకథలు పరిశీలించి ఆరు కథలుసెలెక్ట్ చేశాను"

ఆరు కథల్లోనూ నాకు బాగా నచ్చిన కథ 'నీడ' అని పరమేశ్వరి అనే ఆమె రాసింది. అదొక్కటే చూసినవాటిల్లో పోటీకి బాగా నిలబడగలిగిన కథ. కథకు ప్రధానమైన వాతావరణాన్ని చాలాబాగా చిత్రించింది.

ఆర్థికంగా చితికిపోయిన కుటుంబంలో పుట్టి కష్టపడి చదివి ఉద్యోగం చేస్తూ, బతుకుతున్న ఓ యువతి;

ఇటు కుటుంబపరిస్థితికి, అటు అవివాహిత అయిన ఆమెను సమాజం చూసే చూపుకీ... ఈ రెంటికీ మధ్య ఆమె మానసికస్థితి, పరిస్థితులు దుస్సాహంగా పరిణమించినప్పుడు... ఇరవై ఏళ్ళకే బతుకుమీద ఎలాంటి విరక్తి కలిగిందీ చాలా బాగా చూపించింది రచయిత్రి.

ఇలాంటి సమస్యలు మనం రోజూ చూస్తున్నాం, వింటున్నాం. ఇది కథకాదని కల్పనఅని అనలేం. ఇలాంటి కథలకే ప్రోత్సాహం ఇస్తే కొంతమార్పు రావడానికి అవకాశం వుంటుంది.

దేన్ని సబ్జెక్టుగా తీసుకుంటున్నారో కూడా వారికే తెలియకుండా రాస్తున్నారు చాలామంది. మనం ప్రచురిస్తున్నాం పాఠకులు చదువుతున్నారు. ఏంచేస్తాం" అన్నాడు నిర్లిప్తంగా.

ఎవ్వరూ అతని మాటలకి బదులు పలకలేదు. సింధు తీవ్రమైన ఆలోచనల్లో పడిపోయింది.

ఇదో సమస్యల వలయంగా పరిష్కారం దొరకని సమస్యగా, పెద్దభూతంలా కళ్ళముందు కనిపిస్తుంటే కలతపడింది ఆమె మనసు.

వినుగుతో ఊపిరాడనట్టు, అశాంతిగా తల వెనక్కి ఆనించి కూర్చుంది.

'తరం మారింది. మారుతున్న తరానికి మార్గదర్శకమైన విలువలు ప్రచారం చేయాలి. కానీ పలాయనవాదంలోకి తీసుకుపోకూడదు. ఉన్న పరిస్థితులకు అనుగుణంగా మారిపోడానికి తన మనసంగీకరించటంలేదు. ఏదో ఒకచర్య తీసుకోవాలి' అనుకుంది.

'నిస్సహాయంగా వూరుకుంటే తనకేదో పిచ్చిపట్టేట్టుగా వుంది' అనుకుంది మనసుల్లో.

ఆ తర్వాత ఓ పదిరోజులకి ఊహించని సంఘటన ఒకటి సింధుని కలవరపరిచింది. ఆమెనేకాదు, ఆమె కొలీగ్స్ లో కూడా ఒకవిధమైన చిరాకు, ఆశ్చర్యం కలిగాయా సంఘటనకి.

అందుక్కారణం కథలపోటీ ఫలితాలు... వూహించని విధంగా వెలువడటం.

ఫలితాల సంగతి వినగానే, రాంప్రసాద్, సింధు ప్రెస్‌సెక్షన్‌లోకి వెళ్ళి లిస్ట్ తీసిచూశారు. రాంప్రసాద్ చాలా అద్భుతంగా వుంది అన్న 'నీడ' కథ అసలు లిస్ట్‌లో లేదు.

అందుకతను వివరీతంగా చలించాడు. బాధపడ్డాడు. ఎవరో రాసిన ఓ చిన్న కథసెలెక్టే కాకపోవటం అనేది అతను కలవరపడటానికి, ఆవేశపడటానికీ కారణమైంది. అదిచూసి చుట్టూవున్న వాళ్ళు అతనిపిచ్చికి ఆశ్చర్యపోయారు.

చూసేవాళ్ళకి విచిత్రంగా, విడ్డూరంగా కనిపిస్తుందేమోకానీ, నిజమైన విలువలకీ, మనిషిని ప్రభావితం చేయడానికి అవకాశమున్న కథకోసం పాకులాడే ఓ మనసు... అది కనిపించీ దానినెవరూ పట్టించుకోకపోతే కలవరపడటంలో ఆశ్చర్యంలేదు.

లక్షల ఆస్తికోసమో, లంచాలకోసమో, కట్నాలకోసమో పాకులాడ్డం అలవాటైన మనుమలకి... నిజమైన దుఃఖాలకి విచారించటం ఎలా



చాతనవుతుంది. అతని బాధకీ, ఆక్రోశానికీ, కారణాలు వెతకడంకానీ, వాటిలో తుది నిర్ణయించటం కానీ సాధ్యమయ్యే పనికాదు.

సింధు, రాంప్రసాద్ కంపోజర్ దగ్గరకువెళ్ళి బహుమతి పొందిన మూడు కథలని లాక్కున్నట్టుగా తీసుకుని చదివేశారు.

రెండు మూడు బహుమతులొచ్చిన కథలు ఒకమాదిరిగా వుంటే, మొదటి బహుమతి పొందిన కథ అస్సలు బావుండలేదు. ఆ మూడు కథలు చదివిన తర్వాత 'నీడ' కథను ఎందుకు రిజెక్ట్ చేయాల్సివచ్చిందో అర్థంకాలేదు ఇద్దరికీ. బహుమతికి అర్హమైన కథ! ఆర్డినరీగాకూడా సెలెక్ట్ కాలేదంటే... సింధు మనసు ఉడికిపోయింది.

అదీకాక, మొదటి బహుమతి వచ్చిన కథని రాసిన శ్యామల ఎన్కేమూర్తికి మంచి ఫ్రెండనీ, అతని పలుకుబడి, ప్రాపకం ఏదో ఉండబట్టి ఇలాంటి కథకి బహుమతి ఇవ్వటం జరిగివుంటుందని చెప్పాడు రాంప్రసాద్.

అంతే... అలా చెప్పి, సింధువైపు చూసిన అతను... ఆమె ముఖంచూడ్డానికే భయపడ్డాడు. ఆమె కళ్ళు క్రోధంతో ఎర్రబారాయి. స్వేదంతో వళ్ళంతా తడిసింది. ఆలోచించినకొద్దీ విషయం అర్థమైనట్టుగా గుండెబరువెక్కింది. కళ్ళల్లో నన్నని బాధావీచిక తారట్లాడింది. ఒర్పు నన్నగిల్లిపోతున్న ఫీలింగు. అందుకే ఆపాదమస్తకం ఉద్వేగంతో ఊగిపోతోంది.

"సింధూ!" అని పిల్చాడు ఆందోళనగా.

"ఎంత మొహమాటాలకుపోతే మాత్రం, ఇలాంటి పటుత్వం లేని కథలు వేయటంవల్ల పత్రికస్థాయి దిగజారిపోతుందని, తన వృత్తికే కళంకమనే ఆలోచన మన ఎడిటర్‌కి ఎందుకు తెలీదు? ఆయనేమిటి ఇలా అయిపోయారు?" అంది.

"పరిస్థితులు సింధూ! ఆయన ఎడిటరేకాదు. జర్నలిస్టుకూడాను. వాళ్ళజీవితాలు చాలా సంధిగ్ధంగా గడుస్తుంటాయి. ఫామిలీ మెయింటినెన్స్‌కి చాలని సంపాదన. వీటికితోడు అంతులేని మానసిక సంఘర్షణ. ఏం చేస్తారు?" అన్నాడు.

"అందుకని" చాలా అసహనంగా అంది.

"తన వృత్తిధర్మాన్నుంచి దృష్టిమళ్ళించే ఒత్తిడులు, సిఫార్సులు, ఆకర్షణలు వీటికి లొంగిపోవాల్సి వస్తుంది ఒక్కోసారి. మిగతా కొంతమంది ఎడిటర్స్‌తో పోల్చుకుంటే జయరామ్‌గారు చాలా ఉత్తములనే చెప్పాలి. రచయితల దగ్గరనుంచి డబ్బు తీసుకుని బహుమతులిచ్చే ఎడిటర్స్‌వున్న పత్రికా రంగం మనది. డబ్బు ఒక్కటేకాదు, పలుకుబడులు... ఇంకా ఎన్నో వున్నాయి. అనవసరంగా ఆవేశపడి వారందరిని నువ్వేం చేయగలవు?!" అన్నాడు. ఆమెకు వాస్తవాన్ని తెలియజేయాలనే వుద్దేశంతో.

అతని మాటలతో తన అనుమానాలు ఋజువుపరిచే నిదర్శనాలు కనిపించినట్టయింది ఆమెకి.

ఆమె ఆలోచన తెగిపోయింది.

చేతిలో స్క్రిప్టులు అక్కడే పడేసి వేగంగా నడిచి ఆఫీసురూమ్‌లోకి వచ్చింది.

అప్పుడు సమయం నాలుగు కావస్తుంది.

ఆమె వెనకే వచ్చిన రాంప్రసాద్‌కి ఆమె పరిస్థితి అర్థంకాలేదు.

ఆమె తన సీటులో కూర్చుని కాగితం, కలం తీసుకుని, రాజీనామా పత్రం రాస్తుంటే-

"ఎందుకిప్పుడిది?" అని వణికే గొంతుతో అడిగాడు.

రాయటం పూర్తిచేసి, కవరులోపెట్టి అప్పుడు తలెత్తి అతన్ని చూసింది.

"సారస్వతాన్ని దుర్గంధ భూయిష్టం చేసే వారొకరైతే... అందుకు చేయూతనిచ్చే వారొకరా! అలాంటి అసమర్థుల దగ్గర పనిచేయటం నావల్లకాదు" అంది గట్టిగా.

"నాకు సాహిత్యమంటే అభిమానం, ప్రాణం అందుకే కోరి ఈ ఉద్యోగం చేస్తున్నాను. ప్రాణాలకు ఆపదవస్తే ఎంత తల్లడిల్లిపోతామో, అలావుందిప్పుడు. నా పరిస్థితి" ఆమె గొంతు చలించింది.

రాంప్రసాద్ ఆమె చేతిలో కవరు అందుకుని, "సింధూ! మీరు ఆవేశపడుతున్నారు! బాగా ఆలోచించండి... అనవసరపు విష

యాల జోలికిపోయి, మనస్తాపం తెచ్చుకోకండి. ఎవరెటుపోతే మనకెందుకు? మీరు రిజైన్ చేసినంత మాత్రాన... జరిగే అన్యాయాలు అవీ పోతాయంటారా? నే చెప్పేది వినండి. ప్లీజ్... ఫర్‌గెట్ అబౌట్‌ఇట్' అన్నాడు అర్థింపుగా.

"నో.... నథింగ్ డూయింగ్.... ఆ కవరిలా ఇవ్వండి. అవినీతి మార్గంలో అంతా నడుస్తున్నారని దాన్నే నీతి అనుకోమంటే నాకు సాధ్యంకాదు. నాకు తోచింది ఏదో అదే నీతి. అదే ఆచరణలో కూడా పెడతాను" అంటూ కవరు తీసుకుని చరచరా ఎడిటర్ జయరామ్ రూమ్‌లోకి దూసుకు వెళ్ళింది సింధు.

రాంప్రసాద్‌తోపాటు విషయం తెలిసిన మిగతావాళ్ళు కూడా నిశ్చేష్టుల్లా నిలబడిపోయారు.





Pinisetty

తుఫాన్‌లా లోపలికి అడుగుపెట్టిన సింధుని చూసి అదిరిపడ్డాడు జయరామ్.

ఆయనకు ఎదురు సీటులో కూర్చుని ఎన్కే మూర్తి కన్పించాడు సింధుకి.

అతన్ని చూడగానే మరింత అగ్నిలా మండింది- ఆమె. వేగంగా లోపలికి దూసుకొచ్చిన సింధు పాదాలు బంధింపబడినట్లు ఆగిపోయాయి అక్కడే.

తలతిప్పి చూసిన ఎన్కేమూర్తి ఆమె ముఖం చూసి షాక్ తిన్నాడు.

అతన్ని అసహ్యంతో చూసి, ముఖం పక్కకు తిప్పుకుందామె.

అది గమనించాడు ఎడిటర్ జయరామ్.

చేతిలో కవరు టేబిల్ మీదికి విసిరికొట్టింది సింధు.

ఆమె చర్యకు ఖంగుతిన్న జయరామ్ కవరు అందుకుని, "వాటీజ్‌దిస్" అన్నాడు.

"నా రాజీనామా!"

"ఎందుకు?"

"మీ దగ్గర జాబ్‌చేయడం నాకిష్టం లేదు" అంది చేదుగా.

"సింధూ! నువ్వేం మాట్లాడుతున్నావో, ఎవరితో మాట్లాడుతున్నావో తెలుస్తోందా?" అన్నాడాయన కోపంగా.

"సాహిత్యం మీ తాతలసొత్తు కాదు... మీ ఇష్టమొచ్చినట్టు దాని రూపురేఖలు మార్చటానికి. కథలు వేయించి, కీర్తిప్రతిష్ఠలలో మునిగిపోయేలా చేస్తానని భ్రమలు కల్పించి... తన కోరికలకు ఆవిధమైన ఖరీదుకట్టి ఆడవాళ్ళతో మిస్‌బిహేవ్ చేసే ఇలాంటి ఫూల్స్‌ని మీరు ప్రోత్సహించటం నేరం.

మీరు చేసే పనులన్నీ చట్టానికీ, పాఠకులకూ దొరకని నేరాలు. కాబట్టి దండనకు గురికాకుండా బ్రతికేస్తున్నారు. పత్రికలు నడిపేవారంతా చేసే ఈ నేరాలను నిరూపించడానికి, ఖండించడానికీ ఎవరూ సిద్ధపడకపోవటంతో సాహిత్యాన్ని మీ ఇష్టమొచ్చినట్టు, మీ స్వప్రయోజనాలకు వాడుకుంటున్నారు. జాతిని జాగృతం చేసే సాహిత్యాన్ని మీరు కాకమ్మ కథలుగా తీర్చిదిద్దేట్లయితే... ఆస్థానంలో కూర్చోడానికి అనర్హులు మీరు" అంది అక్కడ పరిసరాలన్నీ ప్రతిధ్వనించేట్టు.

"పత్రికలకు కావలసింది నీలాంటి అహంకారుల వ్యక్తిగతమైన ఉద్దేశాలు, అభిప్రాయాలు, ఆశయాలు కాదు. నువ్వనుకునే విధంగా పత్రికలు నడిపితే మమ్మల్ని పనికిరాని జర్నలిస్టుల కింద జమకడుతుంది లోకం. కళ కళకోసమూ కాదు... ప్రజలకోసమూ కాదు.

సాహిత్యం, నృత్యం, సంగీతం, నాటకం... ఏకళా కళకోసం పాటుపడ్డం లేదు. 'కళ కానుల కోసం' అని సరిదిద్దుకోవాలి ఇప్పుడు.

నువ్వు రిజైన్ ఇచ్చినంత మాత్రాన మా పత్రిక దెబ్బతినదు. సర్క్యులేషన్ ఆగిపోదు. క్షణక్షణం ఏదోఒక అలజడి తెచ్చి, నన్ను విసిగించటం నీకు అలవాటైపోయింది. నిన్ను ఆ స్థానం నుంచి తీసివేయాలని ఎన్నోసార్లనుకున్నాను.

కానీ... నిన్ను నిన్నొక అమాయకురాలి కింద, చదువు, సాహిత్యం తప్ప... ఆ సాహితీ ప్రపంచంలో కూడా కుళ్ళు, కల్మషం వున్నాయని, అవేమీ తెలియని అమాయకురాలి క్రింద జమకట్టి... తెలుసుకున్నప్పుడు నీ అలజడి తగ్గుతుందని భ్రమపడి నిన్నీ ఉద్యోగంలోనే వుంచగలిగాను. కానీ నీ ధోరణి, ప్రవర్తన రోజురోజుకీ మితిమీరిపోతోంది. ఇంక నేను భరించలేను. నీ రాజీనామాకి సంతోషం... వెళ్ళు" అన్నాడు జయరామ్. కట్టలు తెగిన ప్రవాహంలా కోపం పొంగుతోంది ఆయనలో.

సింధు నిటారుగా అయింది. కణతలపై ధారాపాతంగా కారుతున్న చెమటను తుడుచుకుని- "వెళ్ళటంకాదు. మీరు ప్రకటించిన బహుమతి కథలు ఏ బేసిక్‌ని ఆధారంగా తీసుకుని సెలెక్ట్ చేశారో... ఆ కథల వెనక కథలు, నిజమైన ప్రతిభా సామర్థ్యాలకు అవకాశం ఇవ్వకుండా... ఏ ఆకర్షణలకు లొంగి అర్థంలేని కథలకి బహుమతులు ప్రకటించారో అన్నీ... అన్నీ బైటపెడతాను. ఏమాత్రం అవకాశం దొరికినా జనం మాటల్ని మీ ఇష్టం వచ్చిన రీతిలో రాసుకుని సెన్సేషన్ సృష్టించటం మీ పత్రికలవారికి అలవాటైన కార్యక్రమమే కదా. ఇదీ అంతే.... సెన్సేషనల్

చేయడానికి వెళ్తున్నాను'' అంది ఆవేశంతో వూగిపోతూ.

అంతే! అప్పటివరకూ ఆమె మాటలకి అగ్నిపర్వతంలా ఉడికిపోతున్న మూర్తి చటుక్కున లేచి, ''యూ, బిచ్'' అంటూ పళ్ళు నూరుతూ ఆమె మీదికి చేయి ఎత్తబోయాడు.

ఈ హఠాత్పరిణామానికి విస్తుపోతూ పక్కకు తిరిగి, అతను ఎత్తిన చేయి తన చెంపను తాకేలోపే, ఊడ్చిపెట్టి కొట్టింది అతని చెంప మీద.

అతని కళ్లు తిరిగినట్లయ్యాయి. చెంపచేత్తో పట్టుకుని, వగురుస్తూ జరిగిన అవమానానికి రక్తంతాగే తోడేలులా మీదికి రాబోయాడు.

''నువ్వింక ఒక్క అడుగు ముందుకు వేసినా... తర్వాత జరిగే పరిణామాలకు జీవితాంతం కుమిలిపోయేలా చేయగలను... గోఅవే. నేను కొట్టిన చెంపదెబ్బ.. ఇకపై నువ్వు ఆడపిల్లలకి సాహిత్యం పేరుతో పిచ్చిభ్రమలు కల్పించకుండా వుంటావని గుర్తుండేలా చిన్న చురక. అంతే!'' అంటూ బైటికి వెళ్ళబోతూ, వెనక్కి వచ్చి, టేబిల్‌మీద చేతులానించి కాస్త ముందుకు వంగి ఎడిటర్ జయరామ్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అంది-

''ఒక వ్యక్తి ఎంతమంచివాడో, మహనీయుడో నిరూపించేది అతని ప్రవర్తన. అది ఋజువు చేసేది అతని చుట్టూ వున్న మనుములు, వాతావరణము అని మీరే అంటూండేవారు. వ్యధలు, బాధలు తప్పనిసరి మనిషికి. అందుకని మంచి ఎడిటర్‌గా, జర్నలిస్టుగా మహోన్నత స్థానం అధిష్టించాల్సిన మీరు అల్పమైన విషయాలకు లొంగిపోయి, 'కళకానుల కోసమంటూ' కొత్త నానుడి లేవదీస్తారనుకోలేదు. మీ మేధాశక్తి ఎంత దిగజారిపోయిందో చూస్తుంటే నామనసు కల్లోలమైపోతోంది'' అనుకోని విధంగా ఆమె కంఠం రుద్ధమైంది.

ఒక నిముషం మౌనం వహించి మళ్ళీ అంది. ''ఔన్నత్యం, నిజాయితీ వీటిని ఆలంబనగా చేసుకుని తెలుగు పత్రికా ప్రపంచంలో అజరామరమైన కీర్తిని సంపాదించండి. ఆ కీర్తి శిఖరాన్ని అందుకోడంలో వుండే ఆనందం మీకు దేనివల్లా కలగదు!

పత్రికారంగంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పరిమితమే అయినా, మీ లక్ష్యాన్ని విడవకుండా ఆస్థాయికి మీరెదగడానికి ఏశక్తీ మిమ్మల్ని ప్రతిఘటించదు. ఇన్నాళ్ళూ మీరు నాకందించిన విజ్ఞానానికి, అభిమానానికి కృతజ్ఞతలు'' అనేసి బైటికి వెళ్ళిపోయింది సింధు.

తుఫాన్ తర్వాత ప్రశాంతతలా నిశ్శబ్దంగా అయింది వాతావరణం. ఆ నిశ్శబ్దం జయరామ్‌కి భయాన్ని కలిగించింది.

తన కళ్ళెదుట జరిగిన సంఘటన నుంచి తేరుకోలేకపోతున్నాడాయన. కణతలు నొక్కుకుంటూ శూలాల్లా తగిలిన ఆమె మాటలు గదంతా ప్రతిధ్వనిస్తున్నట్టుగా అనిపించి కోపంతో రగిలిపోయింది ఆయన మనసు.

ఆక్షణంలో ఆయన ముఖం ఎంత క్రూరంగావుందో, ఆ కళ్ళల్లో ఎంత ద్వేషం ప్రజ్వరిల్లుతుందో చూస్తేకానీ తెలీదు.

అలా ఎంతసేపు కూర్చున్నాడో ఆయనకే తెలీదు. ఎన్కెమూర్తి ఒక్క నిముషం కూడా అక్కడ నిలబడలేనట్టు వెళ్ళిపోయాడు. అవమానభారంతో అతను ముఖం ఎత్తుకోలేకుండా వున్నాడు.

బైటకు అడుగుపెట్టిన సింధు స్టాఫంతా తనని విచిత్రంగా, వింతగా చూడటం గమనించి అంది-

''ఎందుకు మీరంతా నన్నిలా చిత్రంగా చూస్తున్నారు? నేను చేసిన పనితప్పని మీ ఉద్దేశమా? లేక ఎవరితోనో ఒకరితో ఏదో ఒక గొడవ పెట్టుకోడమే నా జీవిత లక్ష్యం అయినట్టు భావిస్తున్నారా? మనం పనిచేసే దేవాలయంలాంటి ఈ పత్రికారంగం నుంచి ఈ లోకానికి అందించాల్సిన విజ్ఞానం, వివేకాలకు బదులుగా... అజ్ఞానాన్ని అందిస్తున్నాం. అది తెలియజేయటం తప్పే అని మీరూ అంటే నన్నర్థం చేసుకుని ఆదరించే నేస్తమే లేదనుకుంటాను... గుడ్‌బై'' అంటూ భుజానికి బాగ్ తగిలించుకుని భారమైన మనసుతో వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోయింది. చిన్నబోయిన ముఖాలతో నిలబడిపోయి చూస్తుండిపోయారంతా.

వాళ్ళు ఆమెకు సమాధానం చెప్పకపోవటానికి కారణం.. ఆమెపట్ల అయిష్టత కాదు.

ఆమె చేసింది తప్పేమీ కాదు. ఆమె ప్రవర్తనలో ధైర్యం, నిశ్చలమైన ఆలోచన వారి మనసులో... లేపిన అలజడే.

వాళ్ళున్నది పై అంతస్తులో కాబట్టి, గబగబ కిటికీ దగ్గరకు పరుగెత్తి, అక్కడినుంచి కిందికి చూశారు.

అప్పటికే సింధూ మెయిన్‌గేటు దాటి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఇంటికి చేరిన సింధు బాగ్ అవతల పడేసి, కళ్ళజోడుతీసి, వెళ్ళి బెడ్‌మీద పడిపోయింది అలసటగా. ఆమె మనసులో ఎన్నో ఆలోచనలు తిరుగుతున్నాయి. ఎంతసేపలా ఆలోచనా సుడిగుండంలో కొట్టుకుందో గానీ, ఆమెకు తెలియకుండానే నిద్ర పట్టేసింది.

ఆవేళప్పుడు నిద్రేమిటాఅని సింధు నాన్నమ్మ గదిలోకివచ్చి, ఆమె నుదుటిమీద చేయి వేసి చూసింది.

చల్లగా తగిలింది. 'కాసిని కాఫీనీళ్లు కూడా తాగకుండా పడుకుందే' అనుకుంటూ లేపడానికి ఆమెమీద చేయివేసింది కానీ, మంచి నిద్రను పాడుచేశావంటూ గొడవ పెడుతుందేమోనని భయపడి అక్కణ్ణించి వెళ్ళిపోయిందావిడ.

ఎనిమిది గంటలకి మురళి చాలా హడావిడిగా ఉరకలువేసే ఉత్సాహంతో, ఎగిసిపడే సాగరకెరటంలా వచ్చాడింటికి. రోజూ ఆ సమయంలో, ఏదో ఒక పుస్తకం చదువుతూనో, వల్లితో తోటలో కూర్చుని కబుర్లాడుతూనో కూర్చునే తనభార్య, అదమరిచి నిద్రపోవటం చూసి, కాస్త గాభరాపడ్డాడు.

తల, వళ్ళు తడిమి ఆమెను లేపాడు. అతని స్పర్శకు మెలకువ వచ్చిన సింధు నీరసంగా కళ్ళుతెరచి చూసింది.

తన ముఖానికి దగ్గరగా కనిపించిన భర్త ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని గుండె కదుముకుని "ఏమిటీవేళ చాలా ఆనందంగా కన్పిస్తున్నారు" అంది.

ఆమె గుండెల్లో అలాగే తలపెట్టుకుని- "చెప్తానుగానీ, బహుమతిగా నాకే మిస్తావ్?" అన్నాడు.

"బహుమతి కావాలా? నాలుగు మొట్టికాయలిస్తాను" అంది ముఖంమీద పడుతున్న అతని జుట్టును సరిచేస్తూ.

"రోజూ తినేవి అవేగా! కొత్తగా, అపురూపంగా వుండేదేమైనా కావాలి" అన్నాడు.

ఆమె నవ్వి- "నన్నే మీకు కానుకగా ఇచ్చుకున్నాను. బహుమతిగా ఇవ్వడానికి నా దగ్గరేముంది మురళీ!" అంది.

ముఖం ఎత్తి, ఆమె కళ్ళలోకి చూస్తూ- "వుంది. నీలా అందంగా, చురుగ్గా, అపురూపంగా వుండే పాప కావాలినాకు. ఇంకా ఎంత కాలం?" అన్నాడు.

"ట్రై చేద్దాంలే" అని కిలకిలా నవ్వింది.

"ఆమె నుదుటిమీద గట్టిగా ముద్దుపెట్టుకుని, ఈ అల్లరి మాత్రం మానవు. నేనడిగింది ఇస్తానేవరకూ, నా సంతోషానికి కారణం చెప్పను అంతే!" అంటూ ఆమె పక్కనే ఒరిగిపోయాడు.

అతని చేతిని తీసుకుని పెదవులకానించుకుని గుండెకు హత్తుకుంది పరవశంగా.

"మురళీ! భార్యాభర్తల మధ్య బంధాలు, చాలా అసహజంగా, వ్యక్తిత్వాలు వదులుకుని బతుకుతున్న ఈ రోజుల్లో... భర్తగా నాజీవితంలో మీ ప్రవేశం వెయ్యిజన్మలకి సరిపడా ఆనందాన్ని గర్వాన్ని బలాన్ని ఇచ్చింది. బతికినంతకాలం మనమధ్య ఆ విలువ, ప్రేమ ఉండిపోవాలనేదే నా బలమైన కోరిక" అంది.

"అయితే..." అన్నాడు సందిగ్ధంగా.

"అందుకని నాలాంటి అమ్మాయిని కాకుండా... మీ ప్రేమకు చిహ్నంగా ఓ వంద మంది మీలాంటి అబ్బాయిల్ని కని ఇవ్వాలని నా కోరిక" అంది వెక్కిరింపుగా.

"ఓ.... నాకేం అభ్యంతరం లేదు. బ్యాంక్ ఆఫీసరుగా ప్రమోషన్ వచ్చింది కదా! ఇంకరావలసింది ఇదే! హాయిగా లీవ్‌పడేసి, ఇరవై నాలుగ్గంటలూ నీ సన్నిధే నా..."

అతని నోరుగట్టిగా మూసేసి ఛెంగున లేచి కూర్చుంది.

ఆమె ఇంకా ఆశ్చర్యంనుంచి తేరుకోలేదు. అతను ఇందాకట్నించీ తనకు చెప్పాలనుకుంటున్న సంతోషకరమైవార్త. అతనికి ప్రమో




షన్ వచ్చిన సంగతి గురించేనని తెలిసేనరికి ఆనందంతో ఉక్కిరిబిక్కిరైంది.

అతని పెదవులమీద లాలనగా ముద్దు పెట్టుకుని అంది- "మీరు ఆఫీసరై, ఎక్కువ జీతం తెస్తారని కాదు ఈ ఆనందం. నేను ఉద్యోగం వదిలేయగానే మీకు ప్రమోషన్ వచ్చినందుకు. ఇలాఅని తెలిస్తే ఎప్పుడో రిజైన్ ఇచ్చిపారేసే దాన్ని కదా! మీకు ప్రమోషన్ రావటమే కాదు సాహిత్యానికి పట్టిన పీడకూడా వదిలిపోవాలి" అంది.

ఆమె ఒడిలో తలపెట్టుకుని పడుకున్న మురళి ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాడు ఆమె మాటలకి.

"ఏమిటి సింధూ! రిజైన్ చేశావా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును... అవినాశ్ నవల గురించిన గొడవ జరిగినప్పుడే, నేను రిజైన్ చేసేయాలని నిర్ణయించుకున్నాను కదా! కానీ అవినాశ్ రిజైన్ చేయద్దని కోరారునన్ను. ఆయన మాట మీద గౌరవంతో ఆ పని చేయలేకపోయాను. కానీ ఈ రోజు తప్పలేదు" అంది ముభావంగా!

ఆమె ముఖం చూస్తుంటేనే అర్థమైపోయిందతనికి ఏదో అవాంఛనీయ సంఘటన జరిగినట్టు.

"ఏమైంది? మళ్ళా ఏంగొడవ తెచ్చిపెట్టావు?"

అంతే... ఆ మాటకి విపరీతంగా రియాక్టయింది సింధు. ఎందుకో చెప్పలేని బాధకలిగింది మనసులో. అయినా ఆ సందర్భంలో తనబాధ బైటికి కనపడనీయడం ఇష్టంలేకపోయిందామెకి.

అందుకే అతనికి కొన్ని గంటల క్రితంజరిగిన సంఘటన గురించి వివరించి చెప్పింది.

అంతావిని మురళి జరిగిపోయిన సంఘటనమీద అనాసక్తితో, ఒకరకమైన విసుగుతో ఆమెవంక చూశాడు.

"సింధూ... నువ్వు రిజైన్ చేసినందుకు నాకు బాధలేదు గానీ, రిజైన్ ఇచ్చేస్తూ కూడా గొడవ పెట్టుకుని రావటం దేనికీ!" అన్నాడు.

"రిజైన్ ఇచ్చినందుకో, ఇవ్వవలసి వచ్చినందుకో నేను గొడవ పెట్టుకోలేదు. ఎవరెలాపోతే నాకెందుకు అనే సంకుచితం నాలో లేకపోవటంవల్ల... ఏదోఒక ప్రయోజనాన్ని ఆశించి కళా విలువలులేని ఓ కథకి బహుమతి ప్రకటించటం, సహించలేని విషయంగా భావించి, ఎడిటర్‌మీద కోపంతో రిజైన్ చేశాను" అంది కోపంగా.

"ఆహాఁ... ఇప్పుడేమైంది. ఆ కథకి బహుమతి ఇవ్వటం మానేశారా?" అన్నాడు చిరాకు పడుతూ!

"ఎవరో ఒక్కమనిషికి అయిష్టమని తమ ప్రయోజనాలను వదులుకుంటారా ఎవరైనా! అలాక్కాదు. ఈ ఒక్కకథ విషయంలోనే కాదు. ఇకముందు ఇలాంటి అవకతవకలు జరగకుండా ఏదైనా మార్గం ఆలోచించాలి" అంది మొండిగా.

అందుకు విపరీతమైన కోపం వచ్చింది మురళికి. ఉన్నట్టుండి ఏదోఒక ఉపద్రవం తెచ్చిపెట్టేట్టుగావున్న ఆమెను చూసి, అతనికి ఒకపక్క భయం, మరోవైపు నిరసనభావం కూడా కలిగాయి.

అందరూ నడిచేదారిలో కాకుండా ఎవరైనా కాస్త భిన్నంగా నడిస్తేనే సహించలేని సంఘం... ఆమె మంచికిపోతున్నా అర్థం చేసుకోగల సంస్కారం, ఆలోచన దానికి వున్నాయా?

చెడ్డతనాన్నే సమర్ధించుకుని బతికేస్తున్న సంఘానికి, తన తర్కంతో, జ్ఞానంతో నీతికీ అవినీతికీ; వృత్తికీ ప్రవృత్తికీ మధ్య భేదాన్ని తెలియజేయా లనుకోవడం మూర్ఖత్వం. దారికానిదారులలో నడుస్తున్న సాహిత్యాన్ని రక్షించాలనుకోడం... అనుభవంలేని తపన. అంతే.

వీటిగురించి ఆలోచించి, వ్యధచెంది మార్పుకోసం ప్రయత్నిస్తే... ఎదురయ్యేది అలజడి, ఆందోళన తప్ప కోరుతున్న ఫలితాలు రావు. మనిషిని పెడదారులు పట్టిస్తున్న ఈ సాహిత్యం సృష్టించిన బడబాగ్నిలో ఎంతో మంది పడి నలిగిపోతుంటే వాళ్ళని రక్షించటం ఓ పాతికేళ్ళ యువతికి సాధ్యమయ్యే పనికాదు.

పైగా... తమ అభిమాన రచయితలు, తమ నవలల్లో సృష్టించిన భయంకరమైన సంఘట

నల్ని వాస్తవంలో సునాయాసంగా అమలు చేయటం నేర్చుకుంటున్న పాఠకులు తన భార్యను కూడా ఆవిధంగా చూడరనే నమ్మకం అతనికి కలగటంలేదు.

ఆ ఆలోచన రావటంతోనే అతని వళ్ళు జలదరించింది. ఎన్నో కోరికలతో, ఆశలతో ఆనందంగా అల్లుకున్న తమ సంసారంలో ఏ తుఫాను చెలరేగకూడదనీ, తన ప్రాణమైన భార్య ఏ అలజడికీ గురికాకూడదనే అనుకున్నాడు.

అలా అని ఆమె ఆలోచనలని సమర్ధించి, ఆమెకు చేయూతనిచ్చి... ఉచ్చులో మరింతగా బిగించలేడు. ఆలోచించినకొద్దీ, ఆచరించినకొద్దీ ఇలాంటి సమస్యలు మరింత కష్టమౌతాయే కానీ, తేలిగ్గా పరిష్కారం కావు.

అవన్నీ తలచుకోగానే అతని గుండె అట్టడుగు పొరల్లోంచి మొదలైన సన్ననిబాధ... మరో నిముషానికి భరించలేని వ్యధగా మారింది.

ఆమెను విడిచి క్షణమైనా బతకడం అసాధ్యంగా తోచే తనకి, ఆమెతో కలిసి జీవితం పంచుకోడమే అద్వితీయంగా భావించే తనకి.. తన సహజ స్వభావంతో, దూకుడుతో ఆమె ఏమైనా అనుకోని పరిణామాలు కొని తెచ్చుకుంటే తన జీవితం ముక్కలై పోతుందనే భయంతో అతను తల్లడిల్లిపోతున్నాడు.

గుండెల్లో నిశ్శబ్దంగా ఇముడ్చుకోలేక పోతున్న సంచలనాన్ని బాధనీ, బరువునీ మోయలేని అతని కళ్ళు నీళ్ళతో తడిశాయి.

ఆపుకోలేని దుఃఖంతో, బాధతో, భయంతో ఆమెను చుట్టేశాడు.

అతన్ని అలాగే హత్తుకుని నిర్లిప్తంగా వుండిపోయిందామె. తన గురించి అతని ఆలోచనలు, పడే తపన, బాధ, కలవరం అన్నీ తెలుసు. వాటికి కరిగి తనమార్గాన్ని మళ్ళించుకోని మతం ఆమెది.

అందుకే అతన్ని తననుంచి విడిపించి అంది.

"మురళీ... నాకు జీవితంమీద భ్రమలు లేవు. కీర్తి, డబ్బు, ఇలాంటి దాహాలు కూడా లేవు. మనిషిగా పుట్టినందుకు కాస్త మానవత్వంతో, వివేకంతో బతకాలని. అదీ... కళ్ళెదుట కనిపించే ఓ చెడుని ఖండించటం తప్పుకాదని నా ఉద్దేశం. అసలు చెడ్డతనమే కనిపించకపోతే ఈ సంఘర్షణే వుండదు కదా!" అంది అనునయంగా.

"ఆ పనిచేయడానికి సంఘసంస్కర్తలు పుట్టుకు రావాలి సింధూ! సాహిత్యాన్ని ప్రక్షాళన చేయడం నీవల్ల అయ్యేపని కాదని చెప్తున్నాను. నీలా ప్రయత్నించి భంగపడినవాళ్ళు, నీకన్నా పెద్దవాళ్ళు, విజ్ఞానవంతులైనవాళ్ళూ వున్నారు. వారంతా మౌనంగా ఎందుకు చూస్తూకూర్చున్నారంటావ్!

నీకు తప్పని తోచింది నలుగురి ఎదుటపెట్టడానికి బోలెడు పత్రికలున్నాయి... రాయగలిగితే రాయి. లేదంటే నువ్వు ఆచరించు. అంతే! మరే విధంగానూ, ఏ అలజడులూ సృష్టించకు" అన్నాడు అజ్ఞలాగా.

సింధు నవ్వింది.

"కలం పట్టుకోక మిగిలింది నేనేనన్నమాట. రాయమంటే నవ్వొస్తుంది నాకు. అయినా నాకుచేత కాదే!" అంది మళ్ళా నవ్వుతూ.

కోపంగా చూశాడామెని.

"ఒక్కొక్కరికి ఒక్కో రకమైన స్వభావం వుంటుంది. ఆ స్వభావాన్నిబట్టి జీవితం మలచబడుతుంది. నా జీవితాన్ని ఎలా గడపాలో, ఆనందించటం ఎలాగో నిర్ణయించుకోలేనంత పసిదాన్ని కాదు. అయినా ఇదో పెద్ద ఆదర్శంగా భావించటం లేదు నేను... బాధ్యత అనుకుంటున్నాను. అంతే! ఆ బాధ్యత నాతోపాటు మిగతా పదిమందికీ కూడా వుందని చెప్పటమే నా ప్రయత్నం. ఇందులో మీరు భయపడటానికి ఏముందో, బాధపడే అంశం ఏమిటో నాకర్థం కావటం లేదు" అంది నిట్టూ

అతనికి సహనంపోతోంది నిముష నిముషానికీ. ఎలాచెప్పి ఆమె ఆలోచనల్ని మళ్లించాలో అర్థం కావటంలేదు.

కోపంతో వెళ్ళి కిటికీ దగ్గర నిలబడి బైటకు చూశాడు. మనసంతా బరువుగా తోచింది.

ఆమెకేసి తిరిగి, "సింధూ! నా మాటమీద గౌరవం వుంటే... ఇకనుండి నువ్వే ఉద్యోగాలూ చేయవద్దు... ఏ గొడవలూ పెట్టుకోవద్దు. ప్ర

శాంతమైన జీవితం గడపటమే నాకు ఇష్టం. సాధ్యంకానివాటికోసం తాపత్రయపడటం నాకిష్టం ఉండదు'' అన్నాడు.

ఖచ్చితంగా చెప్పే ఆ తీరు ఆమెకు నచ్చలేదు.

అందుకే అయిష్టంగా ముఖంపెట్టి, ''భర్తగా మీరు ఆజ్ఞాపించకండి. దాన్ని దాటివెళ్తే ఇద్దరికీ బాధ, బరువు. మీరంటే నాకున్న గౌరవం, ప్రేమ మీ మాటని కాదన్నంత మాత్రాన పోయేంత బలహీనమైనవి కావని గుర్తుపెట్టుకోండి'' అంది వణికే గొంతుతో.

''మీరు నామీద చూపించే అంతులేని అనురాగం, అభిమానాలతో పాటుగా, కాస్త ప్రోత్సాహం, ధైర్యం కూడా ఇవ్వండి. నా మనస్సుకి మరింత సంతోషంగా, గర్వంగా వుంటుంది'' అంది ఆశగా.

అతనేం మాట్లాడలేదు. బింకంగా అలాగే నిలబడ్డాడు. అతని ముఖంలో కోపంచూసి, తట్టుకోలేనిదానిలా తలవంచేసింది.

ఇంకొక్క నిముషం అక్కడ నిలబడకుండా అతను బైటికి వెళ్ళిపోయాడు వేగంగా.

ఈ రకమైన సంఘటన ఎదురౌతుందని ఊహించని సింధు కలవరపడి పోయింది. భర్తముఖంలో ఎన్నడూ చూడని బాధ, దుఃఖం, కోపం అన్నీ ఒకేసారిగా కన్పించేసరికి దుఃఖం ముంచుకొచ్చినట్లయింది.

బెడ్‌మీద పడిపోయి దిండులో ముఖం దాచుకుంది సింధు. కనుపాపల నుండి ధారగా కారిన కన్నీరు దిండును తడిపేసింది.

బైట మంచంమీద పడుకున్న సింధు నాన్నమ్మ మురళి భోజనమదీ చేయకుండా ఆవేళప్పుడు బైటికి వెళ్ళటంచూసి, హడావిడిగా గదిలోకి వచ్చింది.

సింధు ఆవిడ రాక గమనించి గబగబ కళ్ళు తుడుచుకుని, సేఫ్‌లో ఏదో సర్దుతూ నిలబడింది.

''సింధూ! ఏమిటమ్మా ఇంకా భోజనం చేయలేదు... అబ్బాయి ఎక్కడికి వెళుతున్నాడు?'' అని అడిగింది.

''చేస్తాంలే నాన్నమ్మా!'' అని సేఫ్ తలుపులు మూసివచ్చి ఆవిడ భుజాలు పట్టుకుని, ''నాన్నమ్మా! ఆయనకి ఆఫీసరుగా ప్రమోషన్ వచ్చింది. అందుకని స్వీట్స్‌తెచ్చి నీకిచ్చి అప్పుడుకానీ చెప్పకూడదని బైటికి వెళ్ళారు'' అంది నవ్వుతూ.

ఆవిడ ముఖంలో ఆనందం వర్ణించనలవికాదు. సింధు తలని ప్రేమగా నిమురుతూ, ''మురళిలాంటి మనిషి నీకు దొరకడం అదృష్టం అమ్మా! నీ మొండితనంతో అతన్నెప్పుడూ బాధపెట్టకు. ఉత్త ఆఫీసరే కాదు... ఇంకా పెద్ద ఆఫీసరవుతాడు. అతని జాతకం మంచిది'' అంది వాత్సల్యంగా.

ఆవిడ తమమధ్య ఘర్షణను గమనించే అలా అంటోందని గ్రహించింది సింధు. అయినా పైకి నవ్వింది.

''నన్ను చేసుకున్నాకేకదా నాన్నమ్మా ఆయన జాతకం మారింది. అదేదో ఆయన గొప్పతనంలా చెప్తున్నావే?'' అంది మూతి ముడుచుకుని.

''గొప్పతనమేనే... ఆ నిదానం, ఓర్పు, మంచితనం ఎవరిలో వుంటాయి. అవే మనిషిని ఉన్నతుణ్ణి చేస్తాయి'' అంది మెచ్చుకోలుగా.

''సరేలే... ఆయన్ని నువ్వెప్పుడు పొగడకుండా వున్నావు గనక. నీ దగ్గర అలా నటించి బాగా బుట్టలో వేసేశారు. హుఁ... ఆయనెంత బుద్ధిమంతులో నాకు తెలియదా ఏమిటి?'' ఆమెను ఉడికించాలని అలా అనేసి తాను వంటగదిలోకి వెళ్ళి గిన్నెలమీద మూతలు తీసిచూసింది.

మురళికిష్టమైన బెండకాయ కొబ్బరి, ములక్కాడల కూర చూడగానే ప్రాణం ఉసూరుమనిపించింది. చాలా ఆకలిగా అనిపించింది.

అన్నం తినకుండా ఎక్కడికి వెళ్ళినట్టు... ఓ అరగంట తిరిగేసరికి తనే వస్తారు. అప్పటివరకూ వెయిట్‌చేస్తే ఇద్దరూ కలిసి భోంచేయవచ్చనిపించి మళ్ళా బెడ్‌రూమ్‌లోకి వచ్చి పడుకుంది.

కళ్ళు మూసుకుంది కానీ, కళ్ళనిండా భర్త ముఖమే కన్పిస్తుంటే.. ఇబ్బందిగా అటు ఇటు కదిలింది.

క్రమంగా ఆమె ఆలోచనలనుండి మురళి రూపం చెదిరి... తన భవిష్యత్ కార్యక్రమాల చుట్టూ చేరాయి.

మనసుని కుదిపేసే ఆలోచనలు...

ఊపిరి అందనట్టు ఉక్కిరి బిక్కిరియ్యే ఆలోచనలు...

అలాగే నిద్రపోయింది.

ఎప్పుడో తెల్లవారు ఝామున గబుక్కున మెలకువవచ్చి కళ్ళువిప్పి చూస్తే, తన చేయి గుండెకు గట్టిగా ఆనించుకుని నిద్రపోతున్న మురళిని చూసి చిన్నగా నవ్వుకుంది.

పక్కకు తిరిగి అతని పెదవులమీద గట్టిగా ముద్దుపెట్టుకుంది.

అతను లేవలేదు. కళ్ళు విప్పలేదు. నిద్రపో తున్న భంగిమలో మార్పు లేదు.

అతని షర్టు పాకెట్‌లో కన్పిస్తున్న కాగి తంతీసి చూసింది. సినిమా టికెట్లు. అది చూస్తూ నవ్వుకుంది. తనమీద కోపంతో సినిమా కెళ్ళి కూర్చున్నారన్నమాట అనుకుని కళ్ళు మూసుకుంది.

అలా కళ్ళు మూసుకుని పడుకున్న సింధు తెల్లారి లేవలేకపోయింది. చాలా నీరసంగా అనిపించి అలాగే పడుకుంది.

మురళి లేచి పేపరు చదువుతూ, కాఫీ తాగుతున్నాడు.

అంతే! ఒక్క ఉదుటున లేచి కూర్చుంది అతన్ని చూసి.

వళ్ళు మండిపోయింది. తనని లేపకుండా, పలకరించకుండా, తన దారిన తాను నాన్నమ్మ ఇచ్చిన కాఫీ తాగుతూ రిలాక్స్‌గా పేపరు చదువుతుంటే కడుపు కాలి పోతున్నట్టని పించిందామెకి.

పక్కమీంచి లేచి, విసురుగా వెళ్ళి పేపరు లాగి అవతలపడేసింది.

ఆమె వంకకూడా చూడకుండా కాఫీతాగి కప్పుపక్కన పెట్టి కుర్చీలోంచి లేవబోతున్న మురళిని ఒక్కతోపు తోసింది. మళ్ళా కుర్చీలోనే కూలబడ్డాడు.

అయినా ఆమెతో మాట్లాడలేదు. ఆమెవంక చూడలేదు. ఆమె చేష్టలకు మాత్రం మనసు లోనే నవ్వుకున్నాడు.

రెండురోజులు అలా సీరియస్‌గా వుంటే తప్ప ఆమె తన దారికి రాదు.

ఆమెను చూడకుండా, మాట్లాడకుండా, ఆమె వెనకే తిరుగుతూ ఏదోఒక కొంటెపని చేయకుండా క్షణంకూడా గడపలేని అతను అయిష్టంగానే ముభావం నటించాడు.

నిటారుగా నిలబడి అతనివంక చూసింది. అతని చూపులు ఎటో వున్నాయి.

వంగుని అతని కళ్ళల్లోకి చూస్తూ, "నిన్న ఉదయం తిన్న అన్నం. ఇప్పటివరకూ మంచి నీళ్ళు కూడా తాగలేదే! రాత్రంతా మీకోసం ఎదురుచూస్తూ కూర్చున్నానే! గొప్ప ప్రేమంటా రు. నన్ను లేపకుండా కాఫీ తాగేస్తున్నారే?" అంది.

అతను కుర్చీ వెనక్కి వాలి కళ్ళు మూసు కుని, "గొప్ప ప్రేమేకాదు... దేవతలా నిన్ను ఆరాధిస్తున్నానుకదూ! అందుకు... అందుకు నేనంటే నీకు ఆట" అన్నాడు.

ఆ మాటకి ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మౌనంగా అక్కణ్ణించి వెళ్ళిపోయిందామె. ఆమె వెళ్తుంటే కళ్ళనిండా చూసుకున్నాడు.

ఆమెతో పలక్కుండానే ఆఫీసుకు వెళ్ళిపో యాడారోజు.

సింధు ఆఫీసుకి బయల్దేరకపోవటంచూసి ఆమె నాన్నమ్మ అడిగింది.

"రెండురోజులు శెలవుపెట్టాను నాన్నమ్మా! ఈరోజు కాస్త బైటికి వెళ్ళాల్సిన పనివుంది" అంటూ స్నానం చేసి, టిఫిన్‌తిని సరాసరి తనకు తెలిసిన లేడీ డాక్టర్ దగ్గరికి వెళ్ళాలని బయల్దేరింది.

రెండురోజుల్నుంచి తననావహించిన నీరసం సంగతేమిటో తేల్చుకోవాలని ఆమె ఉద్దేశం.

ఆమెను టెస్ట్‌చేసి, "యూ ఆర్ గోయింగ్ టుబిఏ మదర్" అని నవ్వుతూ చెప్పింది.

సింధు మనసులో సంతోషపుసవ్వడి.

అది పంచుకోడానికి ఆక్షణంలో అక్కడ మురళి లేనందుకు కాస్త బాధనిపించింది.

హాస్పిటల్ నుంచి సరాసరి తన ప్రియస్నే

హితురాలు భార్గవి దగ్గరకు వెళ్ళింది.

ఆ సమయంలో భార్గవి ఇంట్లోనేవుంది.

సింధుని చూసి ఆప్యాయంగా ఆహ్వానించింది.

సింధు తను డాక్టర్‌దగ్గరికి వెళ్లివస్తున్నట్టుగా చెప్పలేదామెకు. తను తల్లి కాబోతున్న విషయం ముందు మురళికే చెప్పాలనే తవన. అందుకే ఇంటినుంచే వస్తున్నట్టు చెప్పింది.

"ఏమిటీవేళ ఆఫీసుకు ఎగనామమా!" అంది కాఫీతెస్తూ.

"కాదు... పూర్తిగా తిలోదకాలిచ్చేశాను" అంది తాపీగా.

"అదేం?" అంది ఆశ్చర్యపోయి.

జరిగిపోయిన సంఘటనల్ని సాధ్యమైనంత క్లుప్తంగా చెప్పడానికి ప్రయత్నించింది సింధు.

ఆమె చెప్పే ప్రతిమాట, ఉద్వేగంతోనూ, ఆశ్చర్యంతోనూ వింది భార్గవి.



సింధు ధైర్యానికీ, తెగువకీ, ఉద్దేశాలకీ హేట్సాఫ్ అనుకుంది భార్గవి మనసులోనే.

"ఇప్పుడేం చేద్దామని సింధూ!" అంది.

"ఏదో ఒకటిచేయాలి. అందుకు నీ సహకారం కావాలి. అది అడగాలనే వచ్చాను" అంది.

ఆమె చేతిలో చేయివేసి అంది భార్గవి.

"తప్పకుండా సింధూ! ఆలోచనలకూ ... ఆచరణలకు మధ్యదూరాన్ని ఛేదిస్తూ, అపస్వరాలతో నడుస్తున్న సాహిత్యానికి కొత్త స్వరాలు కూర్చాలనే నీ ప్రయత్నానికి నా ప్రోత్సాహమేకాదు, ఏంచేయాలిచెప్పు... చేస్తాను" అంది ఆర్ద్రంగా.

"థాంక్స్ భార్గవీ! నాప్లాన్స్ ఇంకా పూర్తికాలేదు. రేపు చెప్తాను" అంటూ మరోసారి కృతజ్ఞతలు చెప్పింది.

"నీమొహం. మనమధ్య కృతజ్ఞతలేమిటి? ఆజ్ఞలేకానీ!" అని నవ్వింది భార్గవి.

మురళిని గురించిన విశేషాలు అడిగినప్పుడు క్రితంరోజు నుంచి అతని ప్రవర్తన గురించి చెప్పి, నవ్వింది సింధు.

చాలాసేపు అలా మాట్లాడుకుంటూనే వున్నారిద్దరూ! వాళ్లింట్లోనే భోజనంచేసి ఇంటికి బయల్దేరింది సింధు.

స్వీట్ పాకెట్‌కొని, తెచ్చి నాన్నమ్మ నోట్లో కుక్కింది ఓ స్వీటు.

మురళి ప్రమోషన్ సంగతి తెలిసివుండటంవల్ల ఆవిడేం మాట్లాడకుండా స్వీట్ తిన్నది.

ఆ మధ్యాహ్నమంతా చాలా బోర్‌గా గడిపేసింది సింధు. ఎప్పుడెప్పుడొస్తాడా అని భర్త కోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

అతను కావాలని ఆరోజు చాలా ఆలస్యంగా వచ్చాడు. వస్తూనే ఉస్సురంటూ షూ విప్పి అవతలపడేసి, షర్టు విప్పబోతుంటే సింధు అతన్ని గట్టిగా చుట్టేసి ఉక్కిరిబిక్కిరి చేసింది.

ఒక స్వీట్‌తీసి అతని నోట్లో పెట్టి అతని చెవిలో గునగునగా చెప్పింది.

అప్పటివరకూ నటిస్తున్న కోపమంతా ఒకసారిగా వెన్నలాకరిగింది.

ఆమెను గట్టిగా తనకు హత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"సింధూ! మై హార్ట్, ఒక్కరోజు నీతో మాట్లాడకపోతే, నా జీవితమంతా శూన్యంగా అన్పించిందే. ఎందుకు నన్నిలా బాధపెడతావు" అన్నాడు వేదనగా.

అతని మాటలకు అంతవరకూ నిగ్రహించుకున్న దుఃఖం ఒక్కసారిగా బైటికి వచ్చేసింది. ఆమె కళ్లల్లో నీళ్లుచూసి, ఉద్వేగం అదుపులోకి తెచ్చుకుంటూ ఆప్యాయంగా ఆమె తలనిమిరాడు.

కొండలమీంచిదూకే సెలయేరులా పొంగి పొరలుతున్న ప్రేమతో ఆమెను ఒక్కనిముషం కూడా వదలకుండా, అన్నం కలిపి ముద్దలు తినిపిస్తూ, అపురూపంగా చూసుకున్నాడు ఆమెని మురళి.

"మురళీ... నా కోరిక తీర్చండి ప్లీజ్. స్టూడెంట్స్‌తో ఒక మీటింగ్ అరేంజ్‌చేసి చిన్న రెవల్యూషన్‌లాంటిది తేవాలని నా ఉద్దేశం. మీ ఆశీర్వాదం, సహకారం నాకుంటే, ఏ అలజడి కలగదు. అనుకున్నది నెరవేరుతుంది.

ఒక్కసారి జనం బలం ఏమిటో, పాఠకులు మూర్ఖులు కాదనీ, పిచ్చిరాతల్ని ఎంతగా నిరసిస్తున్నారో ఒక్కసారి తెలియజెప్పాలని అంతే! అదే నా ఉద్దేశం... ప్లీజ్" అని అతన్ని బతిమాలింది. ఆరాత్రి పడుకోబోయేముందు.

ఆమె తల నిమిరి- "అలాగే సింధూ... నేను చెప్పినా నువ్వు వినవు. నీయిష్టం. నీ ఆరోగ్యం జాగ్రత్త. నీలో పెరిగే మనరూపం నాకెంత అపురూపమో గ్రహించు చాలు" అన్నాడు.

యుగాల నిశ్శబ్దం తర్వాత ఉన్నట్టుండి సప్తస్వరాల సంగీతం చెవులకు సోకినంత ఆనందం కలిగింది అతని మాటలకి.

అతన్ని అలాగే అంటిపెట్టుకుని పడుకుంది నిశ్చింతగా.

★ ★ ★

ఆ తర్వాత రెండురోజులకే భార్గవి, వల్లి తన కొలీగ్ మాలతితోకలిసి అన్ని కాలేజీలకు వెళ్లి, సాహిత్యమా నువ్వెటుపోతున్నావ్? అనే




టైటిల్‌తో వేసిన పాంప్లేట్స్ పంచారు. మిగ తావి ఊరువూరంతా పంచిపెట్టే ఏర్పాటుచే సింది.

అదే పాంప్లేట్స్‌లో ఆ మరుసటిరోజు తాము అరేంజ్ చేస్తున్న సభకి వారందరినీ రమ్మని కోరింది.

ఆ పాంప్లేట్స్‌చూసి, ముక్కుమీద వేలేసుకు న్నవారూ, నిర్లిప్తంగా నవ్వుకున్నవారూ తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చునేమో కానీ, ప్రస్తుతం వస్తున్న సాహిత్యాన్ని మార్చటం అనేది మాత్రం సాధ్యమయ్యే పనికాదని అను కున్నవారూ ఈ రకమైన ఆదర్శాన్ని తపనను అర్థం చేసుకుని తలపంకించినవారూ, ఇలా... ఎందరో ఎన్నోరకాల వ్యాఖ్యలు, విమర్శలు, పొగడ్తలు చాలావచ్చాయి.

సింధు నెలతప్పిన విషయం ఆమె నాన్న మ్మకి తెలుసు కానీ, ఉద్యోగంమానేసి ప్రస్తుతం ఆమెచేపట్టిన కార్యక్రమం విషయం మాత్రం తెలీదు. త్వరలో తను మునిమనవణ్ణి ఎత్తుకోబో తున్నాననే ఆనందంలోంచి ఆవిడ తేరుకోలే దు. ఏదో కొండెక్కినంత సంబరపడిపోతోంది.

"సింధూ... నా మనవణ్ణి చూడడం కోసమే బతికివున్నానేమో! ఈ అదృష్టం అందరికీ రాదమ్మా! వాడిని చూశాక ఇంక నాప్రాణాలు ఎప్పుడు అనంతంలో కలిసిపోయినా బాధలే దు" అంది.

"అలా అనకు నాన్నమ్మా! నువ్వే వాడిని పెంచి పెద్దచేయాలి. నీచేతుల్లో పెరగటం నాదెంత అదృష్టమో ... ఆ భాగ్యం వాడికి కూడా కలగాలని ఆ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. నిజం నాన్నమ్మా" అని ఆవిడ ఒడిలో తలపె ట్టుకుని మనుకారంగా అనేది సింధు.

ఆవిడ కళ్ళు ఆర్ద్రమై కన్నీళ్లు వచ్చాయి.

సింధుకి ఇష్టమైనవీ, ఆరోగ్యమైనవీ ఎప్పు డూ ఏదో ఒకటి చేయటం, బలవంతంగా ఆమెకు తినిపించటం ... తినకపోతే మురళికి ఫిర్యాదు చేయటం ఇదే ఆవిడపని.

"అదే పనిగా తింటే బేబీవెయిట్ పెరుగు తుంది. ఆ తర్వాత కానుపు కష్టమౌతుంది నాన్నమ్మా!" అన్నాకూడా ఆవిడేం వినేదికాదు.

"దేశంలో ఇంతమంది డాక్టర్లున్నారు. పైన న్నాడు. నీకేం భయంలేదు" అనేది.

ఆమె మాటలకు పడిపడీ నవ్వింది సింధు.

"దేశంలో డాక్టర్లంతా నీ మనవరాలి కానుపు కష్టంకాకుండా చూడ్డమే ధ్యేయంగా పెట్టుకు న్నారంటావా నాన్నమ్మా!" అని ఆమెను వెక్కి రించేది.

ఆవిడ అవేం పట్టించుకునేది కాదు. సింధు మీదవున్న ప్రేమ మమకారాలు అలాంటివి.




ఆ రోజు సాయంకాలం ఆరుగంటలకి మీ టింగ్ ప్రారంభమైంది.

సింధు నిర్వహిస్తున్న ఈ సాహితీ సమరాని కి ఆమె కొలీగ్స్, స్నేహితులు ఆమెకు అండగా నిలబడ్డారు. ఆమెను కంటికి రెప్పలా కాపాడు కోడం మురళి తన బాధ్యతగా తీసుకున్నాడు.

సింధు మొదట్లో చాలా భయపడింది. తా ను నిర్వహిస్తున్న ఈ సమరానికి సారథి తానొ క్కతే కాదనీ, దేశాన్ని నడిపించేది, ప్రగతిని సాధించేదీ అయిన యువశక్తి ఈ శంఖారావా న్ని పూరించాలని; అది సాధ్యమవునో కాదో అని మధనపడిన ఆమె మనసుకు, ఆరోజు మీ టింగ్‌కి వచ్చిన స్టూడెంట్స్‌ని చూసిన తర్వాత కొండంత ధైర్యం వచ్చింది.

వారి మనసుల్లో ఏముందో... తాను చెప్ప బోయే విషయాలను ఎలా రిసీవ్ చేసుకుంటా రో, ఆ తర్వాత విషయం అనుకుంది.

ఆమె స్టేజీ మీదకొచ్చి స్పీకర్ ముందు నిల్చుని హాలంతా ఒక్కసారి పరికించి చూ సింది.

హాలంతా గందరగోళంగా వుంది. జనం

అరుపులతో, అల్లరితో, పిల్లికూతలు, నక్క అరుపులు...

ఒక్క క్షణం అలా నిలబడి ఆ తర్వాత గొంతు విప్పింది.

"అలజడి మా జీవితం, ఆందోళన మా వూపిరి. తిరుగుబాటు మా వేదాంతం అన్నారు జాతిని శక్తివంతం చేసే మీ యువత గురించే. మిమ్మల్ని చూశాక అది నిజం అనిపిస్తోంది. నేను రచయిత్రిని కాదు. పొలిటీషియన్నీకాదు. సంఘసంస్కర్తనూ కాదు. మామూలు మనిషిని. ఏ సాహితీ ప్రక్రియ అయితే మనిషిలో మంచి మార్పుని తెస్తుందో, అదే సాహిత్యం అని పిలవబడటానికి అర్హత కలిగి వుంటుందని నమ్మే మామూలు మనిషిని.

నా మాట మీద విలువ, శ్రద్ధ వుంచి మీరంతా ఇలా వచ్చినందుకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో అర్థంకావటంలేదు. పెద్దలు, పండితులు వుంటే చేతులెత్తి నమస్కరిస్తున్నాను, చిన్నవాళ్ళయితే అర్థిస్తున్నాను... నాతో అడుగు ముందుకు వేయమని"

అంతే! చప్పట్లు మారుమోగాయి హాలంతా!

ఆమెలోని నిజాయితీ, అందర్నీ ఆకట్టుకునే సరళమైన మాట తీరు ఫలితంగా చప్పట్లతో హాలుదద్దరిల్లిపోయింది. తర్వాత రెండు నిముషాలు నిశ్శబ్దం.

"ప్రపంచాన్ని చూడలేక కవిత నిజం చూపదు.

ఇనకలోన తలదూర్చిన ఉష్ణపక్షి బావతు' అనే సిద్ధాంతాన్ని నమ్మి విశ్వదృష్టికి అశ్రువును ధారపోశాడు మహాకవి. తన కవితాధారను ప్రపంచంమీద ప్రవహింపచేసేముందు కవి తానెంత తపనపడ్డాడో ఏయే ఘోషలు విన్నాడో?

ఇప్పుడు అలా తపనపడి, కలవరించి రాసే రచయితలు ఎక్కడున్నారు? ఈ అనంత సాహితీ జగత్తుకి రాసేవాడే సృష్టికర్త. లోకం సమస్తం అతని రచనల్లో ప్రతిబింబిస్తుంది.

ఈ భూమి మీద ఆదికవి వాల్మీకి నుండి వెలువడిన శోకం... శ్లోకత్వాన్ని ఏ సమయంలో పొందిందో అప్పటినుండీ మన సాహిత్యం అవిచ్ఛిన్నంగా కొనసాగుతోంది.

నేటి సాహిత్యం ఒక్కసారి పరిశీలించి చూడండి. సమాజాన్ని చైతన్యవంతంచేయవలసిన సాహిత్యం జాతిని ఎంత నిర్వీర్యం చేస్తోందో మీకే అర్థంమౌతుంది.

ఆత్మవిశ్వాసం సడలి, నశించి, నిరాశానిస్పృహలు ఆవరించి, అత్యంత తీవ్రమైన వైరుధ్యాలతో వున్న మన సమాజాన్ని మేల్కొల్పడానికి ఇప్పుడొచ్చే సాహిత్యం ఎంతవరకూ ఉపకరిస్తుంది?!

వివేకంలేని జ్ఞానం, వినయంలేని చదువు, విజ్ఞతలేని పాండిత్యం, శీల రహితమైన విద్య వున్నా ప్రయోజనం లేదన్నాడు వివేకానందుడు. తన రచనల అద్దంలో లోకాన్ని చూపని రచయిత రచయితే కాదంటాను నేను.

పాఠకులు శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించే స్థితికి ఎదిగిపోయారనిపిస్తే అప్పుడు ఎలాంటి సాహిత్యం విడుదలైనా అది ఏ రకమైన ప్రభావాన్నీ చూపించలేదు- కాలక్షేపంకింద చదివి అవతల పారేసేవారు.

కానీ ఇప్పుడున్న పరిస్థితులు అలా లేవే! రచయిత ఏది రాస్తే అదే వేదమనీ, రచనల్లో వుండేవిధంగా బతకాలనీ కోరుకుంటున్నారు.

అలాంటి సమయంలో సబ్జక్ట్సు ఏమిటి? అందమైన బీద యువతికి, ఆరడుగుల లక్షాధికారికి మధ్య ప్రణయం, ఇంప్రెషనబుల్ ఏజ్‌లో వుండే పిల్లల్ని వూహల వుయ్యాలలూగించేలా చేస్తుంటే... వాస్తవంలో ఎదుర్కోవలసిన సమస్యలకు తట్టుకోలేక అశాంతితో కుములిపోతూ ఎంతమంది లేరు?

సెక్స్, క్రైమ్, సస్పెన్స్, థ్రిల్లర్సు వరదలా వస్తుంటే అవి చదివి వాస్తవంలో వాటిని అమలుపరిచేవారు ఎంతమంది లేరు? ఇది సమాజానికి ఎంత చెరుపు చేస్తుంది.

సాధారణ కుటుంబాల సమస్యలుకానీ, వాస్తవిక భావచిత్రణకానీ, ఏదో ఒక స్పష్టమైన ఆదర్శాన్ని ప్రజల ముందుంచడమో చేయగలిగితే ఇప్పుడింత ఆందోళన పడవలసిన పనివుండేది కాదు. ప్రపంచాన్ని చూడని రచన వాస్తవాన్ని ఎలా చూపిస్తుంది?!

సాహితీ జగత్తును అంధకారం ఆవరించిన

# అందం – ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.



ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగల్రు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

'' MFG. LICENEENº. AUS 59/75''

Contact our new sole Distributors

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**




450 Grams Rs. 40/-



వి.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రాడక్ట్స్
పి.బి.నం. 880 17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-560 008

SINDU

ప్పుడు దాన్ని పారదోలడానికి జ్ఞాన భాస్కరుడు ఉదయించాలి! అతని ఉదయం కోసమే ఈ తపన ఈ ఉద్యమం...

చప్పట్లతో దద్దరిల్లింది హాలు.

సింధూకే ఆశ్చర్యం వేసింది. సభ మొదలెట్టకముందు కోతిమూకలా ప్రవర్తించినవాళ్ళేనా వీళ్ళూ... అని!

మరునటిరోజు మీటింగ్ ఒక కాలేజీలో అరేంజ్ చేసింది ప్రిన్సిపాల్ పర్మిషన్‌తో. మొదటిరోజుకన్నా ఎక్కువమంది వచ్చారా సభకి.

"మానవుని శబ్దంనుంచి వచ్చిన భాష మానవునికి ప్రాణమైంది. భాషకు ముఖ్యమైంది వాక్యనిర్మాణం, పదప్రయోగం. కథలు చదివేది పండితులే కాదు సామాన్యులు కూడా! ఇప్పుడొస్తున్న నవలలు చదువుతూంటే ఆ భాషకు తికమక పడాల్సి వస్తోంది. కథాకథనం లేని పిచ్చిరాతలకు, పండితులకు తప్ప అర్థంకాని భాషాప్రయోగం దేనికో ఆ రాసేవాళ్ళకే తెలియాలి. వ్యవహారిక వాక్యాల్లో స్పష్టత లేని కథను పూర్తిగా నిరసించాలి.

ఈ అర్థంలేని సెంటిమెంటుతో క్రైమ్, సస్పెన్సులలో ఎవరికీ పనికిరాని విషయాల మీద రాయటమే జీవితధ్యేయంగా పెట్టుకోవటంతో సాహిత్యం పూర్తిగా కలుషితమైపోయింది. ఈ సాహితీ కాలుష్యం మనమీద స్లో పాయిజన్‌లా పనిచేస్తుంది. తెలుగు సాహిత్యం మీద అభిమానం వున్న ఏ పాఠకుడైనా ఈ సాహితీ కాలుష్యాన్ని గురించి బాధపడతాడు... ఆవేదన చెందుతాడు.

రచయిత శక్తిసామర్థ్యాలకు అంతటి విలువ ఇవ్వగలిగిన పాఠకులకి రచయితలు చేస్తున్న మేలు ఏమిటి? "ఐ లవ్ యూ"తో ప్రారంభించి ఐ హేట్ యూతో ముగిసే ప్రేమకథలను ఎన్నాళ్ళు చదవగలం?

తమ ఇష్టమొచ్చిన రాతలు రాసి మనమీదికి విసిరి డబ్బు చేసుకుంటున్న రచయితల్ని పాఠకులు క్షమించకూడదు. సాహిత్యం సాంఘిక జీవితంలో అనివార్యమైపోయింది... అందుకే ఈ బాధ.

ప్రేమ, ప్రణయం, స్వేచ్ఛ, మూఢాచారాలు, ఏది ఇతివృత్తంగా తీసుకున్నా సామాజిక విలువల పాత్రను కూడా పరిగణనలోనికి తీసుకోవాలి!

సమాజాన్ని పెడదారిపట్టిస్తున్న మూఢాచారాలు, నమ్మకాలను ఖండిస్తూ తాము నమ్మిన సిద్ధాంతాలను, ఆదర్శాలను నిజం చేసేందుకు కలంపట్టారు గురజాడ, వీరేశలింగం.

అనాథల కోసం, పతితలు భ్రష్టుల కోసం, సమసమాజం కోసం తన రక్తాన్ని సిరాగా మార్చి, కవిత్వాన్ని కత్తులుగాచేసి విప్లవాన్ని సృష్టించాడు శ్రీశ్రీ.

ప్రేమతత్వమే అయినా, ఊహల్లో ఊర్వశిని సృష్టించి ఆరాధించి రాసిన కృష్ణశాస్త్రి గీతాలు ప్రశాంతమైన ఆనందాన్నిస్తాయి ఎవరికైనా! ఇలా ఎంతమందినైనా చెప్పుకోగలిగే అదృష్టాన్ని మనకు కలిగించారు ఒకనాడు వీళ్ళంతా!

మరి ఇప్పుడే ఎందుకు పట్టిందో ఈ గ్రహణం! పట్టిన గ్రహణాన్ని విడిపించుకుందాం. ఇష్టంలేని రాతల్ని పనికిమాలిన రాతల్ని నిరసిద్దాం... రండి. మాతో చేతులు కలపండి. ఉత్త ట్రాష్ రాసిన పుస్తకాలన్నీ తగులబెట్టండి. ఉరకలెత్తే ఉద్రేకంతో పాఠకుల ఘోషల్ని ప్రజ్వలింపజేసి, భూకంపాన్ని సృష్టిద్దాం. అవసరాలకు తల్లొంచుతున్న ఎడిటర్స్, జర్నలిస్టుల్లో అలజడి రేపుదాం! మాకు పనికిరాని సాహిత్యం ఇకముందు విడుదల చేయటాన్ని సహించమని ప్రతిధ్వనింపజేద్దాం... రండి" అంది సింధు ఆవేశంతో.

సభలో భయంకరమైన నిశ్శబ్దం. సింధు గుండె చలించటం ఆగిపోయినట్లయింది ఒక్కక్షణం. వారి మౌనం తన ఆవేశం మీద నీళ్ళు చల్లినట్లయింది.

తను నమ్మిన సిద్ధాంతం కోసం, రేయింబవళ్ళూ ఆలోచించి, మధనపడి, మానసికంగా ఎంతనలిగిపోయిందో వీళ్లకెలా తెలుస్తుంది? కాల్పనిక జగత్తులో బతుకుతున్న పాఠకులకు వాస్తవాల్ని వివరించాలనే తన ప్రయత్నాన్ని వీళ్ళెప్పటికీ అర్థం చేసుకోలేరా? ఏమిటి వీరిలో ఇంత ఉదాసీనత?

వీరిలో రోషాగ్నులు వెదజల్లి, స్వార్థపూరిత ప్రపంచాన్ని ఎదిరించటం నేర్పుదామనుకున్నది తను. కొత్త సాహితీలోకాన్ని సృష్టిద్దామని

కలలుకన్నది తను. అవన్నీ గాలిలో కలిసిపోయేవేనా?... ఆలోచనలతో ఆమె కంఠం మూగబోయింది.

మీకు తెలుసో తెలియదోగానీ... మనల్ని ముందుకు నడిపించేది సాహిత్యం. పదమూడేళ్ళ అమ్మాయి తన బాయ్‌ఫ్రెండ్‌తో ముద్దుల ప్రపంచంలోకి చూస్తున్నదంటే... దేని ప్రభావం అంటారు?

కారణాలు అనేకం కావచ్చు. మొదటిది సినిమా... రెండోది సాహిత్యం. జీవితం జీవించటానికేగానీ పతనం కావటంకోసం కాదు. ముద్దుపెట్టుకున్నంతమాత్రాన మలినం అయిపోయిందని అనటంలేదు. అందుకు ఆ అమ్మాయిని ప్రేరేపించినదేదో అదే రేపు పతనం కావటానికి కూడా కారణభూతం అవుతుందంటున్నాను.

నేను చేయబోయే ఈ యజ్ఞానికి, నాతో గొంతు కలిపి నాతోపాటు నడుస్తారనుకున్నాను. నా కంఠం, ఆలోచన, ఆవేదన, మీ కోసం... మన కోసమే, ఈ సాహిత్యం నుంచి రక్షించుకుందామనే. పాపం పుణ్యం ఎరుగని పూవుల్లాటి మనసుల్లోకి పాయిజన్‌లా ఎక్కుతున్న జుగుప్స కలిగించే సాహిత్యాన్ని ఇకముందు ఏ ఒక్కరి చేతుల్లోనూపడి వారి మనసుల్ని మలినం కాకుండా చేయాలని ఎన్నో అనుకున్నాను.

అయినా నేను భయపడను... నా లక్ష్యాన్ని విడిచి పెట్టను. ఒంటరిగా పోరాడతాను. నా ఒక్కగొంతులో వేలమంది ఆక్రోశాన్ని, బాధని, ఆవేదనని పలికిస్తాను. నా సందేశం, నా తపన, నా ఆవేశం ఏ ఒక్కరచయిత గుండెల్లోనయినా చలనాన్ని సృష్టిస్తుందేమో చూస్తాను...''

ఆమె మాటలు పూర్తికాకుండానే జనం కొట్టిన చప్పట్లతో ఆ ప్రదేశం అంతా దద్దరిల్లిపోయింది.

ఆమె మనసు మంచులా కరిగిపోయింది. కళ్ళల్లో నిల్చిననీరు వారి రూపం అస్పష్టంగా కన్పించేట్టు చేస్తుంటే...

''మీతోపాటు మేమూ నడుస్తాం! మాకీ సాహిత్యం వద్దు... వద్దు'' అన్న నినాదాలు విని ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

నుదుటినుండి ధారాపాతంగా కారుతున్న స్వేదబిందువుల్ని తడైన కళ్ళని తుడుచుకుని అడుగుముందుకు వేసింది మహెూద్వేగంతో!

సింధు స్టేజిదిగి ముందుకు వెళ్లబోతుంటే... ఆమె చేతిలో ఓ వ్యక్తి చేయి వేయటం చూసి, సింధు ఆ చేతిని, ఆ వ్యక్తిని ఆశ్చర్యంగా చూసింది.

''మమతా!'' అంది సంభ్రమంగా.

''రాజు విడుదలయ్యాడు'' అంది. అంతే! ఆపైన ఆమె మాట్లాడలేదు. అడుగులు మాత్రం ముందుకు వేసింది వేగంగా సింధుతోపాటు.

ఎడిటర్ జయరామ్, మరో ఇద్దరు జర్నలిస్టులు, కొందరు రచయితలు, కూడా వచ్చారు ఆ సభకు, కేవలం అదేమిటో చూద్దామని.

జయరామ్ సింధుని అక్కడి జనసందోహాన్ని చూసి నిశ్చేష్టుడయ్యాడు. ఆయనకు మతిపోయినంత పనయింది.

ఊహించని పరిణామం అది.

రెండురోజుల్నించి ఆమె లిటరరీ అసోసియేషన్‌లో మీటింగ్స్ అరేంజ్ చేస్తున్నదని విన్నాడు. పేపర్లలో కూడా చదివాడు. కానీ ఇలా విద్యార్థుల్ని ఉత్తేజపరచగలదని కలలో కూడా ఊహించలేదాయన.

ఆ సమూహంలో ఓవక్కగా తన కూతుర్ని కూడా చూసి షాక్ తిన్నాడాయన.

కొంతకాలం క్రితం ఆ పిల్ల తను వేస్తున్న ఓ సీరియల్ చాలాచాలా బాగుందని మెచ్చుకున్నప్పుడూ ఇలాగే షాక్ తిన్నాడు తను.

''ఆ చెత్త'' గురించి గంటన్నర ఉపన్యసించాడు, ఇంకెపుడు అలాంటివి చదవవద్దని హితోపదేశం చేశాడు.

''మరి అలాంటి చెత్త ఎందుకు వేస్తున్నారు నాన్నగారూ? ఎడిటర్ మీరేగదా?'' అంటే తడబడ్డాడు.

ఇపుడీ పిల్ల, తన రక్తం, తన ప్రాణం, తనబిడ్డ తనకన్నా ఎదిగిపోయిందన్నమాట.

తలవంచుకుని బాధగా బయటకు నడిచాడు జయరాం.



# వసంత ఫీచర్



## 'స్విస్' అంటే...!

ఇటీవల స్విస్‌బాంక్‌లు మనదేశంలో ఓ రాజకీయ కల్లోలానికి కారణమయ్యాయి. సినీనటుడు, పార్లమెంటు సభ్యుడు అయిన అమితాబ్ బచ్చన్, అతని సోదరుడు అజితాబ్ బచ్చన్ మరెందరో ప్రముఖులూ స్విస్‌బ్యాంకుల్లో అక్రమధనాన్ని నిలువచేశారని ఆరోపించబడింది. స్విస్‌బ్యాంకుల్లో భారతీయుల అక్రమ ధననిలువల విషయమై పరిశోధన జరపడానికి మాజీ ఆర్థికశాఖా మంత్రి వి.పి. సింగ్ 'ఫైర్‌ఫాక్స్' అనే ఓ విదేశీ గూఢచార సంస్థను నియమించారు. దాంతో చెలరేగిన రాజకీయ వివాదాల్లో ఆయన రాజీనామా కూడా చేశారు. ఈ రాజకీయాలు, ఆర్థిక విషయాలు అలా ఉంచితే, అసలా "స్విస్" అనబడే స్విట్జర్లాండ్ ఏమిటి?



ఏ దేశం వారికయినా వారి దేశం 'సారేజహాసే అచ్ఛా' అనిపించడంలో ఆశ్చర్యమేమీలేదు. కానీ, స్విట్జర్లాండును చూసిన ఏ దేశంవారయినా సరే 'ఆహా! భూతల స్వర్గం!' అని అనుకోకుండా ఉండలేరు. ఎటుచూసినా నీలి మబ్బులనుతాకే తెల్లటి మంచు పర్వతాలు, పచ్చని తివాచీల్లాంటి పచ్చిక మైదానాలు, కొండచరియల నుండి దూకే జలపాతాలు, సెలయేళ్లు, కరగించిన వెండిలా తళతళ మెరిసే జలాశయాలు, స్ఫటికం వంటి స్వచ్ఛమైన మంచునీటి కొలనులు, అందమైన లోయలు, పళ్లతోటలు, పూలచెట్లతో నిండిన స్విట్జర్లాండును చూడటం ఎవరికయినా ఓ అందమయిన అనుభవం అవుతుంది. అందుకనే చాలా మంది సినిమా తారలు, క్రీడాకారులు, గొప్పగొప్ప పారిశ్రామికవేత్తలు తమ హనీమూన్ స్విట్జర్లాండులోనే గడపాలని మోజుపడతారు.



స్విట్జర్లాండు యూరప్ ఖండంలోని ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ దేశాల మధ్య ఉన్న ఓ చిన్న దేశం. ఈ దేశపు వైశాల్యం 41293 చదరపు కిలోమీటర్లు. జనాభా 62,60,000

మన రాష్ట్ర వైశాల్యంలో ఆరోవంతు వైశాల్యం, జనాభాలో పదో వంతు జనాభా మాత్రమే ఉన్న స్విట్జర్లాండు ప్రపంచంలోకెల్లా అత్యధిక పారిశ్రామికాభివృద్ధి సాధించిన దేశాలలో ఒకటవడం విశేషం. అంతేకాకుండా ఇది ప్రపంచంలోని అతి పురాతనమైన ప్రజాస్వామ్య దేశాల్లో ఒకటి.



స్విట్జర్లాండుకు దక్షిణప్రాంతంలో ఉన్న 'ఆల్ప్స్' పర్వత పంక్తులు యూరప్ లోకెల్లా పొడవైనవి. ఇవి ఫ్రాన్స్‌లో మొదలయి స్విట్జర్లాండ్ - ఆస్ట్రియా మీదుగా యుగోస్లేవియాలో అంతమవుతాయి. స్విట్జర్లాండ్ దేశపు దాదాపు నగభాగం ఈ 'ఆల్ప్స్', 'జురా' పర్వతాలు ఆక్రమించాయి. 15 వేల అడుగుల ఎత్తున్న మంచు శిఖరాలు, నెమ్మదిగా కదిలే మంచునదులు, పెద్దపెద్ద మంచుకొండలు చూసినపుడు ఓ విధమైన గగుర్పాటు, భయం, ఆనందం అన్నీ ఒక్కసారిగా కలుగుతాయి. అందంగా కనిపించే ఈ మంచు పర్వతాలు ఒక్కోసారి ప్రాణాంతకంగా కూడా పరిణమిస్తాయి. మంచు తుఫానులు రేగినప్పుడు పెద్దపెద్ద మంచుకొండలు కరిగి కిందికి జారిప

డుతూ దారిలో ఉన్న జంతువులు, చెట్లు, ఇళ్లు, మనుషులను భూస్థాపితం చేస్తాయి. ఒక్కోసారి గ్రామాలకు గ్రామాలే భూస్థాపితం అయిపోతూ వుంటాయి. ఈ పర్వతాలు క్రమంగా ఎత్తు తగ్గుతూ మైదానంగా మారిపోతాయి. పర్వతాగ్రాల మీదున్న చల్లని వాతావరణం క్రమంగా ఆహ్లాదంగా మారుతుంది. ఈ ప్రాంతాన్ని 'టిసినో' అంటారు. ఈ టిసినో ప్రాంతంలోనే దాదాపు మూడొంతుల స్విస్ దేశీయులు నివసిస్తారు.

యూరప్ ఖండపు నదులకు తల్లిగా పిలవబడే స్విట్జర్లాండ్ అనేక నదులకు పుట్టిల్లు. వాటిలో 'రైన్' 'రోన్' నదులు ముఖ్యమైనవి. ఈ దేశంలో దాదాపు 1,500 చెరువులు, కొలనులు ఉన్నాయి. దేశమంతా పర్వతాల మయం అవడం వల్ల మొత్తం నేలలో పదోవంతు నేల మాత్రమే ఆహారధాన్యాలు పండించడానికి అనువుగా ఉంటుంది. అందువల్ల ఆహారపదార్థాలు ఎక్కువగా విదేశాల నుండే దిగుమతి చేసుకుంటారు. వీరు ఎక్కువగా కూరగాయలు, పళ్లు పండిస్తారు.

స్విట్జర్లాండులో పండే పళ్లు రుచికి, పరిమాణానికి కూడా ప్రసిద్ధి పొందాయి. వీటితో జామ్‌లు - జెల్లీలు తయారుచేసి విదేశాలకు ఎగుమతి చేస్తారు. ఆల్ఫైన్ పచ్చిక మైదానాల్లో గొర్రెలు, మేకలు, ఆవులు ఎక్కువగా వృద్ధిచెందడం వల్ల స్విట్జర్లాండులో పాలు సమృద్ధిగా ఉంటాయి. వెన్న, మీగడ, జున్ను విదేశాలకు ఎగుమతి చేస్తారు. వీరు ఏటా 40,000 టన్నుల జున్నును ఎగుమతి చేస్తున్నారు. జున్ను తయారీలో రంగు, రుచి, వాసన, నీటిశాతం మొదలైన అన్ని విషయాలలోనూ శ్రద్ధవహిస్తారు. చివరికి ఒక జున్ను ముక్కలో ఎన్నిరంధ్రాలు ఉన్నదీ కూడా ఖచ్చితంగా గమనిస్తారు. స్విస్ చాకొలెట్స్ కూడా ఎంతో ప్రసిద్ధిపొందాయి. ఏటా 76,605 మెట్రిక్ టన్నుల చాకొలెట్స్‌ను ఎగుమతి చేస్తున్నారు.

స్విట్జర్లాండులో పారిశ్రామికాభివృద్ధి ఎంత తక్కువకాలంలో ఎంత వేగంగా జరిగిందో చెప్పడానికి ఓ చిన్న కథ చెబుతారు. క్రీ.శ. పదిహేడవ శతాబ్దంలో స్విట్జర్లాండు గుండా ప్రయాణిస్తున్న





ఓ ఆంగ్లేయుడు తన చేతి గడియారం పాడయితే బాగుచేయడానికి ఓ కంసాలికి ఇచ్చాడట. ఆ కంసాలి సునిశితమైన ఆ గడియారపు పనితనాన్ని చక్కగా అర్థంచేసుకొని దాన్ని బాగుచేయడమే గాకుండా, దాని నకలు కూడా చేయగలిగాడట. అలా ప్రారంభమైన స్విస్ గడియారాల ఉత్పాదన నేడు సంవత్సరానికి ఏడుకోట్లకు చేరుకొంది. ఇందులో95 శాతం విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. స్విట్జర్లాండులో గడియారాల తరువాత ముఖ్యమైన పరిశ్రమలు రసాయనిక పదార్థాలు, మందులు. ఇవేకాకుండా ప్లాస్టిక్, సిరా, రంగుల భారీ పరిశ్రమలు కూడా ఉన్నాయి. ఇక్కడ ముద్రించబడుతున్న వైజ్ఞానిక రంగానికి, కళలకు సంబంధించిన పుస్తకాలు ప్రపంచ ప్రఖ్యాతి వహించాయి.

1848లో 'బెర్న్' రాజధానిగా 23 కాంటోన్స్ (రాష్ట్రాలు)తో, నూతన రాజ్యాంగంతో స్విస్ కాన్ఫెడరేషన్ రూపొందింది. వీరి రాజ్యాంగం అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగాన్ని పోలి



వుంటుంది. సాధారణంగా 'స్విట్జర్లాండ్ ప్రజలకు వారి దేశాధ్యక్షుడు ఎవరో తెలీదు' అంటూ ఉంటారు. అంటే వారు అజ్ఞానులని కాదు - వారికి అధ్యక్షుడు ఎవరో తెలుసుకోవాల్సిన అవసరం కూడా లేనంత సమర్ధవంతంగా ప్రభుత్వ యంత్రాంగం పనిచేస్తోందని అర్ధం. స్విట్జర్లాండు ప్రభుత్వం ఒక వ్యాపారసంస్థలాగానూ, ప్రతి పౌరుడూ అందులో భాగస్తుడు అయినట్లుగానూ పనులు క్రమబద్ధంగా జరిగిపోతూ ఉంటాయి. అయితే స్విస్ రాజ్యాంగంలో ఓ లోపం ఉంది. 1971 దాకా అక్కడి స్త్రీలకు ఓటు హక్కు ఉండేది కాదు. ఇప్పుడు కూడా స్థానిక ఎన్నికలలో వారికి ఓటు హక్కు లేదు.



మన దేశంలాగానే స్విట్జర్లాండు కూడా భిన్నత్వంలో ఏకత్వానికి ఓ మంచి ఉదాహరణ. 62-60,000 జనాభా మాత్రమే ఉన్న ఈ చిన్న దేశంలో నాలుగు రకాల భాషలు మాట్లాడే ప్రజలు ఉన్నారు. దాదాపు 68 శాతం ప్రజలు జర్మన్,



18 శాతంమం ఫ్రెంచి, 10 శాతం ఇటాలియన్, 2 శాతం రోష్ భాషలు మాట్లాడతారు. మిగతా వారు ఇతరభాషలు మాట్లాడతారు. జర్మన్, ఫ్రెంచి, ఇటలియన్ భాషలు స్విస్‌దేశపు అధికారభాషలు. స్ సాహిత్యం చాలా భాగం జర్మన్ భాషలోనే ంది. ఇక్కడ ఉన్న మూడు రేడియో స్టేషన్లను, రాడు టి.వి. స్టేషన్లను ప్రభుత్వమే నిర్వహిస్తాం. వీటిలో అధికార భాషలయిన జర్మన్, ఫ్రెంచి, ఇటాలియను భాషలలో కార్యక్రమాలు ప్రారం చేస్తారు. రేడియోలో వ్యాపారప్రకటనలు సలు ఉండవు. టి.వి.లో సెలవురోజు కాకుండామిగ ా రోజుల్లోరోజుకి 20 నిముషాలు మాత్రవ్యాపార ప్రకటనలు ఉంటాయి.

స్విజాండులో నిరక్షరాస్యత అన్నమాటేలేదు. పిల్లలందరూ తప్పనిసరిగా పదహారేళ్ల వరకూ స్కూలుకు వెళ్లాలి. అక్కడి పబ్లిక్‌స్కూల్స్ ఎంత పేరుప్రఖ్యాతులు పొందాయంటే, ఎంతో మం విదేశీయులు తమ పిల్లలను స్విట్జర్లాండ్

లోనే హాస్టల్స్‌లో ఉంచి చదివిస్తున్నారు. ప్రతి రోజూ దాదాపు 400 వార్తాపత్రికలు వెలువడుతున్నాయి. ఏటా దాదాపు 5,000 పుస్తకాలు ప్రచురిస్తున్నారు.

జూరిచ్, బేసెల్ జెనీవాలు స్విట్జర్లాండులో ముఖ్య నగరాలు. జూరిచ్ జనాభా. 6,60,000 ఇది స్విస్‌దేశపు వాణిజ్యానికి, బ్యాంకులకు కేంద్రం. బేసెల్ మేళ్ల నగరంగా ప్రసిద్ధి చెందింది. అక్కడ ఉ. ఆర్ట్‌మ్యూజియమ్, విశ్వవిద్యాలయం ప్రపంచప్రఖ్యాతి వహించాయి. జెనీవాలో 1930లో 'గ్ ఆఫ్‌నేషన్స్'కు స్థావరమైన విశాలమైన భవంతి ఇప్పుడు 'యునైటెడ్ నేషన్స్' కార్యాలయం ఉపయోగిస్తున్నారు. అంతర్జాతీయ కార్మికసంస్థ, యూరప్ అణుశక్తి పరిశోధనా సంస్థ, ఇంకా అనేక ఇతర అంతర్జాతీయ ప్రధాన కార్యాలయాలు కూడా జెనీవాలో ఉన్నాయి.

---

మొదటి - రెండవ ప్రపంచయుద్ధాల సమయంలో స్విట్జర్లాండు ఏ పక్షకీ చెందకుండా తటస్థదేశంగా ఉండిపోవడంతో స్విస్ బ్యాంకుల





పరపతి, విలువ బాగా పెరిగాయి. దీనికి తోడుగా 1934లో చేసిన 'స్విస్‌బ్యాంకింగ్ లా' ప్రకారం ఖాతాదారుల అనుమతి లేకుండా వారి అకౌంట్ వివరాలు ఇతరులకు తెలియజేయడం చట్టరీత్యానేరం అయింది. దీంతో ప్రపంచంలోని వివిధ దేశస్థులు తమ ప్రభుత్వానికి లెక్కచెప్పలేని సంపదనంతటినీ స్విస్ బ్యాంకుల్లో దాచుకోవడం మొదలుపెట్టారు.

1983 నాటికి స్విట్జర్లాండులో 5,107 బ్యాంక్ బ్రాంచిలు ఉన్నాయి. వీటివల్ల ప్రభుత్వానికి ఏటా దాదాపు 150 కోట్ల రూపాయలు లభిస్తోంది. స్విస్‌బ్యాంకుల్లో ఉండే మరో సదుపాయం - అకౌంట్‌నంబరు పద్ధతి. వ్యక్తి పేరుమీద కాకుండా ఒక ప్రత్యేకమైన 'నంబరు' మీద లావాదేవీలుజరుగుతుంటాయి. దాంతో స్విస్ బ్యాంక్‌ల ఖాతాదారుల వివరాలు తెలుసుకోవడం మరీ కష్టమవుతుంది. అయితే అంతర్జాతీయ నేరస్థుల ముఠాలు కొన్ని ఈ అవకాశాన్ని దుర్వినియోగపరచటం గమనించిన అమెరికా, స్విస్ దేశాలు ఒక ఒప్పందం కుదుర్చుకొన్నాయి. దాని ప్రకారం ఒక వ్యక్తి అతని స్వదేశంలో నేరస్తునిగా నిరూపించబడితే అతని కేసు వివరా

లను స్విస్ దేశం పరిశీలిస్తుంది. ఆ వ్యక్తి నిజంగానే దోషి అని స్విస్ దేశానికి నమ్మకం కలిగితే అతని బ్యాంక్ అకౌంట్ వివరాలను పరిశీలించడానికి ఆ వ్యక్తి స్వదేశప్రభుత్వానికి అనుమతి ఇస్తారు. అయితే పన్నులు ఎగవేయడం, అపనమ్మకం వంటి నేరాలను స్విస్ ప్రభుత్వం ఖాతరుచెయ్యదు. స్మగ్లింగ్, హత్యలు మొదలయినవాటిని మాత్రమే నేరాలుగా గుర్తిస్తుంది.

స్విట్జర్లాండ్ క్రీ.శ. 1800వ సంవత్సరం నుండీ కూడా ప్రపంచం నలుమూలల నుండీ పర్యాటకులను ఆకర్షిస్తోంది. ఏటా దాదాపు అర వైలక్షల మంది పర్యాటకులు స్విస్‌దేశాన్ని సందర్శిస్తున్నారు. యేటా వీరివల్ల దాదాపు 35 కోట్ల డాలర్లు ప్రభుత్వానికి లభిస్తోంది. యాత్రీకులకు సకలసదుపాయాలతోవేలకొద్దీ హొటల్స్ నడుపుతున్నారు. ఇక్కడి స్కేటింగ్, స్కయింగ్, బోటింగ్,







ఫిషింగ్ వంటి అనేక వినోద కార్యక్రమాలు టూరిస్టులను విపరీతంగా ఆకర్షిస్తాయి. ఇవేకాకుండా 'పర్వతారోహణ' కూడా ఒక ముఖ్యమైన వినోద కార్యక్రమం. లేక్‌జెనీవాలో జరిగే 'వాటర్‌స్పోర్ట్స్' ప్రపంచ ప్రసిద్ధి చెందాయి. ఈ దేశపు అందచందాలు చాలామందిని ఆకర్షిస్తే, ఆరోగ్యం కోసం, నిర్మలమైన కొండగాలి కోసం వచ్చేవాళ్ల సంఖ్య కూడా తక్కువేమీకాదు. స్విట్జర్లాండ్ అంతే పర్వతాలమయంగా ఉన్నా వారు పర్వతాల గుండా సొరంగాలు తవ్వి చక్కటి రవాణా సౌకర్యాలు ఏర్పరచుకొన్నారు. బేసల్‌లో ఉన్న స్విస్ దేశపు ఏకైక నౌకాశ్రయాన్ని రైను నది నార్త్‌సీతో కలుపుతుంది. జెనీవాలో, జూరిచ్‌లో అంతర్జాతీయ విమానాశ్రయాలు ఉన్నాయి. ప్రైవేటుగా నడపబడుతున్న ఒకే ఒక అంతర్జాతీయ విమాన సంస్థ దాదాపు 40 దేశాలకు విమానాలు నడుపుతోంది.

స్విట్జర్లాండులో మతపరమైన ఆంక్షలు ఏవీ ఉండవు. పౌరులు తమకు ఇష్టమైన మతాన్ని అనుసరించవచ్చు. ఈ దేశానికి ప్రత్యేక మైన సైనికదళాలు ఉండవు. కానీ ప్రతి పౌరుడూ సంవత్సరానికి ఒక నెల సైనిక శిక్షణ తప్పనిసరిగా పొందాలి. వారు తమ ఆయుధాల ను, యూనిఫామ్‌ను ఇంట్లోనే భద్రపరుస్తారు. ఈ సైనికదళాన్ని 'సిటిజెన్స్ ఆర్మీ' అంటారు. క్రీ.శ. 500వ సంవత్సరం నుండీ ఏ యుద్ధంలోనూ పాల్గొనకుండా తటస్థదేశంగా ఉన్న స్విట్జర్లాండును ప్రపంచ శాంతికి ప్రతీకగా చెప్పుకోవచ్చు.

— స్వర్ణలత



'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొంది జులై సంచికలో ప్రచురితమైన 'జీవితం చేజారనీయకు' పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగావున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు.

# జీవితం చేజారనీయకు పై చతుర సమీక్షలు

## ఉన్నతవర్గాలకు చెందిన మహిళల నవల

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

ఏదో ఒకచోట భర్తో, అత్తగారో పెట్టే హింసలకు తట్టుకోలేక ఆత్మహత్యా చేసుకోవటమో, లేక వారిచేతిలో హత్యగావింపబడటమో, జరిగిందనే వార్తలు ఈ మధ్యకాలంలో దాదాపు ప్రతిరోజూ వింటూనే ఉన్నాం. అయితే ఆ చిత్రహింసలు భరించలేక, అక్కడ సర్దుకుపోలేక అత్తవారిల్లు వదిలి పుట్టింటికి రావడమనేది మాత్రం చాలా అరుదు. దాదాపు నవలంతా నిర్మల కథతోనే నిండివుంది. తనకెదురైన అనుభవాలన్నింటిని విద్యకుచెప్పి, భర్తకు దూరమైన స్త్రీ నేటిసమాజంలో మానసికంగా నిలదొక్కుకోలేదని, అందువల్ల భర్త దగ్గరకే వెళ్లి అతడిని తగురీతిలో మెల్లగా మార్చుకొమ్మని సలహా ఇస్తుంది. ఆ ప్రకారమే విద్య తను మారినట్లుగా నటించి, ఓర్పుతో భర్తను మార్చుకొని, తన కథను సుఖాంతం చేసుకుంటుంది. అంతవరకు కథ బాగానే ఉంది. భర్త వొదిలేసిన స్త్రీకి సమాజంలో వుండే చిన్నచూపు, సూటిపోటి మాటలు, విమర్శలు ఇవన్నీ వాస్తవానికి దగ్గర్లోనే వున్నాయి. అందుకే సమాజం ఏ ధోరణిలో వుంటే ఆ ధోరణిలో మనం అడ్జస్టయిపోవాలని రచయిత్రి చెప్తున్నారు.

అయితే ఈ నవలలో ముఖ్యమైన లోపమేమిటంటే తప్పనిసరి పరిస్థితుల్లో అయినాసరే, భర్తనుంచి విడిపోయిన మహిళను నిరాశపర్చే విధంగా వుందీకథ. మెట్టినింటివారు కట్నంకోసమో, మరే ఇతర కారణాలవల్లనో హత్యచేయడానికి కూడా వెనుకాడని పరిస్థితిలో ఒక యువతి అక్కడే సర్దుకుపోవాలంటే: కష్టం. అలాంటి పరిస్థితిలో పుట్టినిల్లు చేరిన స్త్రీకి మరేవిధమైన దారీ వుండదనీ, నిరాశ, నిస్పృహలతోటే జీవితం గడుస్తుందంటూ జీవితాన్ని కదలని రైలుబండితో పోల్చారు రచయిత్రి. తనకాళ్లమీద తను నిలబడగలిగినా సామాజిక కట్టుబాట్లు, సూటిపోటి మాటలతో ఎంతటివారికైనా నిస్పృహ కలుగుతుందని రచయిత్రి అంటున్నారు. వంటరి బతుకుతో విసుగు కలిగి, జీవితం రొటీన్‌గా వుంటుందని అంటున్నారు. అది నిజమే కావచ్చు. కానీ కేవలం తనజీవితం తను బతికేందుకే అనుకుంటే మాత్రమే అలాంటి విసుగు, నిస్పృహ కలుగుతాయి. అలాకాక మరే యితర వ్యాపకాలనో, పరమావధినో ఎన్నుకుంటే తన జీవితం తనకు రొటీన్‌గా, నిరుత్సాహంగా వుండదు. అనాథలైపోయిన బాలలెందరో నేడు దేశంలో వున్నారు. వారిలో ఏ ఒక్కరిని పెంచుకున్నా నిర్మలకు అసంతృప్తి, నిర్లిప్తత వుండదు. కథలో ఇద్దరూ ఉన్నతవర్గాలకు చెందిన మహిళలే. వారికి ఆర్థికంగా ఏ ఇబ్బందీలేదు.

కనుకనే ఈ నవల ఉన్నతవర్గాల మహిళలది. కానీ సాధారణ కుటుంబీకులది కాదు. అయినా ఊహల్లో విహరించకుండా, వాస్తవంలోకి రమ్మని కన్నెపిల్లలకు సందేశాన్నిస్తున్నదీ నవల. మంచిచెడులు రెంటినీ విశ్లేషిస్తూ ఈ నవల సాగివుంటే బాగుండేది.

—యం. కిన్నెర, అనంతపూర్.

## జీవిత సత్యం

(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)

'జీవిత సత్యాలను' కాచి వడపోసిన 'మందారమాల' ఈ నవల. "కాపురం వదలిన ఆడపిల్ల కన్నతల్లికే లోకువ". "వద్దించిన విస్తరిని తన్నుకుంటూపోతే మన అహం మనకే శత్రువు అవుతుంది", "ఆడది స్వంతంకాగానే ఏ ప్రత్యేకతా కనబడదు మగాడికి" ఇలాంటి జీవితసత్యాలు ఎన్నో ఈ నవలనిండా. ఇవన్నీ చదివి అర్థంచేసుకున్న ఏ ఆడపిల్లా విలువైన జీవితాన్ని చేజారనివ్వదు.

సున్నితం, లాలిత్యం, సెన్సాఫ్ హ్యూమర్, భార్యని తన జీవిత భాగస్వామిగా గౌరవించి, ప్రేమించే మనస్సు లేని భర్తలతో జీవితం నరకమే. అందుకని, చదువు ఇచ్చిన వ్యక్తిత్వంతో ఏమీ తెలియని ఈ మూర్ఖుడితో కలిసి బ్రతకడం ఎందుకని ఆవేశ పడక; చదువు నేర్పిన సంస్కారంతో, ఆత్మవిశ్వాసంతో, 'వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం, సమానత్వం అనే స్లోగన్స్‌ను కొంచెంసేపు జోకొట్టి, కొంచెం విద్యలా ఆలోచించి నడు— ఓ అమ్మాయి' అని వెన్నుతట్టి చెప్తుందీనవల.

చదువు ఇచ్చిన వ్యక్తిత్వంతో స్త్రీ ఇదివరకులాగా ఎలాపడివుండగలదు? అంటే 'ఎన్నితరాలుమారినా మనబతుకు ఇలా మగవాడి ముందు తలవంచి బతకవల్సిందేనా?' అనే ఆవేదన ఒక్కవిద్యదేకాదు నేటి స్త్రీలందరిదీ. అయితే ఇలాఆవేదనతో, ఆవేశపడి నిర్మలలా జీవితం చేజార్చుకోవద్దు అని హెచ్చరిస్తుందీనవల.

—కె.సుషమ, హైదరాబాదు

## పిరికిమందు

(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)

పురుషాహంకారానికి తలవొగ్గి బతకలేక, తన కాళ్లపై తాను నిలబడి జీవించే ఒకవిద్యాధికురాలు, స్వానుభవంతో, మరో విద్యాధికురాలికిచ్చిన సందేశం 'జీవితం చేజారనీయకు' చదువుతుంటే, ఆక్రోశంతో గుండెబ్రద్దలయ్యేలా వుంది. ఏ అనుభూతులకూ నోచుకోని బతుకు వ్యర్థమనీ, మార్పులేని జీవితంకంటే కష్టాలు, కన్నీళ్లూ వున్న జీవితం బెటరనీ, మగాడికి తొలిరోజుల్లో సెక్స్‌పట్ల వున్న బలహీనత ను కేష్‌చేసుకొమ్మనీ, స్త్రీని విమర్శించని సమాజం వచ్చేవరకూ లొంగి బ్రతకటం వినా దిక్కులేదనీ, లెక్చరర్ అయిన ఒక 'స్త్రీ' విద్యాధికురాలైన మరో స్త్రీ'కి పిరికిమందు పోయడం ఎంతోనీచంగా, హేయంగావుంది. భర్తతోడి జీవితమని చెప్పిన ఉపాధ్యాయిని సలహా ననుసరించి, భర్త ఛీత్కరిస్తున్నా, అవమానకరంగా ప్రవర్తిస్తున్నా ఆత్మాభిమానాన్ని చంపుకొని బ్రతకడానికి విద్యావతియైన స్త్రీ సిద్ధపడటం జుగుప్సాకరంగా వుంది. లైఫ్‌ఈజ్ నథింగ్ బట్ ఎన్ అడ్జెస్ట్‌మెంట్ అని రచయిత్రి చెప్పినమాట నూటికి నూరుపాళ్లు నిజం. ప్రతి స్త్రీ సాధ్యమైనంతవరకూ అడ్జస్ట్‌కావాలనే ప్రయత్నిస్తుంది. సుఖమైన జీవితాన్ని చేజేతులా జారవిడుచుకోదు యే ఆడదీ. అలాగని దుర్మార్గుడైనా, క్రూరుడైనా, కన్నీళ్లతో, నిట్టూర్పులతో, బానిస బ్రతుకు బతకమనికాదు. అవసరమైతే, స్త్రీ భర్తను విడిచి, బయటకు వచ్చే ధైర్యం కలిగివుండాలి. ఎంతోమంది అమాయక స్త్రీలు పిరికితనంతో, ఆత్మహత్యలు చేసుకోవడం చూస్తూనే వున్నాము. రచయితలకు, తమరచనలద్వారా, సమాజంలో ఎంతో మార్పు, చైతన్యం తీసుకొని రాగలశక్తి వుంది. తమ రచనలద్వారా స్త్రీలకు ధైర్యం, శక్తి స్వేచ్ఛావాయువు పీల్చగలిగే వాతావరణాన్ని ఇంజక్ట్ చేయాలి. ముఖ్యంగా రచయిత్రులు.

—యమ్.ప్రేమలీల, లక్సెట్టిపేట.

## అపశృతి

(రు: 25/- బహుమతిపొందిన సమీక్ష)

ఇరవైఏండ్లు విడివిడిగా పెరిగిన స్త్రీపురుషులు కొంత స్వార్థత్యాగం చేస్తేనే వివాహానంతరం కలిసి జీవించడం సాధ్యమౌతుందనేది నిజమే. కాని "తొలి రోజుల్లో మగవాడికి సెక్స్‌పట్లగల వీక్‌నెస్‌ని ఆడది కాష్ చేసుకోగలిగితే మన గుప్పిట్లో చిక్కినట్లే" అంటూ రచయిత్రి సంసారం నిలబడటానికి చెప్పిన టెక్నిక్స్‌లో మనసుకు ప్రాధాన్యత లేదు.

తండ్రి అండ, ఉన్నత ఆర్థికస్థితి ఉండి, విద్యావతి అయిన నిర్మల కూడా కోల్పోయిన సంసారాన్ని అనుక్షణం తలచుకొని చివరకు తప్పుచేసాను అనుకుంటుందే! అంతకంటె ఈనాటి స్త్రీ ఇంకేమీ చేయలేదా?

స్త్రీపురుషులలోని మౌలికమైన లోపాలను ఎత్తిచూపే నవలలు రావలసిన తరుణం ఇది "మేల్ డామినేటెడ్ సొసైటీ" అంటూనే ఆ డామినేషన్‌ను సమర్థించడం ఈ ఇరవయ్యో శతాబ్దంలో తగదు. రచయిత్రుల నవలల్లోనే ఈ అపశృతులు పలకడం శోచనీయం.

యస్. పార్వతి హైదరాబాదు-28

## జీవితం చేజారనీయకు

(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)

స్త్రీలు విప్లవాలు లేవదీస్తున్న ఈ రోజుల్లో డి.కామేశ్వరిగారి 'జీవితం చేజారనీయకు' నవల నిజంగా ఒక ప్రయోగం. 'స్వేచ్ఛ'కు ప్రథమతాంబూలమిచ్చిన 'చతుర' ఈ నవలకు ప్రత్యేక ప్రశంసలనివ్వడం గమనార్హం.

ఊహల ఆకాశంనుండి వాస్తవాల భువికి రమ్మని నేటి ఆధునిక యువతికి ఒక హెచ్చరికలాంటిది ఈ నవల. ఒకవిధంగా స్పీడ్ బ్రేకర్‌కూడా. సాంప్రదాయాలకూ, ఆధునికతకూ మధ్యన కొట్టుమిట్టాడుతూ జీవితంపట్ల సరైన అవగాహన కోల్పోయి, ఉక్కిరిబిక్కిరౌతున్న నాగరిక యువతిని ఆలోచనలో పడేటట్లు చేసింది.

"మేరేజ్ ఈజ్ నథింగ్ బట్ జస్ట్ ఎన్ఎడ్జెస్ట్‌మెంట్" అని నిర్మల స్వానుభవంగా విద్యతో చెప్పిన ఈమాట నిజంగా నిజం. వాస్తవికతను మరచి కలలలో తేలియాడే ఆధునిక యువతి, తానుచూసిన సినిమాలు, కాలక్షేపం నవలలు దాంపత్యానికి ప్రమాణంగా తీసుకుని, నిజజీవితంలో అవి లభ్యంగాక, తానొక్కతే దురదృష్టవంతురాలననుకుంటుంది. అవతలి మనిషిమీద నెపంవేయడంలో తనకర్తవ్యమేమిటో మరచిపోతుందనే ఈ విషయాన్ని అతినున్నితంగా తెలియజెప్పారు రచయిత్రి.

ఈతరం యువతులకు ఈ నవల ఒళ్లు మండించినా, ఆవేశం తగ్గి, ఆలోచన చోటుచేసుకున్నాక ఇందులోని నీతి ఏమిటో అర్థమవుతుంది.

—వి.సంపూర్ణాదేవి, కావలి

## ఎడ్జస్టు కాగూడని జీవితం

(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)

కొత్త మలుపు నవలతో 'చతుర' పాఠకులకి చక్కని సందేశం అందించిన డి.కామేశ్వరిగారి 'జీవితం చేజారనీయకు' నవల చదివిన తర్వాత కొన్నిప్రశ్నలు నన్ను వెంటాడుతున్నాయి. కొంతసహనం చూపిస్తే సంసారాలు చక్కబడతాయని గతంలో చాలా సినిమాల్లో చూపారు. అదే విషయాన్ని ఈ రచయిత్రి కొంచెం కన్విన్సింగ్‌గా చెప్పారు. కాని ఆ సహనాన్ని స్త్రీ మాత్రమే ఎందుకు చూపాలి? అది స్త్రీకి ఆభరణమా? శృంఖలమా? అది పురుషులకి ఎంతమాత్రం అవసరంలేనిదా?

జీవితం స్త్రీ పురుషులిద్దరిదీ అయినపుడు జీవితం చేజారిపోతుందేమో అన్న భయం స్త్రీకే ఎందుకుండాలి? పురుషుడి జీవితాన్ని అతని గుప్పెట్లోనే వుంచే సామాజిక శక్తులేమిటి?

ఇంకోముఖ్యమైన విషయం జీవితం అంటే స్త్రీపురుషులు కలిసి చేసే సంసారమేనా? అంతకుమించినభావం ఏదీలేదా? ఏదో ఉన్నతమైన ఆశయంకోసం సంసారాన్ని కాదనుకున్నవాళ్లు జీవితాన్ని చేజార్చుకున్నవాళ్లేనా? ఏ ఆశయమూ లేకుండా చెడిన సంసారంగురించి పదేపదే బాధపడేవాళ్లకి రచయిత్రి చెప్పిన మార్గం సరైనదే అన్పించవచ్చు. కాని ఇలాంటి పరిస్థితి ఎల్లకాలం కొనసాగాలా?

శ్రీమతి కామేశ్వరిగారే 18 ఏళ్లక్రితం రాసిన 'అరుణ' అనే ఆ నవలలో డాక్టర్ అరుణ పల్లెటూరిలో ప్రాక్టీస్ పెట్టాలన్న తన ఆశయాన్ని మన్నించలేదని ప్రేమించిన వ్యక్తిని కూడా దూరంచేసుకుంటుంది. అప్పుడే అంతబలమైన వ్యక్తిత్వాన్ని సృష్టించిన కామేశ్వరిగారు సీనియర్ రచయిత్రిగా ఈనాడు జీవితానికి ఎడ్జస్టు కమ్మని సలహా ఇస్తున్నారు. కాని జీవితంలో ఏదోసాధించినవారందరూ అలా ఎడ్జస్టు కానివారే!

—యస్.కె.మోహనరావు, పెదపూడి.

కవరు పేజీ ఫొటోగ్రాఫర్: కె.ఎల్. కుమారస్వామి

# చతుర ప్రపంచం







## పిల్లి కథలు

కుక్కలాగే పిల్లి కూడా పెంపుడు జంతువులా గృహారామాలలో విహరిస్తూ వుంటుంది. కాళ్లకి అడ్డుతగులుతూనో, పాలు పెరుగుల పనిపడుతూనో, సోఫాల్లో కునుకు దీస్తూనో, మంచంపై ఓ వారగా నడుంవాల్చో, పులుకు పులుకున చూస్తూనో ఇళ్లలో దర్శనమిస్తూ వుంటుండే ఈ పిల్లుల కథలెన్నో వాడుకలో వున్నాయి.

హిందూమతంలో పిల్లిని చంపడం పాపమని భావిస్తారు. విశేషమేమిటంటే- ఎందరో గొప్పగొప్పవారికి పిల్లి అభిమాన జంతువుగా వుండి వారి ప్రేమాభిమానాలు చూరగొంది. ముస్లిముల తొలి మతబోధకుడు "మహమ్మదు" మ్యూజా అనే తన పెంపుడు పిల్లిపై ఎంతో ప్రేమ చూపేవాడు. అది ఎప్పుడూ ఆయన ఒళ్ళో కూర్చునేది. ఆయన మతపరమైన బోధలు చేసేటపుడు కూడా ఆయన్ని వదిలేదికాదు. ఒకసారి ధ్యానంలోవున్న మహమ్మద్ దుస్తులపై పడుకుంది. మహమ్మద్ ధ్యానం నుండి తెరుకుని తన వంటిపైని బట్టలపై పిల్లి పడుకోవటం చూసి దానికి నిద్రాభంగం కలిగించటం ఇష్టంలేక తన దుస్తుల్ని అంతమేరా చింపేశాడు.

ప్రఖ్యాత శాస్త్రవేత్త సర్ ఐజాక్ న్యూటన్ "పుస్సీ" అని పిలుచుకునే తన పిల్లితో ఎంతో అనుబంధం పెంచుకున్నాడు. పడుకునేటపుడు కూడా ఆయన గదిలోనే ఆయనతోపాటే పడుకునేది. తన గది తలుపుకి రెండు రంధ్రాలు ప్రత్యేకంగా పిల్లిగారి రాకపోకల నిమిత్తమై చేయించాడు న్యూటన్. న్యూటన్ తన ప్రయోగాలు చేసుకునేటపుడు కూడా పిల్లి ఆయన టేబిల్‌పైనో, ఒళ్ళోనో ఆడుకుంటూ కూర్చునేది.

ఇంగ్లాండు మేయరుగా మూడుసార్లు ఎన్నికైన డిక్ విటిన్గ్టన్ తన గెలుపుకి తన పిల్లే కారణమని నమ్మేవాడు. దానిని అతనొక పెన్నీకి కొన్నాడు. కొన్నేళ్ల తరువాత డిక్ ఇల్లు పునఃనిర్మించినపుడు ఒక పిల్లవాడు పిల్లిని పట్టుకున్నట్లున్న ఒక విగ్రహం నిర్మింపచేశాడు. ఇది పిల్లిపట్ల డిక్‌కిగల అభిమానానికి నిదర్శనం. ఇంగ్లీమ పిల్లలు "డిక్, అతని పిల్లి" కథలు చెవులు కోసుకుని మరీ వింటారు.




కవి మాథ్యూ అర్నాల్డ్‌కి పిల్లులంటే మక్కువ ఎక్కువ. ఆయన రాసుకునేటపుడు కూడా "అటోసా" అను పెంపుడు పిల్లి ఒళ్ళో కూర్చునేది. ఆ పిల్లి మ్యావ్‌మంటేనే కవిత్వం రాసుకోవడానికి తనకొకవిధమైన ఉత్తేజం, ఉత్సాహం కలిగేవని అర్నాల్డ్ చెప్పేవాడు.

పిల్లిని దేవతగా కూడా భావించి పూజించేవాడు మనిషి. ప్రాచీన ఈజిప్టులో పిల్లిని చంపటం నేరంగా భావించేవారు. పిల్లుల జ్ఞాపకార్థం గుళ్ళు కట్టించేవారు. పిల్లి చనిపోయినపుడు శోక సంకేతంగా కుటుంబంలోనివారు కుడి కనుబొమ్మ వెంట్రుకలను నున్నగా గొరిగించుకునేవారు. ఈనాటికీ ఈజిప్టులోని అతిపెద్ద నగరమైన కైరోలో పిల్లులకు ప్రత్యేక వసతిగృహాలు న్నాయి.

ప్రస్తుతం లెక్కలేనన్ని ఫ్యాక్టరీలు పిల్లికి ఆహారపదార్థాలు తయారుచేయడానికివెలి శాయి. పిల్లికి సమతలాహారం నిర్ణయించడా నికి పరిశోధనకోసం బ్రిటన్ ఎంతో ధనం వ్యయించేస్తూవుంది. 1949లో బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ అనే పిల్లిని విక్టోరియా క్రాస్‌తో గౌరవించింది. కారణం ఆ పిల్లి రెండవ ప్రపంచయుద్ధంలో ఎక్కువ ఎలుకల్ని భోంచేసిందిట.

పిల్లికి ఘ్రాణశక్తి అధికం. అందుకే యజమాని కావాలని ఎక్కడో దూరాన వదిలిపెట్టినా ఇల్లు సులభంగా వెతుక్కుని నేరుగా ఆ ఇంట్లోకే వస్తుంది. చీకట్లో కూడా అది నడవగలదు. వాసన్ను పసికట్టి తను కోరుకున్నచోటికి చేరనూగలదు.




# తపాలాబిళ్ళ పుట్టుక

**నే**డు తపాలాబిళ్ళల సేకరణ అసంఖ్యాకమైన పిల్లలకేగాక పెద్దలకు కూడా ఓ హాబీగా వుంది అయితే ఈ తపాలాబిళ్లల పుట్టుక గురించి చాలామందికి తెలియకపోవచ్చు.

మొట్టమొదటిసారిగా 1840లో ఇంగ్లండులో తపాలాబిళ్ళను ముద్రించారు. అంతకుపూర్వం గుర్రబ్బళ్ళమీద లేదా గుర్రలమీదా ప్రయాణంచేసి ఉత్తరాలను బట్వాడా చేసేవారు. కానీ ఈ పద్ధతిలో ఉత్తరాలను అందుకునేవారు ఎక్కువమొత్తం కట్టవలసివచ్చేది. దాంతో ఈ పద్ధతి ధనవంతులకేతప్ప సామాన్యులకు అందుబాటులో వుండేదికాదు. కొంతమంది తెలివిగా కొన్ని సాంకేతిక పదాల్తో ఉత్తరాలు రాసేవారు. ఆ ఉత్తరాలు అందుకొన్నవారు ఉత్తరంలోని సారాంశాన్ని గ్రహించేసి ఆ ఉత్తరం తమకక్కరలేదని తీసుకొనేవారుకాదు. దానివల్ల తపాలాశాఖకు చాలా నష్టంవచ్చేది. ఈ సమస్యలనుండీ బయటపడటానికి సర్ రోలాండ్‌హిల్ ఎంతో కృషిచేసి 1840. మే 6వ తేదీన మొట్టమొదటి తపాలాబిళ్ళను ముద్రించగలిగాడు. ఈ తపాలాబిళ్ళని 'పెన్నీ బ్లాక్' అనేవారు. ఈ నల్లటి బిళ్ళమీద విక్టోరియారాణి బొమ్మ వుండేది. దానికి ఒకవైపు 'పోస్టేజ్' అనీ మరోవైపు 'వన్ పెన్నీ' అనీ అక్షరాలు వుండేవి. దేశం పేరు వుండేదికాదు. అదే ఆనవాయితీగా ఇప్పటికీ ఇంగ్లండుదేశపు తపాలాబిళ్ళలమీద రాజు లేక రాణి బొమ్మ మాత్రమే వుంటుంది. కానీ దేశం పేరు వుండదు.

ఉత్తరాలు ప్రయాణించవలసిన దూరాన్ని బట్టీగాక ఉత్తరాల బరువునుబట్టి తపాలా ధర

నిర్ణయించే పద్ధతి కూడా సర్‌హిల్‌గారే ప్రవేశ పెట్టారు. అదే పద్ధతి ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా వుంది. మునుపటిరోజుల్లో ప్రతిదేశంవారూ. వారి దేశాధినేతల బొమ్మలను తపాలాబిళ్ళమీద ముద్రించుకొనేవారు. 1966లో కైరో పట్టణంలో మొట్టమొదటిసారిగా తపాలాబిళ్లల ప్రదర్శన జరిగింది.

ముదట్లో ఈ తపాలాబిళ్ళల రంగులు అంత ఆకర్షణీయంగా వుండేవికావు. రాను రాను వాటి వాడకం అధికం అయ్యేకొద్దీ రంగుల్లో, డిజైన్లలో వైవిధ్యం చూపడం మొదలుపెట్టారు. ఆయాదేశాల్లోని ముఖ్యమైన పక్షులు, జంతువులు, ప్రఖ్యాతి వహించిన వ్యక్తులను తపాలాబిళ్ళలపై ముద్రించడం ప్రారంభించారు. అంతేకాకుండా సంగీతం, సాహిత్యం, ఆటలు, చారిత్రాత్మక సంఘటనలు గురించి కూడా తపాలా బిళ్ళలు విడుదలచేయడం అలవాటయింది. కొన్నిదేశాలవారు చతురస్రాకారంలో కాకుండా త్రికోణాకారంలో, దీర్ఘచతురస్రాకారంలో కూడా తపాలాబిళ్ళలు ముద్రించారు.

తపాలా బిళ్ళలు ముద్రించడంలో తప్పులు జరగడం చాలా అరుదు. 1918లో ఒక అమెరికా దేశపు తపాలాబిళ్ళమీద తలకిందులుగావున్న విమానం బొమ్మను ముద్రించారు. మరో తపాలాబిళ్ళమీద కొలంబస్ బైనాక్యులర్‌లోనుండి చూస్తున్న బొమ్మను ముద్రించారు. నిజానికి కొలంబస్ జీవించివున్ననాటికి బైనాక్యులర్‌ను కనిపెట్టలేదు.

తపాలాబిళ్ళను కనుగొన్న పదునాలుగేళ్లకు అంటే 1854 జులై 1వ తేదీన మనదేశంలో మొట్టమొదటి తపాలాబిళ్ళను విడుదలచేశారు. విక్టోరియా రాణి బొమ్మవున్న ఈ తపాలాబిళ్ళను ఇంగ్లండులోనే ముద్రించారు. 1926 వరకూ కూడా మనదేశపు తపాలాబిళ్ళలను ఇంగ్లండులోనే ముద్రించేవారు. తరువాత మనదేశంలో నాసిక్‌లోని 'ఇండియా సెక్యూరిటీ ప్రెస్'లో ముద్రించడం ప్రారంభించారు. ఈనాడు వెలువడుతున్న తపాలాబిళ్ళలు ఎంతో అందంగా వుండటమే కాకుండా వివిధ దేశాలకు చెందిన అనేక విషయాలను తెలియజేస్తాయి.




## రక్తదాత!

నలభై ఆరేళ్ల ధాకోరేభాయ్ బల్వంతరాయ్‌దేశాయ్ బొంబాయిలో ఓ ఫార్మసిస్టు. కొడిగట్టే జీవనజ్యోతుల్ని రక్తమనే చమురుపోసి వెలిగించటమే అతని ప్రధానాశయం. గత పద్దెనిమిది సంవత్సరాలుగా అతడు సుమారు 18 వేల బాటిళ్ల రక్తం సేకరించాడు. 150 రక్తదాన శిబిరాలని నిర్వహించాడు. 28 సార్లు తనే రక్తదానం చేశాడు.

ప్రజలకు నచ్చచెప్పి నెలకు రమారమి 100 బాటిళ్ల రక్తం సేకరిస్తాడు అతను. బొంబాయిలోని సెయింట్ జార్జి ఆస్పత్రిలో తొలిసారిగా 1968 లో దేశాయి రక్తదానం చేశాడు. తరవాత రక్తదానం గురించి ప్రత్యేక శ్రద్ధాసక్తులు పెంచుకున్నాడు. మృత్యువాత పడబోయేవారికి ప్రాణభిక్ష పెట్టి ఆదుకోగలగడం ప్రతివ్యక్తీ తన బాధ్యతగా గుర్తించాలనే

నిర్ణయానికి ఆనాడే వచ్చాడు. తనకు పరిచయమున్న ప్రతి వ్యక్తినీ రక్తదానం చేయమని ప్రోత్సహించాడు. రక్తదానం చేయటంవలన శక్తినష్టపోతామనే తప్పుడు అభిప్రాయాన్ని జనం తొలగించుకోవాలని అంటాడతను.

స్టెరిలైజ్ చేసిన సూదులూ, పరికరాలూ వాడుతారు కాబట్టి ఎయిడ్స్‌లాంటి వ్యాధులు రక్తబిందువులద్వారా రావటం జరుగదని నిపుణులు వెల్లడించారు. రక్తం ఎక్కించిన రోగికి సంబంధించిన బంధువుల్ని రక్తదానం చేయమని అడుగుతాడు దేశాయి. ముందు వారు సరేనని ఒప్పుకున్నా ఎవరూ మాటమీద నిలబడరట. అయినా "దానాలలోకెల్ల రక్తదానమె గొప్ప" అని అతని నమ్మకం.



# బస్సులో దుకాణం!

ఓ కొత్త వస్తువుని మొదట్లో వింతగా చూసి ఆకర్షింపబడటం, తరువాత ఆదరించటం పల్లెప్రజలకు మామూలే. బస్సులా కన్పించే ఓ దుకాణం గ్రామస్థుల్ని విశేషంగా ఆకట్టుకుని తన యజమానికి ఉపాధినీ, ప్రజలకి సరుకులనీ అందిస్తోంది.

స్వయం ఉపాధి పథకం కింద దుకాణం తెరవాలని సంకల్పించాడు కర్నాటక తాలూకాలోని అందారు గ్రామ నివాసి వడ్రాజాచారి. అతను ఎంతో నైపుణ్యంతో బస్సు ఆకారంలో ఉన్న ఓ దుకాణం తయారుచేశాడు. ఇందుకు ఏడువేల రూపాయలు ఖర్చైనాయి. ఒక నెలరోజుల్లో దీని నిర్మాణం పూర్తయింది. ఇటీవలే దుకాణం తెరిచి అమ్మకాలు ప్రారంభించాడు.

బస్సును పోలిన ఆ దుకాణంలో బడిపిల్లలకవసరమయ్యే స్టేషనరీ, సామాన్యుని నిత్యావసర సరుకులూ, గృహోపకరణాలూ, పింగాణీ పాత్రలూ లభ్యమౌతాయి. జాతర్లలో, అంగళ్ళలో అతని గిరాకీ రెట్టింపవుతుంది. ఎండలో, వానలో, రాత్రింబగళ్ళు సంచరిస్తూనే ఉంటుందీ బస్సు దుకాణం.

దీని నిర్మాణానికి రెండు సైకిళ్ళూ, స్టీలు షీట్లూ, చెక్కబల్లలు, గాజుతలుపులూ అవసరమయ్యాయి. పక్కపక్కనే కూర్చొని ఇద్దరు మనుషులు సులభంగా పెడల్ తొక్కి దీన్ని నడపగలరు. ఒకరు కూడా నడపవచ్చు. ఈ చతుర్చక్ర వాహనంలో బ్రేకులు కూడా అందంగా అమర్చాడు ఆచారి. బ్యాటరీతో పనిచేసే రెండు హెడ్‌లైట్లు బస్సు దుకాణం నడపడానికి దారి చూపుతాయి.

ఆర్డరిచ్చినవారికి ఇలాంటి దుకాణం తయారు చేసి ఇవ్వగలనంటున్నాడు ఆచారి. మరెన్నో కొత్త డిజైన్లను అతను సిద్ధంచేసుకున్నాడు మేధలో. అవి వెలుగు చూడాలని అతని ఆకాంక్ష. ★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 220728. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

ఉషా కిరణ్ మూవీస్

# చందమామ రావే

రామోజీరావు
మాలి



కాశీవిశ్వనాథ్..సత్యం..నవకాంత్..గౌతంరాజు..భాస్కరరాజు..అట్లూరి రామారావు.